# కార్యసాధకులకు సంతృప్తి





అద్భుతమైన రుచి దానికదే సాటి



## సిజర్స్ ఎప్పుడూ సంతృప్తి నిస్తుంది.




ప్రశస్తమైన పొగాకు రుచిని సంపూర్ణమైన సంతృప్తితో సిజర్స్ ఒక్కటే యివ్వగలదు. లక్షల కొలది పొగ త్రాగేవారు సిజర్స్‌తోనే వుండేందుకు ఎంచుకోవడంలో ఆశ్చర్యం లేదు.

చట్టబద్ధమైన హెచ్చరిక:
సిగరెట్ త్రాగడం
ఆరోగ్యానికి హానికరం

STATUTORY WARNING:
CIGARETTE SMOKING
IS INJURIOUS TO HEALTH

HTC-S-4684-3

# ఖర్చులు తగ్గించుకొనేందుకు-
# సిఫార్సుప్రకారం ఎరువులను వాడండి








వర్షాధారపు జొన్నకు సిఫార్సు ప్రకారం ఎరువులను వాడిన చాలా లాభకరం:

ఏ పంటకైనా ఎరువుల వాడకంద్వారా ఒక క్వింటాలు దిగుబడి కయ్యే ఖర్చును తగ్గించవచ్చు. వర్షాధారపు జొన్నకు, సిఫార్సు ప్రకారం ఎరువులను వాడిన, ఒక క్వింటాలు జొన్న పండించటానికి అయ్యే ఖర్చు క్రింద సూచించిన విధంగా తగ్గుతుంది:

| వర్షాధారపు జొన్నపంట | ఎరువులు వేయకపోతే | సిఫార్సు ప్రకారం ఎరువులు వేసినప్పుడు |
|---|---|---|
| ఎకరానికి సాగుబడి ఖర్చు | రూ. 350/-లు | రూ. 569/-లు |
| ఎకరానికి దిగుబడి | 3 క్వింటాళ్లు | 8 క్వింటాళ్లు |
| క్వింటాలుకు ఖర్చు | రూ. 117/-లు | రూ. 71/-లు |

పంట ఖర్చులు తగ్గించుకోవాలన్నా, హెచ్చు లాభాలు పొందాలన్నా సిఫార్సు ప్రకారం ఎరువులను వాడాలి. ఎరువుల వాడకంద్వారా పైరు బెట్ట పరిస్థితులను కూడా బాటావరకు తట్టుకొని, ఆశించిన ఫలితాన్నిస్తుంది.

వర్షాధారపు జొన్న పంటకు అనువైన ఎరువు విజయ్ 24-24-0. ఎకరానికి 50 కిలోల విజయ్ 24-24-0ను, 25 కిలోల విజయ్ యూరియాను కలిపి దుక్కిలో విత్తేటప్పుడు విత్తనానికి 5 సెం.మీ. లోతుగాను, 5 సెం.మీ. ప్రక్కగాను వేయండి.

ఇంకా వివరాలకు ఈ క్రింది చిరునామా నుండి ఈ పంటకు సంబంధించిన పుస్తకాన్ని తెప్పించుకోండి:

ఏరియా మేనేజరు
మద్రాసు ఫర్టిలైజర్సు లిమిటెడ్
44, శాంతినగర్,
హైదరాబాద్ 500 028






పైర్లసరియైనపోషణకు
## విజయ్

| విజయ్ 24-24-0 ఎరువుల నిర్ణీత పరిమాణముల శాతం | |
|---|---|
| నత్రజని | 24 |
| భాస్వరం | 24 |
| పొటాష్ | 0 |
| కింపుడు పదార్థం (మెత్తటి ఇసుక లేక డాలమైట్) | 20 |

HTM-MFL-2790

## జయప్రద

చాల నెలల తరువాత మా అభిమాన వార పత్రికపై మా అభిమాన నటి జయప్రదను చూడ గలిగాం

వి ఈశ్వరరావు, ఇతరులు (తుంగభద్ర డ్యామ్)

## శ్రీదేవి

శ్రీదేవి మెడ కొంచెం పైకెత్తిన బాగుండేది దేశ నాయకుల చిత్రములు ప్రచు రిస్తారని ఆశిస్తున్నాను

ప్రయాగ సుబ్రహ్మణ్యం (రాజమండ్రి)

## అభినందనీయం

నటి శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడ్డ ఆంధ్ర పచిత్ర వారపత్రిక అభినందనీయం.

పి శరత్, పి రాంమోహన్ (సిద్దిపేట)

## చాలా బాగుంది

జయప్రద ముఖచిత్రంగా వెలువడిన పత్రిక ఫెంటాస్టిక్‌గా ఉంది ఈ సంచిక నుండి ప్రారంభమైన కళ్యాణి సోమరాజు గారి దాంపత్య సంగీతం సీరియల్ చాల బాగుంది మమతాం కురాలు, సందెగాలి, గృహమే కదా స్వర్గసీమ కథలు బాగా నచ్చాయి.

కడియాల సురేష్‌బాబు (మంగళగిరి)

## నిలువుటద్దం

"ధర్మో రక్షిత రక్షిత :" సీరియల్ నేటికీ అగ్రకులముగా చెప్పబడుతున్న బ్రాహ్మణ జీవితాల నిజస్వరూపాలు చూపించే నిలువుటద్దము. తరం, తరంలో వస్తున్న మార్పులను రచయిత శ్రీ వెంకట సూర్యనారాయణగారు చక్కగా తెలియ జేస్తున్నారు ధన్యవాదాలు.

గురువెళ్ళి గోవిందరావు, కె వెంకటేశ్వరరావు (ఖర్గపూర్)



## చక్కని అభిప్రాయం

ఆగస్టు 6, 13వ తేదీల సంచికలో కాన్వెంట్ చదువులను గురించి చక్కని అభిప్రాయాలు వ్యక్తం చేసిన రచయితలకు మా అభినందనలు.

బళ్ళారి మహమ్మద్ సలీమ్ (గుత్తి)

## కార్టూన్

నటి జయప్రద ముఖ చిత్రంతో వెలువడిన సంచికలో 44వ పేజీలోని శర్మగారి కార్టూన్ చదివి మా ఇంటిల్లిపాది నవ్వుకున్నాము.

బి గనేశ్వరరావు, ఇతరులు (గజపతినగరం)

## ఏడు కథలు

నేనూ ఒకప్పుడు ఫాన్‌నే అన్న నటి సుమలత ఇంటర్వ్యూ బాగా ఉంది. ఒకే వారం ఏడు కథలు ప్రచురించడం ప్రశంసనీయం. "దాంపత్య సంగీతం" ప్రారంభం ఆసక్తిని కల్గించింది. మున్ముందు దాంపత్యంలోని సంగీత స్వరాలు పాట కుల్ని ఆకర్షిస్తాయన్న అభిలాషని కల్గిస్తుంది. గృహమే కదా స్వర్గసీమ, మమతాంకురాలు కథలు బాగున్నాయి.

వై. హేమసుందర్‌రావు, ఇతరులు (డోర్నకల్)

## ధర్మపథం

'ధర్మపథం' శీర్షికలో "ఆపద మ్రొక్కులు" అనే విషయం గూర్చి వ్రాసిన బులుసు వేంకట రమణయ్యగారికి నా కృతజ్ఞతలు

జి. సాయిప్రసాద్ (వెదురుపాక)

## త్వరలో ప్రారంభం!

### కొత్త సీరియల్ నవల

# రాగాగ్ని

రచన:

చిట్టారెడ్డి సూర్యకుమారి

## నిలకడలేని మనసులు

"నిలకడలేని మనసులు" చదివిన తర్వాత ఈ త్తరం రాయాలనిపించింది విశ్వనాథం మాస్టారి ంటి వ్యక్తులుండటం సహజమే కాని, నరసింహం మాస్టారు విశ్వనాథం మాస్టారుగార్ని కలయిక సహజంగా ఉంది

డి. వి ఎస్. రామకృష్ణశాస్త్రి (వెదురుపాక)

## నిర్ణయం

వి పద్మగారి కథ 'నిర్ణయం' చదివాను చాల బాగుంది లలితలాంటి మనస్తత్వం, ముందు చూపు, తల్లిదండ్రుల మీద ప్రేమ గల యువతులు చాలా అరుదు

గుండా సాంబశివరావు (నేలకొండపల్లి)

## హాస్యం

గృహమే కదా స్వర్గసీమా, "కుక్కర్ సింహం — గ్రామసింహం" ఈ రెండు కథలలో గల హాస్యం మమ్మి కడుపుబ్బ నవ్వించింది నిలకడ లేని మనసులు కథ వాస్తవానికి దూరమై ఉంది

మరువాడ సూర్యప్రకాశం (కాశీబుగ్గ)

## సామాజిక స్పృహ

కొన్ని వారాలుగా చక్కని ఇతివృత్తాలు గల కథలు, సామాజిక స్పృహగల కథలు ప్రచురిస్తున్నారు. ఈ పద్ధతిని ఇలాగే కొనసాగనివ్వండి కార్టూన్లు చాలా ఎక్కువ సంఖ్యలో ప్రచురిస్తున్నారు

పి వి. రామనాథరావు (మధిర)

## "పరిష్కారం మీరే చెప్పండి"

గుడిసేవ సుందరరామయ్య గారి కథ "పరిష్కారం మీరే చెప్పండి" చాలా బాగుంది

యం. జయప్రకాశ్‌రెడ్డి (పెద్దపల్లి)

## ఆనందం

నా అభిమాన నటుడు చిరంజీవి ముఖచిత్రం చూసి ఎంతో ఆనందించాను. సంపాదకునికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

వెంకటేశ్వర్లు, ఎస్ సుజన (మహబూబాబాద్)

## నూరుపాళ్ళ నిజం

20—8—82వ తేది ఆంధ్రసచిత్రవార పత్రికలో ప్రశ్నావళి శీర్షికలో రాజమండ్రి నుండి ఎస్ బి. ఆర్. ప్రశ్నకు కె రామలక్ష్మిగారి సమాధానం నూటికి నూరు పాళ్ళు నిజం ఆమె చెప్పిన విధంగా ఈ కుల వ్యవస్థ వల్ల చెడిపోతున్నది బ్రాహ్మణులే కుల, మత ప్రసక్తిలేని లౌకిక రాజ్యం మనది అని చెప్తూ మన ప్రభుత్వము వివిధ కులాల వారికి రిజర్వేషనులను కల్పిస్తోంది ఇదే మతకలహాలకు దారి తీస్తోంది. కులం ప్రాతిపదికపై కాక ఆర్థిక స్థోమతను బట్టి రిజర్వేషనులను అమలుపరిస్తే బాగుంటుంది. ఈ కులవ్యవస్థకు అంతం ఎప్పుడో?

ఐ. వేణుగోపాలరావు (కర్నూలు) ★

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

[1938--1972]

శుక్రవారం : 24-9-'82

దుందుభినామ సం॥ ఆశ్వియుజ శు. సప్తమి

సంపుటము 75 : సంచిక 4

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

ఆరు మాసాల చందా రు. 42-90

పోస్ట్‌లో ఏడాది చందా రు. 85-80

విడి ప్రతి వెల రు 1-50

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

ఎస్. లక్ష్మి రామారావు

(చిత్రకారులు బొమ్మల్లా)



లోకంపోకడ ✳ ఊరిమెన్









# న్యూఢిల్లీ లేఖ

డాక్టర్ జయ్ దుభాషి

# ఇండియా - భారతదేశం

భారత దేశంలోని వార్తాపత్రికలు రెండు రకాలు ఒక రకానికి చెందినవి న్యూఢిల్లీలో ఏమి జరుగుతోందో చెబుతూ ఉంటాయి రెండవరకానికి చెందినవి మిగతా దేశంలో ఏమి జరుగుతోందో చెబుతూ ఉంటాయి న్యూఢిల్లీ కన్నా మిగతా దేశం పెద్దది కనక రెండవ రకానికి చెందినవే ముఖ్యమయి ఉండాలి కాని అవి ముఖ్యమయినవి కావు. మనదేశం దౌర్భాగ్యం అదే

పెద్ద నగరాలలోని ఇంగ్లీషు దినపత్రికలు మొత్తంమీద దేశ రాజధానిలో ఏమి జరుగుతోందోనని చెవి ఒగ్గి వింటూ ఉంటాయి. వాటికి న్యూఢిల్లీలో పెద్ద కార్యాలయాలు ఉంటాయి ఇవి తరచు ప్రభుత్వం వారు నడిపే ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరోకి అనుబంధ సంస్థలుగా పని చేస్తూ ఉంటాయి. ఈ పెద్ద పత్రికల విలేఖరులకి మంత్రులతో, అధికారులతో చక్కటిసంబంధాలు ఉంటాయి. వారు రాసే వార్తాంశాలు ఈ మంత్రులు, అధికారులని దృష్టిలో ఉంచుకుని రాసినవిగానే ఉంటాయి ఈ పత్రికల సంపాదకీయలూ ఇతర రచనలూ, 'పీఠాధిపతుల'' అభిప్రాయాల ప్రతిధ్వనుల లాగ ఉంటాయి. పెద్ద నగరాలలోని పత్రికలు ఎవరిని ఉద్దేశించి తయారవుతున్నాయంటే, దేశంలో కెల్లా ఎక్కువ అధికారం కల రాజకీయవాదులు, ప్రభుత్వోద్యోగులని ఉద్దేశించే అనవచ్చు పీఠాధిపతులూ, కొందరు సీనియర్ జర్నలిస్టుల మధ్య అపవిత్ర సంబంధం ఉన్నమాట నిజం. వారే వీరు, వీరే వారు అని కూడా అనవచ్చు

ఇంగిలీషు దొరల భాష అందుచేత అది పీఠాధిపతుల భాష భారతీయ భాషలు దొర భాషలు కావు. ఢిల్లీలో వీటిని చదివే వారు తక్కువ. కనీసం మహా మహులలో చదివేవారు తక్కువ ఇవి ఇంగిలీషు పత్రికలకి నకిలీలని వారి అభిప్రాయం అనుకోవాలి. న్యూఢిల్లీలో భారతీయ భాషలలో పత్రికల పలుకుబడి దాదాపు శూన్యం అని కూడా అనుకోవాలి వాటిని పార్లమెంట్‌లో సాధారణంగా ఉదాహరించరు, సచివాలయంలో గమనించరు. ఎవరయినా వాటిని చదివితే వారు మంత్రుల భార్యలయి ఉండవచ్చు

ఇక్కడే హేరాఫేరు జరుగుతోంది. భారతీయ భాషలలో వెలువడే పత్రికలని జనసామాన్యం చదువుతారు. వాటి అభిప్రాయాలు జనాభిప్రాయాన్ని మార్చినా మార్చవచ్చు వీటి సంపాదకులు, రచయితలు ఇంగిలీషు పత్రికలు లెక్క వేసినంతగా న్యూఢిల్లీలోని వారి అభిప్రాయాలని లెక్క వెయ్య నవసరంలేదు అందుచేత వారు తమని ఎవరయినా చివాట్లు వేస్తారని కాని, చెవులు మెలి పెడతారనికాని భయపడకుండా తమకి తోచినది రాయగల స్థితిలో ఉన్నారు ఏది ఏమయినా, ఈ పత్రికల సంపాదకులు దేశ రాజధానిలో అధికారంలో ఉన్నవారికి దూరంగా ఉంటారు, కొంత మొహమాటం లేకుండా రాయగలరు ఈ పత్రికలకి ఎన్నో ఎన్నో ఊళ్లలో విలేఖరులు వగయిరాలు ఉంటారు కనుక గ్రామ ప్రాంతాలలో జరిగిందంతా వీటికి త్వరగా తెలుస్తుంది. బొంబాయిలో మహారాష్ట్ర టయిమ్స్ లేదా లోకసత్తా ప్రజాభిప్రాయానికి ఉన్నంత దగ్గరగా టయిమ్స్ ఆఫ్ ఇండియా కాని ఇండియన్ ఎక్స్‌ప్రెస్ కాని ఉండవు మహారాష్ట్ర టయిమ్స్ సంపాదకుడు గోవింద తల్వాల్‌కర్‌కి జనసామాన్యంలో ఉన్నంత పలుకుబడి టయిమ్స్ ఆఫ్ ఇండియా సంపాదకుడు గిరిలాల్ జయిన్‌కి ఉండదు జయిన్ రాసేది న్యూఢిల్లీలోని బాబుల కోసం తల్వాల్‌కర్ రాసేది బొంబాయి లోని స్కూలు టీచరుల కోసం లేదా సతారాలోని రైతుల కోసం లేదా పూనె లోని రిక్షాబండి వారి కోసం. బాలగంగాధర్ తిలక్ ఇటువంటివారి కోసమే రాసేవాడు వీరికోసం రాసే భాష వేరు నేను ఎప్పుడయినా విదేశాలకి వెళ్లి కొంత కాలం ఉండి తిరిగి రావలిసి వచ్చినప్పుడు ఊళ్లలో ఏమి జరుగుతోందో తెలుసుకోవాలంటే గిరిలాల్ జయిన్‌నీ చదవను టయిమ్స్ ఆఫ్ యిండియానీ చదవను – అసలు నేను జయిన్ రాసింది చదవనే చదవను – కాని మహారాష్ట్ర టయిమ్స్ లేదా హిందుస్తాన్ (ఢిల్లీ) చూస్తాను ఈ పత్రికలు మీ భాషలు పలుకుతాయి జయిన్‌లూ, ఇందర్ మల్‌హోత్రాలూ మహా మహుల తరఫున మాటాడితే తల్వార్‌కర్‌లూ, గడ్ కరీలూ వారికి తోచినది చెబుతారు.

పత్రికలలో కలవీ, లేనివీ అని రెండు తెగలు భారత దేశంలో ఉన్నా ఇతర దేశాలలో లేవు భారత దేశం స్వతంత్రం అవుతున్న కాలంలో, బ్రిటిషు ప్రతినిధులతో భారతీయులు మంతనాలు జరుపుతున్న కాలంలో – అంటే 1946 లో – లండన్ లోని కొందరు భారతీయ విద్యార్థులు బ్రిటన్ ప్రధానమంత్రి శ్రీ క్లెమెంట్ అట్లీని చూడటానికి వెళ్లారు ఆయన అప్పుడు ఒక చిన్న వారపత్రిక చదువుతున్నారు. దాని పేరు ''హాంప్‌స్టెడ్ ఇకో'' అనుకుంటాను ఆయన ప్రతి శనివారం ఉదయమూ ఈ పత్రికని చదివి తరువాత తనే టయిమ్స్, మాంచెస్టర్ గార్డియన్ వంటి వాటిని చదువుతాడని అప్పటిలో నేను విన్నాను బాబా సాహెబ్ భోన్స్‌లే మొదట చదివే పత్రిక ఏదయి ఉంటుంది ? టయిమ్స్ ఆఫ్ ఇండియా అయిఉంటే నేను ఆశ్చర్యపడను. ఎందుకంటే, పెద్ద ఇంగ్లీషు పత్రికలని ముందు చదివేవారు తప్ప ఇంకెవరయినా పోలీసు వారి లాఠీలకి సిద్ధమయి ఉండేవారు ''సకాల్'' పత్రిక సంపాదకుడు మాధవ్ గడ్ కరీ మాజీ ముఖ్యమంత్రి అబ్దుల్ రెహమాన్ అంతూలే, ఆయన సిమెంటు వ్యవహారాలని గురించి ఇండియన్ ఎక్స్‌ప్రెస్ కన్నా ముందే రాస్తూ వచ్చారు అంతూలే సిమెంటు బస్తాలని తెరిచి చూపించినది గడ్ కరీయే కాని అరుణ

. కిలోల బరువుగల పుస్తకాలను స్కూలుకు మోసుకెళ్ళటం
ఒక్కటే ఈనాడు పిల్లలకు అతి తేలిక పనిగా కనబడుతోంది.



# ఈరోజుల్లో పిల్లల జీవితాలు కూడా కఠినంగా తయారయ్యాయి.

అందుచేత మీ పిల్లలకు ఉత్తమ మైనవి లభించాలి.
దీనికోసమే వారికోసం తయారైంది బూస్ట్.
మీ పిల్లలకు ఉదయమే ఒక కప్పు రుచికరమైన బూస్ట్ ఇవ్వండి. రోజంతా అత్యంత ఉత్సాహంగా, చురుగ్గా పని చేసేందుకు కావలసిన శక్తి ఇంధనం వారికి లభిస్తుంది. ఎందుచేత నంటే, బూస్ట్ అతి నాణ్యమైన పదార్థాల మేలికలయికతో నిండి ఉంది. మీగడ పాలు, గోధుమ, బార్లీమాల్ట్, కోకో.
ఉత్తమ మైనవి ఎన్నడూ చవకగా దొరకవు. బూస్ట్ కూడా అంతే.
కాని మీరు ఖర్చు తక్కువని నాని








**చురుకైన జీవనానికి శక్తినిచ్చే ఇంధనం**

HTD-HMM-7232R

# ఎక్స్‌పో - 85

ఎక్స్‌పో- 85 ప్రదర్శనను సుకూబా నగరంలో నిర్వహించడానికి ముమ్మరంగా ప్రయత్నాలను చేస్తున్నారు- 1985 మార్చి 17 న ఈ ప్రదర్శన ప్రారంభ మవుతుంది ఇది ఆరునెలలపాటు ఉండగలదు మానవ ప్రగతికీ సైన్సు, సాంకేతిక రంగాలు చేస్తున్న కృషిని తెలియబరచటమే ఈ ప్రదర్శన ముఖ్యోద్దేశ్యం 161 దేశాలకు చెందిన 3000 ల సంస్థలను ఆహ్వానించారు సుమారు రెండుకోట్ల మంది ప్రజలు దీనిని సందర్శించ గలరని భావిస్తున్నారు.



# న్యూఢిల్లీ లేఖ

శౌరి కారు కాని, గడ్ కరి పత్రిక అమ్మకాలు తక్కువ. అదీ కాకుండా మరాఠీ పత్రికలు చదివేది ఎవరు ?

శ్రీమతి గాంధీ ఇండియా ప్రధాన మంత్రి. ఆమె భారత దేశం ప్రధాన మంత్రి కారు. ఇవి రెండూ వేరే దేశాలు పోలీసు వారి అలజడులూ, పట్టపగలు దోపిడిలూ ఎక్కువ అవటానికి కారణం భారతదేశం అన్నది ఇండియా అన్న దాని అదుపులో నుంచి తప్పి వెళ్ళిపోవటమే. టయిమ్స్ ఆఫ్ ఇండియా, స్టేట్స్ మన్ ఇంకా ఇతర పత్రికలు ఇండియాలో ఏమి జరుగుతోందో చెప్పగల రేమోకాని ఇతర పత్రికలు భారతదేశంలో ఏమి జరుగుతోందో చెబుతాయి· ఇండియా చాలా చిన్నభాగం. అందుచేత ఇండియాని గురించి మాత్రం చెబితే చాలదు. అంతేకాదు; పెద్ద పత్రికలలోని ఇండియాని గురించి చదివితే అపోహలు కూడా కలుగవచ్చు ఒక ఉదాహరణ ఇస్తాను న్యూఢిల్లీ సూచనని అనుసరించి పెద్ద ఇంగ్లీషు పత్రికలు ఇస్రాయెల్-లెబనాన్ తగాదాలో ఇస్రాయెల్‌దే తప్పు అన్నట్టు రాస్తున్నాయి. భారతీయ భాషా పత్రికలని తిరగవేస్తే ఇస్రాయెల్‌నే పూర్తిగా బలపరిచే లేఖలే చాలా కనపడు తాయి. భారతదేశం మద్దతు ఇస్రాయెల్‌కే భారతీయ అనేందుకు కావలసినంత సాక్ష్యం ఉందని భాషా పత్రికలు చదివితే తెలుస్తుంది ప్రభుత్వం వారి అభిప్రాయం ఎవరికి కావాలి ? !



# స్వార్థం





## నందం రామారావు

ఉదయం పది గంటల వేళ.

బజారు వచ్చేపోయే కార్లతో, రిక్షాలతో, హడావుడిగా సాగిపోయే మనుషులతో విపరీతమైన సందడిగా వుంది!

తన షాపులో కూర్చుని క్రొత్త మందుల పాకెట్స్ వూడదీసి సీసాలు బయటకు తీస్తున్నాడు ప్రసాద్

ఇంతలో కీచుమన్న చప్పుడు.

ఆ వెంటనే కెవ్వుమన్న అరుపు ఒకదాని వెంట ఒకటి వినిపించగా రోడ్డు వేపు చూశాడు ప్రసాద్

రోడ్డుమీద ఒక కారు ఆగి వుంది. దాని చుట్టూ జనం.

ఏం జరిగిందో అన్న కుతూహలం కలిగింది ప్రసాద్‌కి పని కుర్రాడికి మందుల పాకెట్స్ అప్పజెప్పి రోడ్డుమీద కొచ్చాడు.

ఎండలో మిలమిలా మెరిసిపోతోంది ఎర్రటి ఖరీదైన కారు ఆ కారులో అంతకన్నా ఖరీదైన మనుషులు.

ఆ ఎర్రటి కారు ముందు, ఎర్రటి రక్తంలో పదేళ్ల కుర్రాడు!

ఆ కుర్రాడి ఒంటికి చిరిగిన బట్టలు. శరీరంలో ఎముకలు తప్ప మాంసం లేదు. పుట్టిన తరువాత నూనె ఎరగని జుట్టు;

వాడి ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసి అయిదు నిముషాలయింది.

"ఈ కారుల్లో వెళ్లే వారికి మామూలు మనుషులు దోమల్లానో; చీమల్లానో కన్పిస్తారు. కారున్న బాబు లందర్నీ నడి రోడ్డుమీద నిలబెట్టి షూట్ చెయ్యాలి." కారుల్లో వెళ్లే ధనవంతులమీద తమకున్న కసిని తీర్చుకుంటున్నారు కొంతమంది.

ఇదంతా చూస్తూ కారులో కూర్చున్న ఓ రంగుల రామచిలుక—

"వాటీజ్ దిస్ న్యూసెన్స్ డియర్" అంటోంది ముద్దు ముద్దుగా.

"ఏంలేదు డియర్! ఎవడో వెధవ మన కారుక్రింద పడ్డదానికి ఈ న్యూసెన్స్ చేస్తున్నారు"

"దానికింత న్యూసెన్సా? మనకవతల పార్టీకి టైమవుతోంది డియర్"

"ఒక్క నిముషం వుండు డార్లింగ్."

ప్రసాద్ వాళ్ల మాటల్ని ఆశ్చర్యంగా వింటున్నాడు.

ఇంతలో ఎక్కడి నుంచో కానిస్టేబుల్ వచ్చాడు వచ్చి ఏదో రాసుకున్నాడు రాసుకున్న తర్వాత కారు స్టార్టవబోయింది!

ఇంతలో ఒకామె పెద్దగా ఏడుస్తూ జనాన్ని తోసుకుని వచ్చింది

ప్రసాద్ ఆమె వేపు చూశాడు.

ఆమె కట్టుకున్న చీర మాసింది. ముఖం కమిలింది.

రంగు వెలిసిన బొమ్మలా వుంది రక్తపు మడుగులో చనిపోయివున్న ఆ కుర్రాడినిచూసి ఏడుస్తోంది.

"అయ్యో! కొడకా. నీకప్పుడే నూరేళ్ళు నిండాయా? నిన్ను సంపడానికి ఏ వెధవకు చేతులొచ్చాయ్. ఇంక నేనేం చూసుకుని బతికేది నాయనోయ్" అంటూ శోకాలు పెడ్తోంది.

ఆమె ఏడుపు అక్కడున్న వాళ్ళ హృదయాల్ని ద్రవింపజేస్తోంది. ప్రసాద్ ఆ తల్లి బాధ చూడలేక పోయాడు. 'ఆ క్షణాన ఆ కారులో వున్న వ్యక్తుల్ని బయటకు లాగి అంత అశ్రద్ధగా కారును తోలినందుకు నడి రోడ్డులో నిలబెట్టి వురితియ్యాలనిపించింది!

కానిస్టేబుల్ ఆ కారు దగ్గరికి వచ్చి ఆ వ్యక్తితో ఏదో మాట్లాడాడు.

కారు స్టార్టయి వెళ్ళిపోయింది!

"అదేవిటండీ కానిస్టేబుల్‌గారూ! వాళ్ళని అలా వదలిపెట్టారు?" ఎవరో అడిగారు.

"ఎక్కడికి పోతాడండీ పేరు రాసుకున్నానుగదా!" అన్నాడు కానిస్టేబుల్.

పసాద్‌కి ఎందుకో ఆ సమాధానం రుచించలేదు.

ఒక కుర్రాడిని రోడ్డుమీద చంపిన ఆ కారుగల వ్యక్తి ఎంత గొప్పవాడైనా కావచ్చు. కానీ, వాడు హంతకుడే! హంతకుడిని అలా వదిలిపెటడమా?

"బాబూ! ఇంక నేను బతికుండటం ఎందుకురా. నన్నూ సంపెయ్యరా" అంటూ ఆ శవాన్ని ఎత్తుకుంది ఆ తల్లి.

"అదేవిటండీ అలా తీసుకుపోతోంది కుర్రాడిని హాస్పిటల్‌కి తీసుకెళ్ళి పోస్టుమార్టమ్ చేయించరా?"

ఆ మాట విన్న కానిస్టేబుల్ ఆమె దగ్గర కెళ్ళి— "ఏయ్! శవాన్ని దింపు. ఇప్పుడిప్పుడే శవాన్ని తీసుకెళ్ళడానికి వీల్లేదు" అన్నాడు.

"బాబూ! జరిగిందేదో జరిగిపోయింది. నాకీ కేసులూ, కోర్టులూవద్దు. నాబిడ్డను

## స్వార్థం

నాకివ్వండి ఈ సేతుల్తో పెంచాను. ఈ సేతుల్తో బుగ్గిసేత్తాను" అంటూ బతిమలాడసాగింది

"సరే. పో!" అన్నాడు కానిస్టేబుల్.

ఆ స్త్రీ కుర్రాడిని భుజంమీద వేసుకుని ఏడుస్తూ వెళ్ళిపోయింది.

కానిస్టేబుల్ కూడా అటూ యిటూ కాసేపు తిరిగి వెళ్ళిపోయాడు.

ప్రసాద్‌కి ఇందులో ఏదో అసహజత్వం కనిపించింది. అక్కడ్నుంచి కదిలి తన షాపులోకొచ్చాడు, జనం కూడా అక్కడ్నుంచి కదిలి ఎవరి పనిమీద వాళ్ళు వెళ్ళిపోయారు! మరునిముషంలో అంతా మామూలుగా అయిపోయింది!

క్షణం క్రితం అక్కడ యాక్సిడెంట్ జరిగిందన్న విషయమే మర్చిపోయారు అక్కడున్న మిగతా జనం! కానీ, ప్రసాద్ తన షాప్‌లో కూర్చుని యాక్సిడెంట్ గూర్చే ఆలోచించసాగాడు!

ఇంతలో రోడ్డుమీద పెద్దగా ఏడ్పు వినిపించింది.

ప్రసాద్ ఆశ్చర్యంగా అటుకేసి చూశాడు.

ఎవరో స్త్రీ గుండెలు బాదుకుంటూ ఏడుస్తోంది. కానీ, రోడ్డుమీదున్న జనం ఎవరూ ఆ స్త్రీ ఏడుపుని పట్టించుకోవడం లేదు

ప్రసాద్ చూస్తూ ఊరుకోలేకపోయాడు. లేచి ఆమె దగ్గరకెళ్ళాడు.

"ఎవరమ్మా నువ్వు! ఎందుకేడుస్తున్నావ్?"

"నా పేరు లచ్చమ్మ బాబూ; నాకొడుకు కారుక్రింద పడ్డాడుట నాయనా. ఎక్కడ పడ్డాడో నీకు తెలుసా బాబూ."

ప్రసాద్ ఆశ్చర్యపోయి—

"నీ కొడుకు కారు క్రింద పడ్డాడా?" అన్నాడు.

'అవును బాబూ! నా కూతురూ, కొడుకూ నూకలు కొనుక్కొత్తానికి బజారు కొచ్చారు బాబయ్యా ఆడు రోడ్డుదాటబోయి కారుకింద పడ్డాడట. నా పిల్లొచ్చి సెప్పినాది బాబయ్యా. ఆపట్నాన పరిగెత్తుకొచ్చినా. నువ్వు సూశావా బాబూ."

ఈ మాటలు విన్న ప్రసాద్‌కు నోట మాట రాలేదు! లచ్చమ్మవైపు చూశాడు. ఎముకలలాంటి శరీరం చీలికలై వ్రేలాడుతున్న చీర. చింపిరి తలలో పెట్టుకున్న పిచ్చిపువ్వులా వుంది, లచ్చమ్మ!

"ఏంటి బాబూ! మాట్లాడవే?"

"అవునిక్కడే యాక్సిడెంట్ జరిగింది. ఒక కుర్రాడు కారుక్రిందపడి చనిపోయాడు."

ఆ మాట వింటూనే లచ్చమ్మ పెద్దపెట్టున ఏడ్వసాగింది—

"నా నాయనే! నీ కప్పుడే నూరేళ్ళు నిండిపోయినాయా? మీ అయ్య పోయినా నిన్ను సూసుకునే కదరా బతుకుతున్నాను తండ్రీ! ఇంక నేనెందుకు బ్రతికేది?" అంటూ ఏడుస్తూనే— "ఆడి శవం ఏది బాబయ్యా" అడిగింది లచ్చమ్మ.

"ఇందాక ఎవరో ఒకావిడ వచ్చి తన కొడుకుదని తీసుకెళ్ళిందే."

"బాబూ! నా కొడుకుని అదెవత్తో తీసికెళ్ళడమేమిటి? నాయనోయ్! నేనిప్పుడు ఏం సెయ్యను దేవుడోయ్. నాకెన్ని కట్టాలు రాశావ్రా దేవుడోయ్,"

ప్రసాద్ కిదంతా వింతగా అనిపించింది. ఒక కుర్రాడికి ఇద్దరు తల్లులా?



ఇటువంటి విచిత్రాలను గురించి కథల్లో చదివాడు. కానీ, ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నాడు!

ఎవరా కుర్రాడికి నిజమైన తల్లి?

''చూడమ్మా? ఇప్పుడు ఏడిస్తే లాభం లేదు. నిజంగా అతను నీ కొడుకైతే పోలీసులతో చెప్పు'' అన్నాడు ప్రసాద్.

''పోలీసోళ్లు నా మాట ఇంటారా బాబూ?''

''ఎందుకు వినరు? వెళ్లి చెప్పు?''

''బాబూ! మీరూ రండయ్యా'' లచ్చమ్మ ప్రతిమాలింది.

''అబ్బే! నేనెందుకు. నువ్వెళ్లు. నీమాట వింటారు?'' అని సలహాయిచ్చి షాపులో కొచ్చేశాడు ప్రసాద్

లచ్చమ్మ ఏడుస్తూ కాసేపు అక్కడే కూర్చుని మెల్లగా లేచి అక్కడ నుంచి కదిలింది

ప్రసాద్‌కి ఈ అనవసర గొడవను నెత్తి మీద వేసుకోవడం ఇష్టంలేదు. అందులోనూ పోలీసులతో వ్యవహారం! ఎందుకొచ్చిన బెడద? అని అనుకున్నాడు.

సాయంత్రం అయిదు గంటలయింది.

ప్రసాద్ మెయిన్ బజారు కెళ్లి తన పని చూసుకుని బస్సుకోసం బస్‌స్టాప్ దగ్గరకొచ్చి నుంచున్నాడు, ఇంతలో రోడ్డు ప్రక్కనుంచి—

''బాబూ! అనాధశవం బాబూ! దహనానికి పైసలేవు బాబూ— ధర్మం చెయ్యండి బాబూ'' అన్న అరుపులు వినిపించాయి.

ఆ గొంతు ఎక్కడో విన్నట్టుగా అనిపించి ప్రక్కకు తిరిగి చూశాడు ప్రసాద్.

రోడ్డు ప్రక్కన శవాన్ని పెట్టుకుని ఒక

**సూ ర్యు డు**

నిన్న
ప్రపంచంలో లేని
నీతి, న్యాయం
ఈ రోజు
ఉన్నాయేమోనని
పరిశీలిస్తూ
రోజు రోజూ భంగపడినా
రోజు రోజు వచ్చి చూసే
ఆశావాది
సూర్యుడు !

— కాశీనాధ & కాశీనాధ

ఆడా, ఒక మగా కూర్చుని వున్నారు.

ప్రసాద్ పావలా వేసివచ్చి మళా బస్సు స్టాపులో నిలబడ్డాడు.

ఎందుకో ఆ శవం వేపు, ఆ మనుషుల వేపు చూశాడు. వాళ్ళను ఎక్కడో చూశాడు. ఎక్కడా అని ఆలోచిస్తూండగానే,

మగమనిషి —

''ఒక పావలా ఇయ్యి టీ తాగొత్తా. అరచీ, అరచీ గొంతు పోతోంది'' అంటు న్నాడు.

''సాల్లే ! ఎన్నిసార్లు టీ తాగుతావ్ ? ఇప్పటికే ఈ వచ్చిన డబ్బుల్లో శానా బొక్కడింది ఆ పోలీసోడు పాతిక గుంజుకు పోయాడు. ఎదవసచ్చినోడు.''

''తీసుకుంటే తీసుకున్నాడులేవే. మనకు బంగారంనాటి శవం ఇచ్చాడుగిందా.''

''అదీ నిజమే. ఇయ్యాల విప్పుడూ లేనన్ని పైసలొచ్చాయి. దీన్తో నాకో సన్న కోక, నీకో సొక్కా, మిగతా దాంతో సినిమా ... సారా''

''సరేలే! ఎవుడన్నా ఇంటాడు వూరుకో.''

వాళ్లు మాట్లాడుకుంటూ వుండగానే గాలికి శవం మీదున్న గుడ్డ తొలగింది !

ఆ శవాన్ని చూస్తూనే ఆశ్చర్యపోయాడు ప్రసాద్. అది ప్రొద్దున్న కారు క్రిందపడ్డ శవం !

అవును ! ప్రొద్దున్న ఈ శవాన్ని పట్టు కెళ్లింది ఈ స్త్రీయే !

ఐతే ...ఇందాక మరొకస్త్రీ వచ్చి...

ప్రసాద్ కిదంతా విచిత్రంగా అనిపించింది.

అతని కళ్లముందు లచ్చమ్మ దీనమైన ముఖం మెదిలింది. ఆమె ఏడ్చిన ఏడుపు చెవుల్లో మార్మోగ సాగింది.

మనుష్యులు రకరకాల వ్యాపారాలు చెయ్యడం విన్నాడు. ఇప్పుడు శవాలతో వ్యాపారం చెయ్యడం చూస్తున్నాడు !

మనుషులెంత స్వార్థపరులు ?

వెంటనే ప్రసాద్‌కి ఎవరో వెన్నుతట్టి పిలిచినట్టు స్ఫురించింది.

తను మాత్రం ఏంచేశాడు ?

పోలీస్‌స్టేషన్‌కొచ్చి సహాయం చేసిపెట్ట మని లచ్చమ్మ ఎంత ప్రాధేయపడినా, తను విందుకొచ్చిన గొడవ అనుకొని, తప్పుకున్నాడే గానీ, ఆ మాతృ హృదయాన్ని అర్థం చేసుకో లేకపోయాడు !

తను మాత్రం మనిషిగా ప్రవర్తించాడా?

ఈ ఆలోచన రాగానే ప్రసాద్ సిగ్గుతో తల దించుకున్నాడు !

# ఫాలాక్షుని ఫైల్



## అభినవ ఏసుక్రీస్తు !

అమెరికాకు చెందిన 35 ఏళ్ల పెలింగ్ అనే వో క్రైస్తవుడు ఏసుక్రీస్తు శిలువ వేయబడిన రోజున ప్రతిఏడూ తానూ ఏసుక్రీస్తులా ముస్తాబయి, శిలవను పంపాంగా అనే నగరంలో మోసుకుంటూ వూరు చివరికిపోయి, అక్కడ శిలువ వేయించుకుంటాడట. రోమను సైనికుల వేషాలు వేసుకున్న కొందరు ఆతనిని కొరడాలతో కొట్టారట స్టెయిన్‌లెస్‌స్టీలు మేకులతోఅతనిని ఆశిలువకు మేకులువేసికొట్టి, ఆతను స్పృహ తప్పాక వైద్య సహాయానికి తరలిస్తారట. రోమనుల వేషాలలో కొందరాతనిమీద వుమ్ములు వేస్తూంటే కొందరు ఆతనిని ఏసుగా కొలుస్తూ కన్నీరు కారుస్తూంటారట వాట్సురాల్డిన్ అని ఆతన్ని అడిగితే ఏసుప్రభువు పాపులకోసం శిలువ వేయించుకున్నపుడాయన పేర ఏటికోరోజు ఆ అనుభూతి, బాధ నేనూ పడతాను అన్నాడట.

## తలసిరాని కాలం !

వోహియో (విదేశం) నగరం జన సమర్ధానికి వాహన సమర్ధానికి పెట్టినది పేరట. అక్కడ క్షణానికి వో యాక్సిడెంటయినా కనీసం అవుతుందట. ఇలాటి నగరంలో ఇరవైయ్యయిదేళ్ల పాటు ఏ చిన్న ఏక్సిడెంటూ అవకుండా టాక్సీనడిపి రికార్డు స్థాపించిన విలియమ్ అనే వో టాక్సీ డ్రయివరును సన్మానించి, ఆతనికి వేయి డాలర్లు బహుమతి యివ్వాలని నగరసభ నిర్ణయించుకుని అన్ని సన్మానసభ ఏర్పాట్లూ చేసుకుని ఆఖరి క్షణంలో ఆశ్చర్యంతో కొయ్యబారి, ఏర్పాట్లన్నీ నిలిపేశారట. కారణమేమిటంటే ఆ విలియమ్ మహనీయునికి అసలు కారుడ్రయివింగు లైసన్సులేదట. ఈనేరానికి అతనికి రెండేళ్లు జైలుశిక్ష కూడా విధించాల్సి వచ్చిందట. కాలంకలిసి రానపుడ గాడిదగుడ్డు పామై కరుస్తుందంటే యిదే కాబోలు.

## ఆసుపత్రిలో పుష్కరం !

కలకత్తా మెడికల్ కాలేజి ఆసుపత్రిలో వో సుముహూర్తాన్న హోలీనాగ్ అనే ఒకామె తనకు వెన్నునొప్పి అని జేరిందట దానికి వైద్యంఅయ్యాక, మరొకటనీ, యింకొకటనీ యిలారోగం తరువాత రోగం అని చెప్తూనే ఆ ఆసుపత్రిలో తన స్థావరం ఏర్పరచుకున్నదట. ఈమె ఆ ఆసుపత్రిలో చేరి పన్నెండేళ్లు అయిందట. అయినా ఆసుపత్రి వదలి వెళ్లే ఉద్దేశం కనబరుచుటలేదట. ఇంటికన్నా గుడి పదిలమనదియేనేమొ !

## ఆలుమగలని బలిగొన్న మద్యపానం !

సేలం పనంకాడ్టి అనే ప్రాంతానికి చెందినపొన్నుసామి అనే కూలి రోజులో సంపాదించిన పదిరూపాయలూ ఇంటిఖర్చుకని యివ్వకుండా తప్పతాగిఆలస్యంగా యిల్లుచేరిఅదేమంటే పెళ్లాన్ని చితికేవేసేవాడట. ఆతనిభార్య 18ఏళ్ల లక్ష్మి రోజూ నెత్తి నోరూ మొత్తుకుంటూ మనకున్న యీ ఏణ్ణర్థం పిల్లాడినీ, ఎనిమిదినెలల పిల్లనూ ఏంచైమంటూరు. ఇల్లుగడిచేదేలా, అనిఏడ్చి యీ కాపురం నేచైలేనని ప్రకటించి, ఇంతకన్నా నూతిలోపడి చస్తానని హామీయిస్తూ పరుగునవెళ్లి పెరట్లోని నూతిలో దూకేసిందట. అనుకోని యీ సంఘటనకు పొన్నుస్వామి కొయ్యబారి, తేరుకుని అయ్యో అనిఅరుస్తూ తాను ఆమెను రక్షించడానికి ఆ నూతిలో దూకేశాడట. ఫలితంగా యిద్దరూ చనిపోయారట.

## నగ్నదేవి ఆలయం !

కర్నూలుకు 30 కిలోమీటర్ల దూరంలో పవిత్ర తుంగభద్రా నదిఒడ్డునేకల ఆలంపూరులో వో కోవెలలో నగ్నంగా వెల్లకిలా పడుకునివున్న వో స్త్రీమూర్తి శిల్పవిగ్రహం వున్నదట ఈ విగ్రహానికి తలలేదట. విగ్రహం రెండ తొడలూ బాగా ఎడంచేసినట్టు వుంటుందట ఇదే ఆ ఆలయంలోని ఆరాధ్య దైవమట. పిల్లలుపుట్టని ఆడవారు యీదేవిని తలుచుకునిఆ విగ్రహం జననేంద్రియం మీద వెన్నపూసపెట్టి భక్తిశ్రద్ధలతో నాలుకతో ఆ వెన్నపూస నాకితే వారికి పిల్లలు పుడతారని నమ్మకట ఈ పని చేయడానికి యీ నాటికీ యీ దేవాలయానికి వెన్నపూసతో ఆడవారు వస్తారట.

## మొరార్జీ ఆరోగ్య రహస్యం !

అంత వయస్సులో కూడా మొరార్జీ దేశాయ్ చకచకలాడుతూ చాకులా వుండడానికి ఆయన ఆహార నియమాలే కారణమని చాలామంది అభిప్రాయం ఆయన తీసుకునే ఆహారం పట్టీచూస్తే గుండె నీరయిపోతుంది ఉదయం లేవగానే కాచి చల్లార్చిన మంచినీళ్లోగ్లాసుడు తాగుతారట. టిఫిను : అరలీటరు ఆవుపాలు. భోజనం : పళ్లు, బేరిపండురసము, బాదంపప్పు, సాయంకాలం : యాపిలుజ్యూసు అది లేకపోతే లేతకొబ్బరినీరు, రాత్రి భోజనం : అరలీటరు పెరుగు, కొంచెం పళ్లు — ఇంతే ! ! ఏ వయస్సు కాబుద్ధులు ....

## ప్రపంచంలో పెద్దజెండా !

ప్రపంచంలోకల్లా అత్యధిక పెద్ద జాతీయ జెండా డెట్రాయ్ నగరంలో ఆదేశ (?) స్వాతంత్ర్య దినంనాడు ఎగురవేస్తారట ఈ జండా 104 అడుగుల వెడల్పు, 235 అడుగుల పొడవు ఉన్నదట ఈ జండా బరువు 1500 టనులట. ఈ జండాలో యాభై నక్షత్రాలున్నాయట. ఒక్కొక్క నక్షత్రమూ అయిదడుగుల అయిదంగుళాలట. ఈ జండాను ఎగురవేయలేక, వో గోడకు బిగదీసి కట్టారట.

మన వాళ్ళు "అప్పులున్న వాళ్ళతో- చెప్పులున్న వాళ్ళతో కలసి వెళ్ళకూడదన్నారు! కానీ కార్పొరేటర్లతో కూడా కలసి వెళ్ళకూడదోయ్! అనుకున్న చోటికి వెళ్ళలేకపోతున్నాం!!



# కెరటాలు

కిల్లాన మోహన్‌బాబు




"ఏం అలా ఉన్నావ్..." అడిగాడు ప్రసాద్.

"ఏం లేదు" అన్నాన్నేను.

"నీ ముఖం చూస్తుంటే, నువ్వేదో సమస్యతో సతమత మవుతున్నావని సందేహం లేకుండా చెప్పొచ్చు" నవ్వొచ్చింది నాకు— ప్రాసకోసం అతని పాట్లు చూసి

"మొత్తంమీద కవివనిపించావ్" అన్నాను చిన్నగా నవ్వి

"నిర్భయంగా, నిర్మొహమాటంగా, నిస్సంశయంగా నిజం చెప్పు. నా దగ్గర నీకు చనువు లేదా? నీ కష్టాల్లో పాలు పంచుకొనే హక్కు నాకులేదా? ఏమైనా విప్పి చెప్పుకునే పరిపక్వత మన పరిచయానికి రాలేదా?" ప్రసాద్‌లోని కవి విజృంభించాడు.

"మహాశయా! నీ కవిత్వం కాస్త కట్టి పెడితే అసలు విషయం చెప్పే 'మూడ్' నా కొస్తుంది..." అన్నాన్నేను కాస్త సీరియస్‌గానే. ఆ మాత్రం మందలింపు లేకపోతే ప్రసాద్ మరీ సిల్లీగా ప్రవర్తిస్తాడని నాకు తెల్సు

కొన్ని క్షణాలు నిశ్శబ్దం!

"మా ఆవిడ నన్ను అపార్థం చేసుకుంది. నాకూ ఆ రాజ్యలక్ష్మికీ సంబంధం అంట కట్టింది రాజ్యలక్ష్మి నా 'ఉంపుడుకత్తె'నీ, ఆమెకి నెలనెలా అందుకే డబ్బు పంపుతున్నాననీ నాతో దెబ్బలాడి, అలిగి వాళ్ళన్నయ్యని చూడాలన్న నెపంతో విశాఖ పట్నం వెళ్ళి పోయింది మొన్ననే..."

ఆగాను ఇంకా మాట్లాడడానికి మాటలు అందక

"వ్వాట్! ఐయామ్ వెరీ సారీ? పోనీ అసలు విషయం చెప్పలేక పోయావా?"

"చెప్పాలనే ప్రయత్నించాను కాని ఆడది తన భర్తమీద ఓ అభిప్రాయం ఏర్పరుచుకుంటే దాన్ని అంత సులభంగా మార్చుకోలేదు అంచేత నేను చెప్పిన నిజం ఆమెకి అబద్ధంగానే తోచింది"

"అయితే కింకర్తవ్యం?" సిగరెట్ వెలిగిస్తూ అడిగాడు ప్రసాద్

"తలచుకుంటే ఇది నీవల్లే సాధ్యమవుతుంది" అన్నాను ప్రసాద్ కళ్ళలోకిచూస్తూ.

"నావల్లా?" తుళ్ళి పడుతూ అన్నాడు.

"అవును అక్షరాలా నీవల్లే! నీవు మంచి రచయితవు మనిద్దరి స్నేహం కూడా మా ఆవిడకు తెలుసు నేను రాజ్యలక్ష్మికి డబ్బెందుకు పంపుతున్నానో కూడా నీకు తెల్సు అంచేత యివన్నీ యథాతథంగా ఓ కథలా రాసి ఓ వీక్లీకి పంపు అది అచ్చయ్యే నాటికి ఆమెకూడా ఒంటరితనంలోని బాధ రుచి చూస్తూ వుంటుంది అప్పుడు నీ కథ నా మార్గాన్ని సుగమం చేస్తుంది!"

ఓ క్షణం ప్రసాద్ మాట్లాడలేదు.

"ఏం మాట్లాడవ్?" అడిగాను

"రచయితలవలనసంఘానికి ఉపయోగాలు కూడా ఉన్నాయని నాకిప్పుడు అర్థమయింది" అన్నాడు ప్రసాద్ ఏదో గొప్ప విషయం కనుక్కొన్నట్టు!

"జోకులెయ్యకుండా ఆ కథ వెంటనే మొదలుపెట్టు మరి నే వస్తాను కొన్ని జడ్జిమెంట్లు రాయవలసి వుంది తెల్లవారే సరికి 'స్టెనో' తయారవుతాడు" అనేసి బయటకొచ్చి రిక్షా ఎక్కి ఇంటి కొచ్చాను.

* * *

మరో మూడు నెలల తరువాత—

మాధవి స్నానం చేసి, బట్టలుమార్చుకుని హాల్లోకి వచ్చి కూర్చుంది ఆమె మనసంతా అదోలా వుంది తన భర్త తనని పిలవడానికి రాలేదని ఓపక్క బాధ, మరోపక్క పంతం లోలోపల పెరుగుతున్నాయి. ఇంతలో పేపరిచ్చే కుర్రాడు లోపలికొచ్చి ఆ రోజు డెయిలీ, వాళ్ళు ప్రతి వారం కొనే ప్రముఖ వారపత్రికా ఆమెకిచ్చి వెళ్ళిపోయాడు డెయిలీ పేపరు హెడ్‌లైన్స్ చూసి పక్కనే పెట్టి, వీక్లీ

# టాప్ స్టార్ ఉన్న కప్పు ఏది ?



## చూడండి, ఇక్కడ చిక్కని, కమ్మని టీ ఉన్నది

**చూడగానే తెలుసుకుంటారు దాని గొప్పదనం**
**రుచిచూడగానే గ్రహిస్తారు దాని కమ్మదనం**

చిక్కదనపు పరీక్ష...చేసి చూడండి...టాప్‌స్టార్ అన్నిటీకన్నా మెరుగు...మరే ఇతర టీకన్నా చిక్కనిది — చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్.

ఎందుకంటే, ప్రత్యేకమైన భారతీయ తేయాకుల తాలూకు ఘాటైన (స్ట్రాంగ్) సమ్మేళనం నుంచి తయారైంది లిప్టన్ టాప్‌స్టార్... సంతృప్తి నిచ్చే చిక్కని, కమ్మని టీ కోరుకునే వారి కోసం!

500 గ్రా.., 250 గ్రా.., 100 గ్రా.లలో దొరుకుతుంది.




# లిప్టన్ టాప్ స్టార్ టీ

**చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్**

LIPTON

LINTAS-LTS-8-2315 TE

తీసి పేజీలు తిరగెయ్యడం ప్రారంభించిందామె.

ఓ పేజీలో 'అపార్థం' అన్న కథకి 'బాపు' వేసిన బొమ్మ ఆమె నెంతో ఆకర్షించింది. పేజీకి మధ్యలో ఓ గీతా, దానికి చెరోపక్కా మగా, ఆడా రూపాలున్నాయి. వాళ్ళిద్దరి నీడలూ కలిసి 'అపార్థం' అన్న అక్షరాల వరకూ వచ్చి ఆగిపోయాయి! ఆ పేజీకి దిగువుగా 'కృష్ణప్రసాద్' అని ఉంది ''ఓహో ఇతని కథా'' అనుకుంటూ ఆ కథ చదవడం ప్రారంభించింది...

* * *

''మాధవి సీరియస్, స్టార్ట్ ఇమ్మీడియట్లీ'' అన్న టెలిగ్రాం చూసి నిలువునా వణికిపోయాడు సారథి

''సార్ వర్రీ అవకండి. ఇప్పుడు టైం అయిదయింది. మరో పావుగంటలో శ్రీకాకుళంకి బస్సుంది...'' అంటూ తొందర చేశారు సీనియర్ లాయర్ విశ్వనాథం గారు.

ఏం మాట్లాడాలో, ఏం చేయాలో అర్థం గాని పరిస్థితిలో ఉన్నాడు సారథి

వెంటనే 'ప్యూన్'ని పిలిచి బస్‌స్టాండ్‌కి సీటుకోసం పంపి ఇంటికి వెళ్ళి మరో పది నిముషాల్లో రిక్షాలో వచ్చాడు సారథి

అప్పటికే బస్సు బయలుదేరడానికి సిద్ధంగా వుంది. ఈ బస్ శ్రీకాకుళం చేరడానికి కనీసం మూడు గంటలు పడ్తుంది అంటే ఏనిమిది దాటుతుంది అంటే తన మామగారి వూరు టెక్కలి వెళ్ళే బస్ శ్రీకాకుళంలో ఏడున్నరకే బయలుదేరి పోతుంది అది తప్పిపోతె ఆ రాత్రికి మరి బస్సుల్లేవు ఆ రాత్రంతా శ్రీకాకుళంలో ఉండిపోవాల్సిందే.

కాని మాధవి...? వెళ్ళాలి...ఎలాగయినా ఈ రాత్రికే టెక్కలి వెళ్ళాలి! కాని ఎలా? వెంటనే మెరుపులాంటి ఆలోచన సారథికి వచ్చింది.

వెంటనే 'స్టార్ట్' చెయ్యబోతున్న డ్రైవర్ని పిలిచాడు సారథి.

డ్రైవర్ వినయంగా వచ్చి నిల్చున్నాడు. తాను 'మేజిస్ట్రేట్'నని అతనికి తెల్సు.

''నేను శ్రీకాకుళం నుంచి టెక్కలి వెళ్ళవలసి ఉంది. చాలా అర్జంటు. అంచేత నువ్వు ఏడున్నర లోపుగానే శ్రీకాకుళం వెళ్ళాలి'' అన్నాడు సారథి.

''అలాగే సార్'' అన్నాడు వినయంగా డ్రైవర్.

# కెరటం

అది ప్రైవేట్ బస్ కావడంతో వాళ్ళ కేసులెన్నో సారథి చూడడం జరిగింది

డ్రైవర్ సారథి సలహాని తుచ తప్పకుండా 'టౌన్ లిమిట్స్' దాటడంతోనే అమలుపరిచి, చాలా స్పీడ్‌గా డ్రైవ్ చేయడం ప్రారంభించాడు.

సారథి మస్తిష్కంలో మాత్రం మాధవి రూపే తిరుగుతోంది

తన మాధవి కెలావుందో? 'డెలివరీ' అంటే ఆమె కంటే తనే ఎక్కువ బాధపడే వాడు. బిడ్డపోయినా ఫర్వాలేదు మాధవి దక్కితే చాలు. ఏమిటో యీ ఆడవాళ్ళకి ఈ ప్రసవం ఒక పెద్ద గండం!

ఒకవేళ మాధవికేమయినా జరిగితే... ?

ఒళ్ళంతా ఝల్లుమన్నట్లయింది సారథికి!

అలాంటి ఊహనే భరించలేని తను ... నిజాన్ని తట్టుకుని నిలబడగలడా ?

తను లాయరుగా పెద్దగా ప్రాక్టీసు లేకుండా జీవితంలో 'చేదు'ని రుచి చూస్తున్న రోజుల్లో ఈ మెజిస్ట్రేటు పరీక్షలకె మని ప్రోత్సహించి తనకి అడుగడుగునా ఎంతో ధైర్యాన్నిచ్చింది!

అందులో తాను 'సెలెక్ట్' య్యానని తెలిసినరోజు ఆ విజయం తనదే అయినట్టు ఎంత మురిసిపోయిందో?

ఆ తరువాత కొన్నాళ్ళ ట్రెయినింగూ, ఈ ఊళ్ళో పోస్టింగూ జరిగి దాదాపు మూడేళ్ళయింది

తను తల్లి కాబోతుందని తెలిసిన రోజు కూడా మళ్ళీ అంతగానే సంతోషించింది.

ఈ మధ్యనే వాళ్ళ నాన్నగారు రావడం తనని టెక్కలి తీసుకువెళ్ళడం కూడా జరిగాయి ..

ఇంతలో పెద్ద శబ్దం!

బస్ 'సడెన్'గా ఆగడం, సారథి ముందుకు తూలడం, నుదురు ముందు సీటుకి తగిలి చిట్లడం కూడా జరిగిపోయాయి!

క్షణం తరువాత బస్‌కి 'ఆక్సిడెంట్' అయ్యిందని అర్థమయింది సారథికి.

ప్రయాణీకులందరూ బస్ దిగారు.

సారథి కూడా దిగాడు.

బస్ ఫ్రంట్ టైర్ కింద ఓ మనిషి రక్తం మడుగులో పడి ఉన్నాడు!

గుండె ఝల్లుమంది సారథికి!

డ్రైవర్ తనవేపు దీనంగా చూస్తున్నాడు.

"ఇదంతా నీవల్లే ! దీనికి కారణంనువ్వే!" అన్నటు న్నాయి అతని చూపులు !

సారధి 'గిల్టీ'గా ఫీలయ్యాడు !

మరో పదినిముషాల్లో పోలీసులు రావడం, డ్రైవరు పేరూ వివరాలూ రాసుకోవడం, సారధి కూడా సాక్షి సంతకం చేయడం కూడా జరిగాయి

అప్పటికే సగందూరం వచ్చేసింది బస్సు. అందులో పయాణీకుల్ని విశాఖ నుంచి ఆ రోడ్డుమీదుగా శ్రీకాకుళం వెళ్లే మరో బస్‌లో ఎక్కించాడు కండక్టరు అదే రాత్రి సారధి టెక్కలి వెళ్లి మాధవిని చూశాడు. డెలివరీ కష్టమయి ఆపరేషన్ చేశారు డాక్టరు పుట్టినబిడ్డమాత్రం చనిపోయింది. మాధవి మాత్రం ఎంతో నీరసంగా కన్పించింది

ఆపరేషన్ తరువాత మాధవికి ఎంతో గాభరా చేసిందనీ, అందుకే అలా టెలిగ్రాం యివ్వడం జరిగిందని మామగారు చెప్పారు. ఇప్పుడు గండం గడిచి మాధవి కులాసాగా ఉన్నందుకు 'థాంక్‌గాడ్' అనుకున్నాడు సారధి

కాని ఆ రాత్రి సరిగ్గా నిద్రపట్టలేదు సారధికి కన్ను మూసినా, తెరిచినా ఆ బస్ డ్రైవరే కన్పించసాగాడు

"ఇది ఏక్సిడెంట్ కాదు మర్డర్ ! నీ వల్లే జరిగింది ! నువ్వు స్పీడ్‌గా పొమ్మని ప్రోత్సహించబట్టే ఇంత దారుణం జరిగింది ! దీని ఫలితం నువ్వు అనుభవించక తప్పదు ! తప్పదు !! " అని అతడు దెప్పుతున్నట్టే వుంది సారధికి

మరో పదిహేనురోజుల్లో ఆ ఏక్సిడెంట్ కేసు సారధి కోర్టుకి వచ్చింది

బోనులో అపరాధిలా నిల్చున్న ఆ డ్రైవర్ ముఖంలోకి సూటిగా చూడలేక పోయాడు సారధి.

రెండునెలలు వాదోపవాదాలు జరిగాయి.

ఏదిఏమయినా ఆ డ్రైవర్ని విడుదల చేయాలని నిర్ణయించుకున్నాడు సారధి

అలాగే, తప్పంతా ఆ చనిపోయిన వ్యక్తిదే ననీ, డ్రైవరు ఎంతో చాకచక్యంతో బస్ నడుపుతున్నాడనీ,అది తను కళ్లారాచూశాననీ, ఆ చనిపోయిన వ్యక్తి బస్‌కి అడ్డుగా వచ్చాడనీ ... డ్రైవరు నిర్దోషి అనీ తీర్పు చెప్పాడు సారధి.

ఇది విని డ్రైవర్ ఆనందంతో తన్మయుడయిపోయాడు. అతని కళ్లు కృతజ్ఞతతో నిండిపోయాయి !

కాని అదేరోజు సాయంత్రం ...

కోర్టు ఆవరణలో బిగ్గరగా ఏడుస్తూ, పెడబొబ్బలు పెడుతూ ఉన్న ఓ యువతి కన్పించింది.

పక్కనేవున్న 'ప్యూన్'ని పిలిచి వివరాలు అడిగాడు సారధి

"ఆవిడ ఆ బస్ కిందపడి చనిపోయిన మనిషి భార్యండీ . తీర్పు ఆమెకి అనుకూలంగా రాలేదని ఏడుస్తోంది ఇందాకట్నుంచీ ఎంత చెప్తున్నా ఏడుపు మానదు ! అక్కడ్నించి కదలదు !" అన్నాడు ప్యూన్.

తన చుట్టూ వున్న ప్రపంచం గిర్రున తిరిగినట్లయింది సారధికి

తన జీవితమంతా 'గిల్టీ'గా గడపవల

సిందేనా? ఒకరికి సాయం చేయబోయి మరొకరికి అన్యాయం చేశాడా తను?

మానవత్వానికి విలువనిచ్చి డ్రైవర్ని శిక్ష నుంచి తప్పించానని తృప్తి పడుతున్న తనకి 'ఛెళ్లు'న కొట్టినట్టయ్యింది! వెంటనే ఆమెని తన రూమ్‌లో కలుసుకోవలిసిందిగా కబురు పెట్టాడు

అప్పటికే కోర్టు టైం అయిపోయింది. లాయర్లందరూ రిక్షాలలో ఇళ్ళకు వెళ్ళిపోతున్నారు.

తన గదిలోకి వెళ్ళి కోటు విప్పి కుర్చీలో కూలబడి సిగరెట్ వెలిగించాడు సారధి.

ఇంతలో ఇద్దరి పిల్లల్ని వెంటేసుకుని రూమ్‌లోకి వచ్చిందావిడ. ఏడ్చి ఏడ్చి, ఆమె కళ్ళు అలసిపోయాయి.

"రా కుర్చో. నీపేరేమిటి?" గంభీరంగా వుండాలని ప్రయత్నిస్తూ అన్నాడు సారధి.

"రాజ్యలక్ష్మి" వణుకుతున్న కంఠంతో అందామె.

"నీకేం ఫర్వాలేదు. నా చేతుల్లో ఏమీ లేదు! నేను చట్టానికి బానిసను. నా ముందున్న సాక్ష్యాలు బట్టి తీర్పు ఇవ్వవలసిన వాణ్ణి అయినా నీ పరిస్థితి చూస్తుంటే నాకెంతో జాలీ, సానుభూతీ కలుగుతున్నాయి." మాటలు తడబడుతున్నాయి సారధికి.

"ఆయన బతికున్న రోజుల్లోనే యిల్లు గడవడం కష్టంగా వుండేది, ఆయనకొచ్చే జీతం చాలక ఉద్యోగం చేసికొనే చదువులేదు నాకు. ఏం చెయ్యాలో, వీళ్ళిద్దర్నీ ఎలా పోషించాలో తెలియడం లేదు..." గాద్గదికమయిన కంఠంతో అందామె. సారధికి కళ్ళల్లో గిర్రున నీళ్లు తిరిగాయి.

ఆ ఇద్దరి పిల్లల్నీ చూస్తుంటే గుండెల్ని ఎవరో పిండుతున్నట్లయింది!

తన భార్య కెలా వుందోనన్న ఆందోళనలో తను మామూలుగా డ్రైవరుకి చెప్పినమాట ఈవిడ పసుపు కుంకుమల్ని తుడిచేస్తుందనుకోలేదు!

ఒక్క క్షణం నిశ్శబ్దం!

"చూడమ్మా... నీకు నేను ప్రతినెలా రెండు వందలు పంపుతానని మాట ఇస్తున్నాను. ఈ డబ్బుతో నువ్వు హాయిగా ఉంటావని కాదు నీకు సహాయపడుతున్నానన్న తృప్తి కోసం! దీన్ని దయచేసి కాదనకు! నీకు సాధ్యమైనంత తొందరలో ఏదో ఒక ఆఫీసులో ఏదోరకమైన ఉద్యోగం వేయిస్తాను. అంతవరకూ నేను నీకు డబ్బు పంపుతాను! ఆ భగవంతునిమీద ప్రమాణం చేసి చెప్తున్నాను..." అన్నాడు సారధి ఆవేశంగా.

"నా దురదృష్టానికి మీరు బాధపడడం అనవసరం బాబుగారూ... వద్దండీ... వద్దు... అలా చెయ్యద్దు, మరి నే వస్తానండీ..." అంటూ, ఏడుస్తూ బయటకెళ్ళిపోయింది రాజ్యలక్ష్మి.

అప్పటినుండీ ప్రతినెలా రాజ్యలక్ష్మికి సారధి నుండి రెండు వందలు అందుతూనే వున్నాయి.

అయినా సారధి హృదయం మీద ఆ సంఘటన వేసినముద్ర చెరిగిపోలేదు యింకా... ఏదో ఆమెకి ఆర్థికంగా కొంత చేయూతనిస్తున్నానన్న తృప్తి తప్ప!

ఓ రోజు మాధవి ఇంట్లో బీరువా సర్దుతూ వుండగా ఆ మని ఆర్డరు రసీదులు కన్పించాయి. రాజ్యలక్ష్మి అన్న సంతకం ఆమెలో అనుమాన బీజాన్ని నాటింది. భర్తని నిలదీసింది!

అతను చెప్పినదాన్ని విని నవ్వింది!

పెద్ద రాద్ధాంతం చేసింది! గోల పెట్టింది! 'నా జీవితం నాశనం అయిపోయింది' అంటూ ఏడ్చింది! భర్త ఎంత చెప్తున్నా ఏమీ వినిపించుకోకుండా అలిగి తన అన్నయ్యగారింటికి వెళ్ళిపోయింది...

ఈ సమస్యకి పరిష్కారం ఏమిటి...?

* * *

మరి చదవలేక పోయింది మాధవి.

తను ఎంత తప్పు చేసిందో, భర్తనెంతగా బాధ పెట్టిందో గుర్తొచ్చి ఏడుపొచ్చిందామెకు.

వెంటనే ఫోన్ దగ్గరికెళ్ళి తన భర్త నెంబరుకి 'ట్రంకాల్' బుక్ చేసింది.

మరో పావుగంటలో సారధి లైన్‌లోకి వచ్చాడు.

"ఏమండీ... మాధవిని మాట్లాడుతున్నాను. నేను ఈరోజే అన్నయ్యతో కలిసి అక్కడికి వస్తున్నాను. ఇన్నాళ్ళూ మిమ్మల్ని బాధ పెట్టినందుకు నన్ను క్షమించానండీ... ప్లీజ్..." అని యింకా ఏదో అంటోంది మాధవి!

# గాయాలు అన్ని ఆకారాల్లోనూ, సైజుల్లోనూ ఉంటాయి.
# బ్యాండ్-ఎయిడ్ పట్టీలూ అంతే మరి.




గాయాలు సూక్ష్మజీవుల బారి పడతాయి.
వాటిని బ్యాండ్-ఎయిడ్‌తో రక్షించండి.
ఏ గాయానికైనా వాడే వీలుగా, అది వేర్వేరు ఆకారాలలో సైజులలో వస్తుంది.
బ్యాండ్-ఎయిడ్ పట్టీలను ఎప్పుడూ దగ్గర ఉంచుకోండి.
సౌకర్యంగల, అతుక్కోని, కొత్త బ్యాండ్-ఎయిడ్ పట్టీ ప్రతి దానిలో—




- మరింత సౌకర్యంతో, త్వరగా గాయాన్ని మాన్పడం కోసం, అతుక్కోని కొత్త పట్టీ ఉంది.
- పగిలిన చర్మాన్ని సరిచేయడం కోసం, ఋజువైన క్రిమి నిరోధక పదార్థం ఉంది.
- గాయం త్వరగా మానడానికి, లోపలికి గాలిని చొరనిచ్చే సూక్ష్మరంధ్రాలున్నాయి.

## సూక్ష్మ జీవులు చేరకుండా రక్షించండి,
## BAND-AID BRAND బ్రాండ్ పట్టీలతో









ఇది 25 మరియు 40 స్ట్రిప్స్ గల ప్యాక్‌లలో దొరుకుతుంది.

OBM/7874/R

# దాంపత్య సంగీతం

సీరియల్

శ్రీమతి కళ్యాణీ సోమరాజ్

## 9

వైజాగ్‌లో వేసవికాలం మొదలైంది మధ్యాహ్నం అంతా ఉక్కిపోతున్నట్లున్నా సాయంకాలం అయ్యే సరికి చల్లగాలి తిరిగేది ఇన్నాళ్ళు హైద్రబాద్ ఎండల్లో, రిఫ్రిజేటర్ల మధ్య, ఎయిర్ కండిషనర్స్ మధ్య వేసవికాలం ఎలా ఉంటుందో తెలియకుండా గడిపేసిన నాకు కొత్తగా ఎండ చవిచూస్తున్న పసి పాపలా గిలగిలలాడిపోతున్నాను అదిచూసి కుమార్ నన్ను 'సుకుమారి' అని ఏడిపిస్తున్నాడు

ఆ రోజు హాస్పెటల్ డ్యూటీలేదు హాయిగా కావలసినంతసేపు పడుకోవచ్చు అనుకుంటు ప్రక్క మీద బద్ధకంగా ఇటు అటు దొర్లుతున్నాను

"ఏయ్ స్వాతీ త్వరగాలే ఈ రోజు అందరం అరకులోయ ప్రోగ్రామ్ వేసుకున్నాం మర్చిపోయావా!" కుమార్ హడావిడిగా వచ్చిలేపేసాడు

ఔను వారంరోజుల క్రితం మేము వాళ్ళింటికి వెళ్ళినప్పుడు కుమార్ స్నేహితులంతా కలిసి ఫామిలీస్‌తో అరకులోయ వెళదాం అనుకున్నాం కాని ఈ రోజు ఎందుకో అంత ఉషారుగాలేదు అయినా కుమార్ నన్ను వదిలిపెట్టడు అనుకుంటూ బద్ధకంగా లేచాను

నేను స్నానం చేసి వచ్చేసరికి కుమార్ నా నావీ బ్లూ కాశ్మీర్ శిల్క్‌చీర తీసి పక్కనపెట్టి, దాని మ్యాచ్ బ్లౌజ్‌కోసం సూట్‌కేస్ అంతా గాలించేస్తున్నాడు పెళ్ళి అయ్యాక, ఏ చీరలు ఎప్పుడు కట్టుకోవాలో నేను శ్రమ పడకుండా కుమారే ఆ బాధ్యత స్వీకరించాడు

పల్చని వాయిల్ చీర చుట్టుకొని వచ్చానేమొ తలనుంచి కారుతున్న నీటికి వెనక భాగం అంత తడిసిపోతోంది

"కుమార్ దాని బ్లౌజ్ ఆ రెడ్ షిఫాన్ చీర క్రింద వుందేమొ నేను వెతుక్కుంటాలే" అన్నాను

"ఆ ఇక్కడుంది దీనిమీద ఈ డిజైన్ చూసి మ్యాచ్ జాకెట్టు కాదనుకున్నాను మళ్ళీ చింతపూల రవికలు ఫ్యాషనా ?" అంటూ నా వైపు చూసి కన్నుకొట్టాడు

"హాయ్! తడిపొడి చీరలో అజంతా శిల్పంలా వున్నావోయ్!" అంటూ నా దగ్గరకు రాబోతున్న అతన్ని బయటకునెట్టి తలుపు గొళ్ళెం వేసుకున్నాను

మేమిద్దరం వెళ్ళేసరికి అరవింద, ప్రకాశ్ తప్పించి మిగిలినవాళ్ళంతా ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేస్తున్నారు రెండు కార్లల్లో పిల్లలు అటు, ఇటు గెంతుతూ అల్లరి చేస్తున్నారు మమ్మల్ని చూడగానే "హాయ్ ఆంటీ, అంకుల్! వచ్చేసారు" అంటూ అరుచుకుంటు లోపలకు

**(గత సంచిక తరువాయి)**

పరిగెత్తుకెళ్ళి, వాళ్ళ తల్లులతో చెప్పారు

రాధ, సరోజ బ్యాస్కెట్సనిండా కావలసిన సామాను సర్దుతున్నారు శ్యామల జడ అల్లుకుంటోంది

"నేనేమైనా హెల్ప్ చేయనా!"

"నో నో అంతా పూర్తి అయినట్లే! ముందు అలా కూర్చోండి"

"అరవింద, ప్రకాశ్! ఏరి?" కుమార్ అడిగిన ప్రశ్నకు, సుధాకర్, "వాళ్ళు అర్జెంటుగా ఏదో బోన్ ఫ్రాక్చర్ అయిన కేస్ వస్తే, ఆపరేషన్ థియేటర్ కెళ్ళారు నువ్వు వస్తే అక్కడకు రమ్మన్నారు" అంటూ బదులు చెప్పాడు

"మీ డాక్టర్స్‌కు వేరే పని ఏముంది కుమార్ కార్లో కాలు పెట్టేవరకు, కేసుల గొడవేగా!" అంటూ శ్యామల పరిహాసమాడింది

"ఏమిటి? స్వాతి నువ్వు వస్తావా? 'ఇఫ్

**జరిగిన కథ—5:** కాంట్రాక్టర్ రామనాథంగారి కూతుళ్ళు స్వాతి, శారద భార్య గుండెజబ్బుతో మరణిస్తుంది స్వాతి ఎం బి బి యస్ ఆఖరి సంవత్సరం పరీక్షలు రాసింది శారద బి ఎ చదువుతున్నా చదువుకంటే సంగీతానికి ఎక్కువ ప్రాధాన్యత నిస్తుంది ఎం ఎస్ పూర్తిచేసిన కుమార్‌తో లోగడ తనకి తెలియనివి చెప్పించుకొనేది స్వాతి ఆ విధంగా వారిద్దరూ దగ్గరవుతారు చదువు పూర్తి చేసుకొని కెనడానుంచి వచ్చిన సురేంద్రతో స్వాతి వివాహం అతను అక్కడికెళ్ళేముందే నిర్ణయిస్తారు రామనాథంగారు కుమార్‌ని పెళ్లి చేసుకొంటానన్న స్వాతి మాటలను లెక్కచెయ్యకుండా సురేంద్రతో ఆమె పెళ్లి ఖాయం చేస్తారు రామనాథంగారు స్వాతి, కుమార్ వివాహం చేసుకొని విశాఖపట్నంలో కాపురం పెడ్తారు స్వాతి ఫస్ట్‌క్లాసులో పాసవుతుంది అక్కడే హౌస్ సర్జన్ చేస్తుంటుంది కుమార్ ఇంటి ఓ భాగంలో ప్రాక్టీస్ ప్రారంభిస్తాడు స్వాతికి మామితో పరిచయం కల్గుతుంది ఆ బిల్డింగ్‌లోనే అద్దెకుంటున్న శారద జ్వరంతో స్వాతి దగ్గరకు రాగా, మందులు ఇచ్చి ఫీజు తీసుకోదు పెళ్లయి ఇంత కాలమయినా ఇంకా పుట్టింటనుంచి ఏవో తేలేదని శారదను పుట్టింటికి వెళ్లనీయకుండా ఆమెను ఎప్పుడూ దేనికో ఓదానికి హింసిస్తున్న ఆమె భర్తనుండి రక్షించి ఆమెకు జీవనాధారం చూపించాలని ప్రయత్నిస్తుంటుంది స్వాతి

యు ఆర్ ఇంట్రస్టెడ్'" అంటూ కూర్చున్న నన్ను కుమార్ లేపి తీసుకెళ్ళాడు

అక్కడంతా ఎవరి పనిలో వాళ్ళు బిజీగా వున్నారు కుమార్ వెంట నేను థియేటర్ కెళ్ళాను

మేము వెళ్ళేసరికి చేతులకు గ్లౌసెస్ తొడుక్కుంటున్న ప్రకాశ్, "రా రా నీకోసమే వెయిట్ చేస్తున్నాం నాకు అర్జంట్‌గా బ్యాంక్ కెళ్ళాల్సిన పని తగిలింది నువ్వు ఆపరేషన్ ప్రొసీడవ్ అరవింద లోపలున్నాడు ఆపరేషన్ వివరాలన్నీ చెబుతాడు యూ గో హెడ్ అయినా నీ చేతిలో పేషెంట్ పడితే చాలా సేఫ్ కదా!"

"హోహోయ్ పెద్ద పొగడ్తలు"

కుమార్‌ని నిద్రలో లేపి ఆపరేషన్ చేయమన్నా తడుముకోకుండా చేస్తాడు ఏమాత్రం నర్వస్‌నెస్ కన్పించదు అతని చేతల్లో! అతను ఆపరేషన్ చేయటం, నేను చూడటం చాలాసార్లు సంభవించినా, ఎప్పటికప్పడే కొత్తగా ఆహ్లాదంగా అన్పిస్తుంది నాకు ఆపరేషన్ మొదలైంది అరవింద జాగ్రత్తగా అసిస్ట్ చేస్తున్నాడు నేను పేషెంటుకి కొంచెం దూరంలో నిలబడి చూస్తున్నాను ఇంతలో ఒక్కసారి నా తల తిరిగినట్లనిపించింది ఓపికలేనట్లు క్రిందకుజారి పడుతున్నట్లు నాకే తెలుస్తోంది

"కుమార్ స్వాతి పడిపోతోంది!" అరవింద గట్టిగా అన్నమాటలు వినిపించాయి

"డోన్ట్ వర్రీ టేక్ హర్ అవుట్ సైడ్!" అంటు కుమార్ స్థిరంగా అన్న మాటలు కూడ లీలగా విన్పించాయి అంతే ఆ తర్వాత తెలియదు

నేను కళ్ళు తెరిచే సరికి నా చుట్టు, అందరూ చేరారు కుమార్ తప్పించి

కుమార్‌కోసం నా చూపులు వెతకటం గమనించి, "కుమార్ ఇంకా ఆపరేషన్ థియేటర్‌లోనే వున్నాడు!" అంటూ అరవింద చెప్పాడు

"సరోజా! ఇంటినుంచి మంచి కాఫీ పంపు!" అంటూ శ్యామల పురమాయించి నా పల్స్, బి పి అంతా టెస్ట్‌చేసింది ఆమెకూడ ఆ హాస్పెటల్‌లో లేడీ డాక్టర్‌గా పని చేస్తోందని కుమార్ చెప్పినట్లు గుర్తు

అందర్నీ పంపి నన్ను టెస్ట్ చేసింది

"మరింత గుడ్‌న్యూస్ దాచుకున్నావేం ఎన్ని వీక్స్!"

"నిజమేనంటారా" అన్నాను పిచ్చిగా

"ఓహో జోక్ చేస్తున్నావా! నువ్వు ఒక డాక్టర్‌వని మరిచి అడుగుతున్నావా!" నా అమాయకత్వానికి ఆమె ఎగతాళిగా అంది

"ఒక్కొక్కసారి నాచురల్‌గా లేట్ కావచ్చు అందుకని"

"కాదు నీ విషయంలో సందేహంలేదు థర్డ్ మన్త్ కావచ్చు ఔనా !"

"ఏమో" అన్నాను నిరాశక్తిగా ఇన్నాళ్ళనుంచి నన్నుపట్టి పీడిస్తున్న అనుమానం ఈ రోజు నిజమైంది ఊహ నాకిప్పుడే తల్లిని కావాలనిలేదు వద్దు వద్దు నాకీ ప్రతిబంధకం

* * *

"వద్దు వద్దు కుమార్ ! నాకీ ప్రతిబంధకం ఇప్పుడే వద్దు కొన్నాళ్ళు మనం ఫ్రీగా వుందాం" అంటూ అరచేతులో మొహం దాచుకుని ఏడ్పునాపు కోటానికి ప్రయత్నిస్తూ అన్నాను

కుమార్ నా ఎదురుగా మౌనంగా నిలబడ్డాడు

నర్సింగ్‌హోమ్ నుంచి వచ్చి పావుగంటసేపే అయింది శ్యామల నేను తల్లి కాబోతున్న విషయం అందరికి చెప్పింది నా అస్వస్థత మూలంగా, ప్రయాణం కాన్సిల్ చేద్దామా అని అంతా అనుకుంటుంటే కుమార్, నేను వద్దని వారించాము చివరకు వాళ్ళు వెళుతూ మమ్మల్నిద్దర్నీ ఇంటిదగ్గర డ్రాప్ చేసారు ఇంటికి వస్తూనే కుమార్ నన్ను ఎత్తుకుని గిరగిరతిప్పాడు 'ఎంత సంతోషమైనవార్త చెప్పావ్!' అంటూ ! కాని నా మనసులో సుళ్ళు తిరుగుతున్న బాధను అతనికి చెప్పకుండా ఎలా దాచను ?

కుమార్ నా మాట వింటూనే, "స్వాతీ ! ఎందుకిలా అంటున్నావ్ పిల్లలంటే నీ కిష్టం లేదా నిజంగా!" అంటూ నా చుబుకం ఎత్తి నా కళ్ళలోకి చూస్తూ అడిగాడు

"ఇష్టంలేదని కాదు దానికింకా చాలా కాలం వుంది "

"స్వాతీ ! నువ్వు తల్లివి కాబోతున్నావనగానే నేనెంత ఆనందించానో నీకు తెలిస్తే నువ్వు ఈ మాటలనవు "

"పెళ్ళి అయ్యాక పిల్లలుపుట్టక ఏమౌతారు? ఇందులో అంత అబ్బురపడాల్సిన విషయం ఏమిటి?"

"నీకు తెలియదు స్వాతీ ! మా ఇంట్లో నా తరువాత పసిపిల్లలు పారాడటమే నేను చూడలేదు దురదృష్టవశాత్తు అన్నయ్యకి పిల్లలులేరు చిన్నప్పటినుంచి చిన్న పిల్లలంటే నాకెంత మమకారమో నీకు అర్థంకాదు ఇన్నాళ్ళకు ఆ కోరిక తీరబోతోందని ఆనందించే సమయంలో నువ్వు అలాంటి మాటలని ఆ సంతోషాన్ని చిన్నా భిన్నం చేయకు ప్లీజ్ అయినా నీ అభ్యంతరం ఏమిటి ?"

"మనం ఇంకా జీవితంలో సెటిల్ అవలేదు నా హౌస్ సర్జను అయ్యాక ఎం ఎస్ చేద్దామని ఎన్నో ఆశలు పెట్టుకున్నాను అవన్నీ గంగపాలే కదా !"

"దానికి నువ్వేం బాధ పడకు నీ చదువేం ఆగదు నా కోసం కష్టపడి ఓ బుజ్జితల్లిని కని నా కిచ్చేయి ఆ తరువాత నేనే పెంచుతాను "

నేను మౌనంగా ఆలోచిస్తూ కూర్చున్నాను

"సరేనని చెప్పు స్వాతి "

"సరే" అన్నాను అయిష్టంగానే

"అయితే నాకో ప్రామిస్ చేయాలి "

"ఏమిటది ?"

"నువ్వుకూడ డాక్టర్‌వి నాకు తెలియకుండా యబార్షన్ కోసం ఎలాటి ప్రయత్నం చేయనని "

కుమార్ చేతిలో నిరుత్సాహంగానే చేయి వేసాను నా చేయి గట్టిగా పట్టుకొని ముద్దు పెట్టుకుంటూ "థాంక్స్ స్వాతీ ? చాలా థాంక్స్!"

## 10

కుమార్ నన్ను ఏ పని ముట్టుకోనిచ్చేవాడు కాదు

"డాక్టర్‌వైయుండి, నాకు ఎక్సర్‌సైజ్ ఏమి లేకుండా చేస్తున్నావ్" అని విసుక్కునేదాన్ని

"ఈ వంట చేయటం పెద్ద ఎక్సర్‌సైజేం కాదులే రోజు రాత్రిపూట వాకింగ్ కెళదాం" అనేవాడు

"ఈ ప్రేమంతా నామీద, లేకపోతే పుట్టబోయే పాప మీద !" అంటూ నిలవేసేదాన్ని సరదాకి

"నా ప్రేమలో తేడా ఏమైనా కనిపిస్తోందా ! ఎందుకలా అడుగుతున్నావ్ !" అనేవాడు కొంచెం దిగులుగా

"వూరికే అన్నాను పాప పుట్టగానే, నీ ప్రేమ అంతా అటే ప్రవహిస్తుందేమో అని భయంగా వుంది ముందు వచ్చిన చెవులకంటే వెనక వచ్చిన కొమ్ములు వాడని "

నా మాటలకు అతను నవ్వుతూ కొట్టిపారేసే వాడు "మరి నీ మాట ఏమిటి ? నువ్వు అంతేనా!" అని ఎదురు ప్రశ్నించేవాడు "నాకు పిల్లలమీద ఎంత ఇంట్రస్ట్ వుందో, తెలుసుగా, కాబట్టి నీకా భయం అక్కర్లేదులే !"

ఇద్దరం ఇలా వాదించుకుంటూ, భవిష్యత్

గురించి కమ్మటి కబుర్లు చెప్పుకుంటూ కాలం గడిపేవాళ్ళం

మామికీ ఈ విషయం తెలిసినప్పటినుంచి, రోజు ఏదో రకం వంటకాలు తెచ్చి రుచులు చూడమంటూ నన్ను బలవంతపెట్టేది "అమ్మణ్ణీ నీకు అమ్మ అంతా లేదు, నీకు ఏవో కోరికలుండాలి అవెల్లా నాతో చెప్పు, నానేదా అంతా తీరుస్తా!" నంటూ అభిమానం చూపించే మామిని చూసినప్పుడు నాకు తల్లిలేని లోటు తెలిసేదికాదు

కుమార్ స్నేహితులు "మీ మిసెస్‌ని ఏడవ నెల రాగానే మా ఇళ్ళకు పంపాలి ఆమెకు ముగ్గురు అన్నయ్యలని చెప్పు ఏ లోటు రానీయకుండా, డెలివరీ అది అయ్యేవరకు ఇక్కడే వుంటుంది" అంటూ కుమార్‌తో చెప్పేవాళ్ళు

ఒక్కసారి ఈ ప్రపంచంలో నా కింతమంది ఆత్మీయులు దొరికినందుకు సంతోషంతో మనసు నిండిపోయేది

నా హౌస్ సర్జన్సీ పూర్తి కావచ్చింది ఆ తరువాత ఏమిటి? అన్న విషయం నన్ను కలవరపరచసాగింది కొన్నాళ్ళపాటు ఎక్కడైనా జాబ్ చేయాలి ఈలోగా ఎమ్ ఎస్ ఎంట్రెన్స్ కూర్చోవాలి ఎమ్ ఎస్ సీట్ మాట ఎలా వున్న ఉద్యోగం ముఖ్యంగా కావాలి కాని ఏ పలుకుబడి లేని నాకు ఎలా దొరుకుతుంది?

ఆ రోజు డ్యూటి ముగించుకొని వచ్చేస్తుండగా మా వార్డ్ ఛీఫ్ నన్ను పిలిచారు

"ఏమ్మా! స్వాతీ జాబ్ గురించి ట్రై చేస్తున్నావని తెలిసింది" అన్నారామె

"ఔనండి హౌసర్జన్సీ కంప్లీట్ అయ్యాక ఏదో జాబ్ చేయాలనుకుంటున్నాను"

"మరి ఎమ్ ఎస్ చేయవా!"

## దాంపత్య సంగీతం

"సీటు దొరకాలి కదండి ఈలోగా ఖాళీగా వుండాలని లేదు"

"సరే మా కజిన్ ఒకామె నర్సింగ్‌హోమ్ పెట్టింది మంచి లేడీ డాక్టర్ కోసం చూస్తోంది నీలో వృత్తిపట్ల ఇంట్రస్ట్, సిన్సియారిటి నాకు నచ్చాయి ఆమెకు నిన్ను రికమెండ్ చేసాను" అంటూ నా వంక చూసారు

"చాలా థాంక్సండీ!" ఆనందంతో నా కంఠం ఒణికింది నిజంగా ఏమాత్రం ఎదురు చూడలేదు నేను

"అయితే నీకు ఎన్నో మస్త్!"

"సెవెన్త్ రన్నింగ్" అన్నాను చిన్నగా

"ఓ పని చేయి నీ డెలివరీ అయ్యాకే వెళ్ళి జాయినవ్ ఈలోగా ఒకసారి ఆమెను కలుసుకో నేను లెటర్ వ్రాసిస్తాను"

ఆమె వ్రాసిచ్చిన లెటర్ అందుకొని బ్యాగ్‌లో పెట్టుకొని, మరోసారి ఆమెకు కృతజ్ఞతలు చెప్పుకొని వచ్చేసాను

కుమార్ ఈ విషయం వింటూనే చాలా సంతోషించాడు

"చాలా లక్కీ గరల్‌వి నువ్వు కోరుకున్నవన్నీ సాధించగలవు"

చాలా రోజుల తరువాత నిజమైన ఆనందంతో నిశ్చింతంగా నిద్రపోయాను ఆ రోజు

* * *

హాస్పెటల్ డ్యూటి లేని ఒకరోజు మా చీఫ్ కజిన్‌ని కలుసుకోవాలని నిశ్చయించుకున్నాను మామి "నీకు తోడు నేను వస్తాను, ఆ హాస్పెటల్ నల్లా తెరియుం" అనటంతో, ఇద్దరం బయలుదేరాము

మామి అన్నట్లు అది వూరికి చాలా దూరంగా నిర్మించబడ్డది ప్రశాంతంగా, నీట్‌గా వున్న ఆ నర్సింగ్‌హోం చూస్తుంటే కొత్తగా కట్టినట్లని పించింది

నేను వెళ్ళినపని చప్పునే అయింది మా చీఫ్ కజిన్ నన్ను ఆదరంగా ఆహ్వానించింది, నేను తెచ్చిన లెటర్ చూడగానే, ఒక్కసారి నన్ను తన కళ్ళజోడు లోంచి పరిశీలనగా చూసి, "ఓ కే నీ డెలివరీ అయ్యాకేజాయినవచ్చు పోస్ట్ ఖాళీగానే వుంచుతాను" అంటూ హామీ ఇచ్చింది

ఒక్కసారి హాస్పెటలు వివరాలన్నీ నేనడక్కుండానే చెప్పింది ఆమె భర్త ఆరేళ్ళ క్రితం చని పోయాడట ఆ తరువాత భర్త వైపునుంచి వచ్చిన ఆస్తిపాస్తులు, తన సంపాదనా అంతా కలిపి ఈ నర్సింగ్‌హోమ్ నిర్మించినట్లు— ఇందులో తనుకాక ఇంకా ఇద్దరు లేడీడాక్టర్లు పనిచేస్తున్నట్లు చెప్పింది వూరికి కాస్త దూరంగా వున్నా హాస్పెటల్‌కున్న మంచి పేరువల్ల బాగా డబ్బున్న వాళ్ళు దగ్గరనుంచి ఈ నర్సింగ్‌హోమ్‌కి వస్తారని, ఆర్థికంగా బాగా లాభంగానే వుందన్నట్లు ఆమె మాటల్లో వ్యక్త పరిచింది కొడుకు, కోడలు స్టేట్స్‌లో వున్నారని, వాళ్ళిద్దరూ డాక్టర్లని వాళ్ళు రాగానే ఈ నర్సింగ్ హోం బాధ్యత వాళ్ళమీద వదిలేసి తను తప్పుకోవాలని వున్నట్లు, ఆమె అరమరికలు లేకుండా చెబుతుంటే వింటు చాలాసేపు కూర్చున్నాను

ఆమె దగ్గర శెలవు తీసుకొని బయటకు వచ్చేసరికి మామి ఎక్కడా కన్పించలేదు అలాగే బయట వరండాలో వేసివున్న బెంచీమీద కూర్చున్నాను మామి ఎక్కడకెళ్ళిందో అర్థం కాలేదు పావుగంట తరువాత మామి హడావిడిగ వస్తూ కన్పించింది

"ఏం మామి ఎక్కడకెళ్ళావ్ హాస్పెటల్ ఎలా వుందో చూసివస్తున్నావా?" అన్నాను

"లేదు ముందు పద అమ్మణ్ణీ, నీకో విషయం చెప్పాలి" అంటూ బయటకు లాక్కువచ్చింది నన్ను

బయటకు రాగానే, మామి ఆయాసపడుతూ వచ్చీరాని తెలుగులో విషయమంతా వివరించింది ఆమె చెప్పిన సంగతి విన్నాక మొదట ఆశ్చర్యపోయినా, నేను భయపడ్డంతా అయిందన్నమాట అనుకున్నాను

"ఆ రాణి అంటే నాకేమో చాలా కోపం మంచి పిల్లలానే వుండదు ఆ ఫ్యాషన్స్ అదీ అబ్బో" అంటూ మామి చెబుతున్నా ఇందాక మామి చెప్పిన విషయమే ఆలోచిస్తూ వుంది మనసు

"నువ్వు లోపలికి వెళ్ళగానే నేను అలా చూస్తూ తిరుగుతున్నాను ఈలోగా మన ప్లీడరు గారి భార్య గొంతు విన్పించింది తీరా వెళ్ళి చూద్దునుగదా, ఆమె పక్కన రాణి పడుకొనివుంది ఓ బెడ్‌మీద నన్ను చూడగానే భలే ఖంగారు పడింది నేను వూరుకోకే "ఏమ్మా రాణికేమైంది" అంటూ అడిగాను "అబ్బె ఏమిలేదు దానికి జ్వరం" అంది నేను నమ్మలేదు ఏం అమ్మణ్ణీ జ్వరం అయితే ఇంత దూరం తీసుకొచ్చి ఈ నర్సింగ్ హోమ్‌లో చేర్పించాలా? పక్కకి ఓ నర్స్‌ని పిలిచి అడిగితే "అదా యబార్షన్ కేస్" అంది "చూసావా

## కృష్ణవేణి

అందాలతో అలరించు
అలివేణి కృష్ణవేణి
॥రా॥ అందాల అలివేణి
కృపజూడు (ఓ) (మా) తల్లి కృష్ణవేణి
శృంగారముల రాణి
బంగారు కృష్ణవేణి
మెలికలెన్నో తిరిగి
పలుకులెన్నో పలికి
ప్రజల గోడును విని
జనుల బాధలు దీర్ప
జలము లందించి
అలజడులను మాన్పు ॥ అందాల ॥

కొండ పిండిగ గొట్టి
నిండుగా (నిను) బంధింప
నీ బాధతో తీర్చేవు
మా వ్యధలనన్నిటిని

అడుగడుగువా గుడులు
కడవరకు సిరులు

ఇక్ష్వాకుల పటిమ
నాగార్జునుని ప్రతిభ
దశదిశల వెదజల్లు ॥ అందాల ॥

మూడు రాష్ట్రాలకు ముద్దుబిడ్డవు (నీవు)
అందరి కోరికల వింటావు,
అచ్చటలు ముచ్చటలు
అలరింప తీర్చేవు ॥ అందాల ॥

ధరణికోట నీ ధాన్యాగారం
అమరావతి నీకు ఆలయం ॥ అందాల ॥

అందాల అడుగులే వేశేవు తల్లి
బంగారు పలుకులే పలికేవు తల్లి
నీ ఎలుకుల సందడే మా కన్నము
నీ నడక సవ్వడే మాకు పానీయము ॥ అందాల ॥

— ఎల్. మాకొండయ్య




# ఆరోగ్యం, మజా, జోరూ తోడు జోడుగా! తాగండిక బోర్న్‌విటా.

మీ కుటుంబంలోని వారికి క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా యివ్వండి. దానిలోని రుచి అంటే వాళ్ళందరికీ మహాయిష్టం. బోర్న్‌విటాలో ప్రకృతిలోని మంచి లక్షణాలు గల కోకో, మాల్ట్, పాలు, పంచదార సమృద్ధిగా ఉన్నాయి. బోర్న్‌విటా మీ కుటుంబంలోని వారందరికీ ప్రతిరోజూ యివ్వండి-రోజుకు రెండుసార్లు.




OBM/8845 TEL

**క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా** దీన్లోని మంచిదనం పెరుగుతుంది మీపైనిక.






రాణి ఎలాంటి పని చేసిందో!'' మామి అమాయకంగా వివరించి చెప్పిన మాటలు నాకు ఇంటికెళ్ళేవరకు తిరుగుతూనే వున్నాయి మనసంతా చేదును చవిచూసినట్లైంది

రాణి విషయం కుమార్‌తో చెప్పేవరకు మనసు ఆగలేదు బాధనైన, సంతోషాన్నైన పంచుకునే వ్యక్తి నాకు ప్రపంచంలో ఒక్క కుమార్ తప్పించి ఎవ్వరూ లేరు మరి అతను నేను ప్రకటించినంత బాధ పడలేదు

''పోన్లే ఏది ఏమైనా వాళ్ళు త్వరగా కళ్ళు తెరిచారు ఆమె భవిష్యత్ ఇకనైన బాగుపడవచ్చు'' అన్నాడు

నాకు నవ్వు వచ్చింది, కుమార్ మాటలకు ''ఇక బాగుపడేదేమిటి'' అన్నాను

''ఏం. అలా అంటావ్! ఆమె ముందు భవిష్యత్తులో ఇలాటి తప్పటడుగు ఇంక వేయదు చదువుకొని బాగుపడచ్చు కొన్నాళ్ళకి పెళ్ళి కావచ్చు''

''అది అంత తేలికా!''

''రోజులు మారాయి స్వాతీ!''

''కావచ్చు కాని మార్పు పెరుగుతున్న ధరలు చూసి, తరుగు జీవనప్రమాణాలను చూసి, వైజ్ఞానిక అభివృద్ధిని చూసి అంటున్నావు స్త్రీ పట్ల న్యాయం ఆనాడు ఈనాడు ఇంచుమించు ఒకటిగానే వుంటోంది ఆనాటి స్త్రీ చదువుకొని ఉద్యోగాలు చేయలేదు ఈనాటి స్త్రీలు అవి చేస్తున్నారు ఇలాటి చిన్న మార్పులేమోకాని పురుషుడికున్నట్లు పూర్తి స్వేచ్ఛ అవకాశం, వున్నాయంటే నేను ఒప్పుకోను''

''నువ్వు అవగాహన చేసుకొని అంటున్నట్లు లేదు ఏవో కొన్ని కొన్ని జీవితాలను సాదృశ్యంగా తీసుకొని మొత్తం జీవన పరిమాణాలను నిర్ణయించ కూడదు''

''లేదు కుమార్! పూర్వం నువ్వు అన్నట్లే నా ప్రపంచం చాలా చిన్నదిగా వుండేది ఇల్లు, కాలేజీ, పుస్తకాలు ఎప్పుడైతే నేను నీ చేయి పుచ్చుకొని బయటకు నడిచానో అప్పుడే ఈ విశాల ప్రపంచంలోకి అడుగు పెట్టినట్లనిపిస్తోంది ఎన్నో నాకు తెలియని విషయాలు తెలుసుకుంటున్నాను సరే ఆ విషయాలు వదిలేయ్ ఇంతకీ రాణిపై నీ అభిప్రాయం ఏమిటి? ఆమె చేసింది తప్పంటావా! కాదంటావా!''

## దాంపత్య సంగీతం

''కాదని నేననను కాని అవతల పార్ట్నర్‌ది కూడా తప్పంది బాధ్యతల్లేకుండా ప్రవర్తించటం''

''అయితే రాణియే దాని శిక్ష అనుభవిస్తోంది''

''అదే కాస్త సృష్టిలో ఉన్న తారతమ్యాలు మగవాడు దులబరించుకొని తిరగచ్చు ఆడదలా చేయలేదు సరే ఆమెకు మంచి భవిష్యత్తు వుండాలని కోరుతూ ఈ టాపిక్ ఇంతటితో ముగిస్తున్నాను మనరామాయణం ఎంత వరకు వచ్చింది''

కుమార్ ఈ మధ్య రామాయణమో, మహాభారతమో వివరంగా, వర్ణిస్తూ చెప్పటం మొదలు పెట్టాడు రామాయణ మహాభారతాల గురించి నాకు తెలిసింది చాలా తక్కువే కుమార్ విమర్శనాత్మకంగా చెబుతుంటే వింటానికి చాలా ఇంట్రస్టింగ్‌గా అన్పించేది

''రామాయణంలో సీతకి జరిగింది అన్యాయం కాదా!'' అన్నాను నా వాదనని వదిలిపెట్టకుండా

''ఏమిటది!''

''పాపం సీత అప్పుడు కడుపుతో వుందికదా, ఆ మాట అయినా తలచకుండా, లడవులపాలు చేయటం రాముడిలో మానవత్వం వుందా!''

''స్వాతీ! నీకో విషయం చెప్పాలి అసలు రామాయణం రాముడి పట్టాభిషేకంతో ముగిసి పోయింది అంతవరకే వాల్మీకి వ్రాసింది ఆ తరువాత ఎవరిచేతో కల్పింపబడి వ్రాయబడింది ఉత్తర రామ చరిత్ర నన్నడిగితే ఉత్తర రామ చరిత్రను రామాయణంలోకి చేర్చను''

''సరే అగ్నిప్రవేశం మాటేమిటి?''

కుమార్ సన్నగా నవ్వి ''నిప్పులో చెయ్యి పెడితే కాలుతుందా, కాలదా?''

''అనుమానం. అయితే రేపు పెట్టి చూడరాదు''

''మరి సీతకైనా అంతే స్వాతి! వాళ్ళు మనలాటి మనుషులే! మనలాగే పుట్టారు, మనలాగే పెరిగారు, మనకంటే ఎక్కువగా కష్టాలనుభవించారు అయితే వారు చేసిన పనులవల్ల వాళ్ళు మహాత్ములైయ్యారు''

''అలాంటప్పుడు ఎక్కడో వున్న అయోధ్య నుండి అరణ్యవాసం కోసం దక్షిణాది అంతా తిరగటం ఆశ్చర్యంగా లేదు, రాక్షసుల మధ్య''

''రాముడు దక్షిణాది రావటానికి ఒకే కారణం కన్పిస్తుంది నువ్వు రాక్షసులని చెప్పావే, వాళ్ళే ద్రావిడులు సినిమాల్లో చూపినట్లు రెండు కోరలు, రెండు కొమ్ములు, వికారంగా వుండేవాళ్ళు కారు ఆర్యులు ద్రావిడులకంటే అందమైనవాళ్ళే, అంతేకాదు యజ్ఞయాగాదులు తెలిసినవాళ్ళు, అందువలన ద్రావిడులకు ఆర్యులంటే మొట్టమొదటినుంచి పడేదికాదు వాళ్ళ యజ్ఞాయాగాదులవలన ఆర్యులు ఏవో శక్తులు సంపాదిస్తున్నారని ద్రావిడులు వాటిని ధ్వంసంచేయ ప్రయత్నించేవాళ్ళు ఆర్యుల మధ్య ద్రావిడల మధ్య వైషమ్యాలు ఇలా పెరుగుతూనే వచ్చాయి రాముడు ఇదంతా గమనించి ఆర్యులకి ద్రావిడలకు గల ఈ కలహాలను అంతంచేసి, స్నేహ సౌభ్రాతృత్వం నెలకొల్పాలని దక్షిణాదికి వచ్చినట్లు నా కనిపిస్తుంది శంకరాచార్యుడు చేసిన పని ఇలాటిదే కాశ్మీర్ నుండి, కన్యాకుమారి వరకు హిందూదేశం అంతా ఒక్కటే అని, నాలుగు మఠాలు నాలుగుచోట్ల స్థాపించాడు అందుకే వారంతా గొప్పవాళ్ళయ్యారు'' కుమార్ ఆగాడు

''అయితే నువ్వు అనేది ఏమిటి? అగ్నిప్రవేశ ఘట్టం పూర్తిగా కల్పితం అంటావా!'' అన్నాను అతని వాదన అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తూ

''ఆహా! నిశ్శంకోచంగా తరువాత కాలంలో చాలామార్పులు వచ్చినట్లే మనుషుల మనస్తత్వాల్లో సాంఘిక ఆచారాల్లో చాలామార్పులు వచ్చాయి వారు రామాయణాన్ని వారి యుగ లక్షణాలతో పోల్చుకొని అప్పుడు స్త్రీకి గల ధర్మాలను సీతాదేవికి ఆపాదిస్తూ అగ్నిప్రవేశ ఘట్టాలు వగైరాలు కల్పించి వుండవచ్చు అప్పటికే రాముడు, సీత దేవతల్లా ఆరాధించటం మొదలు అయ్యివుండచ్చు అందుకుని వారికి మాయలు మంత్రాలు కల్పించి, రావణాసురుడిని రాక్షసంగాను, వికృతంగా సృష్టించి కథలల్లటం మొదలుపెట్టారు నిద్ర వస్తోందా'' కుమార్ చిన్నగా అడగటం విని నవ్వి—

''లేదు సరే ఇంతకీ రాణి''

''అదిగో రాణి మాట మర్చిపో సీత అను'' అంటూ కుమార్ సున్నితంగా నా నోరు మూసేసాడు

### 11

నా హౌసర్జన్సీ పూర్తి అయింది ఎన్నో ఏళ్ల నుంచి సుదీర్ఘంగా చదువుతున్న చదువుకి ఒక్కసారి ఫుల్‌స్టాప్ పడింది ఇక జీవితం మరో మలుపు

ఉద్యోగం, ప్రాక్టీసు, ధన సమూపార్జన, చాలా నిండి వున్నాయి ఏది ఏమైన బాధ్యతల్లేని హాయి అయిన జీవితం ఇకరాదు కుమార్ నేనెప్పుడైనా ఈ మాటంటే అతను నా వాదనతో ఏకీభవించడు 'జీవితంలో ఎప్పుడుండాల్సిన ఆనందం అప్పుడుండని' వాదిస్తాడు అతను నా కంటే ఆశావాది ముందు ముందు జీవితం ఎలావుంటుందో అని తను భయ పడుతూ వుంటుంది అతను దేనికి చలించని మనిషిలా కన్పిస్తాడు భవిష్యత్తు గురించి అతనికి భయంలేదు తీయని ఆశలు తప్పించి నర్సింగ్‌హోమ్ పెట్టాలని, మంచి సర్జన్‌గా పేరు పొందాలని, తన పిల్లల్ని బాగా చదివించాలని ఏవేవో గొంతెమ్మ కోరికలు ఆ గుండె నిండా చాలావున్నాయి అవన్ని వింటూ నవ్వు కుంటుంది తను అతని కోరికలన్ని తీరితే బాగానే వుంటుంది అయితే కాలమే బదులు చెప్పాలి

శారదని చూసి చాలాకాలం అయిందనిపించి, వాళ్ళింటికి బయలుదేరాను వీధి తలుపు దగ్గరగా వేసి వుంటే చనువుగా నెట్టి లోపలకు అడుగు పెట్టాను ముందుగదిలో ఎవరో యువతి కూర్చుని నవలేదో చదువుకుంటున్నది నన్ను చూడగానే మొహం చిట్లించి ''ఎవరు – ఎవరికోసం ?''

''శారదలేదా !'' అని అడిగాను

''వుంది లోపల'' అంటు మళ్ళీ తనకేం పట్టనట్లు పుస్తకంలో తల దూర్చింది నేను ఆమె వంక వింతగా చూస్తూ లోపలకు నడిచాను

శారద వంట ఇంట్లో కూర్చుని కూరతరుక్కుం టున్నదల్లా నన్నుచూసి సంభ్రమంగా లేచి నిలబడింది

''అక్కా శ్రమ తీసుకొని మీరే వచ్చారా !'' అంటూ దగ్గర్లో వున్న పీట వాల్చింది

ఆమెమొహం వాడిపోయి వుండటం గమనించాను

''ఏమిటి చాలా బిజీగా వున్నావా ! కన్పించటం లేదు ''

''ఎందుకో లోకానికి నా మొహం చూపించా లంటే చాలా సిగ్గుగా వుంది'' అంది వుదాసీనంగా

''ఏం తప్పు చేసావ్ !''

''నేను పుట్టటమే నా పెద్ద తప్పు జీవితంలో ఏమాత్రం ఆనందం లేకపోయినా బ్రతకటం ఇంకో తప్పు ''

శారద వేదాంతం నాకర్థం కాలేదు ''ఆమె ఎవరు మీ చెల్లెలా !'' అన్నాను ముందు గదిలో ఖూర్చున్న యువతి గురించి

శారద పేలవంగా నవ్వి ''ఆ సంబంధమే మరి చెప్పాలి ఎందుకంటే ఆమె ఎవరో నాకే తెలియదు కాబట్టి ''

''అదేం''

''అదంతే అక్కా ! ఈ ఇంట్లో నేనొక మనిషినని ఎవరికి గుర్తింపు ? పది రోజుల క్రితం ఆయన హఠాత్తుగా ఆ అమ్మాయిని వెంటపెట్టు కొని తీసుకొచ్చారు ఎవరని అడిగితే, ''మా దూరపు బంధువు ప్రస్తుతం ఆమెకెవరూలేరు కొన్నాళ్ళ పాటు మనింట్లోనే వుంటుంది'' అని సమాధానం చెప్పారు నమ్మి వూరుకున్నాను కాని వాళ్ళిద్దరి ప్రవర్తన చూస్తుంటే నాకు అనుమానంగా వుంది నా కళ్ళముందే ఆ వికవికలు, ఆ సరసాలు, భార్య కంటే ఎక్కువగా ప్రదర్శించే చనువు చూస్తే ఎవరో తెలియని దూరపు బంధువంటే నమ్మరు ఇంకా మనింట్లో ఎన్నాళ్ళుంటుంది – అని అడిగి నందుకు నిన్న ఆమె ఎదుటే నన్ను హీనంగా తిట్టారు నాకెందుకని వూరుకున్నాను నా స్థానం ఈ ఇంటిలో ఒక పని మనిషి లాంటిదే ! చెప్పు అక్కా ఇంకా నన్నీ సంసారం పట్టుకొని వేళ్ళాడమంటావా ! నాకేమైనా దారి చూపించు నాకీ నరకంలో ఒక్క నిముషంకూడ వుండాలనిలేదు'' ఆమె స్థిరంగా చెబుతుంటే సానుభూతితో వినటం తప్పించి నేను మరేమి చేయలేనా ? అని ఆలోచించాను

''శారదా ! నువ్వు నిజంగా అలాటి నిర్ణయానికి వస్తే, నాదొక సలహా ! నువ్వు జీవితంమీద విరక్తి పెంచుకొని ఎలాటి అఘాయిత్యాలకు ప్రయత్నం చేయకు నీ భర్తలో ఇంకా మార్పు కలుగుతుందని ఆశ వుంటే కొన్నాళ్ళు ఓపిగ్గా నిరీక్షించు ''

''ఇంకా మార్పా! వద్దు అక్కా అలాంటి ఓర్పు నాకిక లేదు ''

''సరే నాకు తెలిసిన ఒక ఆమె హైద్రాబాద్‌లో ఇలాటి స్త్రీల కోసం చిన్న హోమ్ నడుపుతోంది ఆవిడకు ఉత్తరం వ్రాసి ఇస్తాను నువ్వు వెళ్ళి కలుసుకో బహుశ జీవనోపాధికి కావలసిన విద్యలన్నీ అక్కడ నేర్పుతారనుకుంటాను ఏది ఏమైనా అక్కడ చేరితే నీకీ నైరాశ్యం, విరక్తి కొంత తగ్గుతాయి అయితే నీ భర్తతో పూర్తిగా తెగతెంపులు చేసుకోగల మనస్థైర్యం నీకుండాలి మళ్ళీ ఒకసారి ఆలోచించి నాకు చెప్పు ''

''ఇంకా ఏమి ఆలోచించక్కర్లేదు నావాళ్ళింటికి వెళ్ళిపోదాం అంటే, వాళ్ళు బీదిరికంతో బాధపడుతూ, నన్ను పోషించే స్థితిలో లేరు ఇక నాకీ ప్రపంచంలో ఎవరున్నారు? నువ్వు చెప్పినట్లే నడుస్తాను నా కా ఉత్తరం వ్రాసి ఇవ్వు'' అంటూ నన్ను బలవంత పెట్టింది శారద

**(ఇంకా వుంది)**




డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

### యస్ ఎల్. కె. రాజమండ్రి

నా వయస్సు 32 సంవత్సరములు నేను చాలా సన్నగా వుంటాను ఈమధ్య మరీ చిక్కిపోతున్నాను బలానికి సరైన మందు తెలుప ప్రార్థన ?

★ చిక్కిపోవటానికి సరి అయిన కారణం కనుక్కోవలసి ఉంటుంది ఛాతీ ఎక్స్‌రే, మలపరీక్ష, మూత్రపరీక్ష, రక్తపరీక్ష మొదలయినవి చేయించి, నిపుణులైన వైద్యులచేత పరీక్షింప చేసుకోవాలి మందులు వ్రాయటం అనేది రోగాన్ని బట్టి ఉంటుందని వేరే వ్రాయనక్కరలేదుగా ! శరీరంలో రోగం ఉన్నప్పుడు టానిక్‌లు వాడినంత మాత్రాన లావు అవుతారనుకోవటం పొరపాటు

### పి. వి. ఎల్. – గూడూరు

నా వయస్సు 35 సంవత్సరములు నాకు రెండు సంవత్సరముల నుండి విరోచనము సరిగ్గా అవట్లేదు ఒక్కొక్క మారు తెల్లగా బంకగా అవుతుంది ఒక్కొక్క మారు గట్టిగా అవుతుంది పొత్తికడుపు నందు ఎడమ భాగముపై శబ్దము వచ్చును ?

★ మోషన్ పరీక్ష చేయించటం చాలా అవసరం మలంలోని క్రిములను కనుగొనటానికి కల్చర్ చేయవలసి ఉంటుంది ఒకవేళ మలపరీక్షలో ఏమీ తేలకపోయినా సర్జన్లచేత ఆసనద్వారం, మల విసర్జన నాళం మొదలయిన వాటిని ప్రాక్టోస్కోపీ, సిగ్మాయిడోస్కోపీ మొదలయిన సాధనాలు వాడి పరీక్షింప చేసుకోవాలి

అమీబిక్ డిసెంటరీ లేక బాసిలరీ డిసెంటరీ అని తేలినప్పుడు వాటికి పూర్తి చికిత్స అవసరం అవుతుంది అమీబిక్ డిసెంటరీ అయినప్పుడు ఫ్లజైతగాని, అమీబియాటిక్‌గాని వాడవలసి ఉంటుంది బాసిలరీ డిసెంటరీ ఉన్నప్పుడు, సల్ఫా గువానిడీన్, టెట్రాసైక్లిన్ వంటి మందులు వైద్యుల సలహాపై వాడవలసి ఉంటుంది

### ఎస్. ఎమ్. – మార్కాపూర్

నాకు దాదాపు 20 రోజులనుండి నాలుక ఇరువైపుల కొండనాలుకకు సమీపాన చిన్నవిగా రెండు గుల్లలువలె వున్నవి ఇవి రావటానికి కారణము ఏమిటి ? వీటిని నివారించుటకు ఏ చికిత్స తీసుకోవాలి ? వీటివల్ల ఏమైనా ప్రమాదమా ?

★ ఇదికూడా అక్యూట్ టాన్సిలైటిస్ లక్షణమే! పెన్సిలిన్ (శరీరానికి పడితే) టెట్రాసైక్లిన్‌ల వంటి మందులవల్ల ఈ రోగలక్షణం నయమవుతుంది మళ్ళీ మళ్ళీ ఇలా రాకుండా విటమిన్ 'సి' మాత్రలు రోజుకి 500 మి గ్రా తీసుకోవటం మంచిది

### వి. బి – మచిలీపట్నం

నేను చిన్నప్పటినుండి పళ్ళ సంరక్షణలో అశ్రద్ధ చేసాను నా పళ్ళు గారపట్టిపోయాయి ఎన్ని టూత్ పేస్టులు వాడినా పళ్ళు సరిగ్గా రావటంలేదు పదిమందిలో కలిసి తిరగలేకపోతున్నాను నాలో నేనే కుంచించుకుపోతున్నాను

★ పళ్ళకి ఉన్న గార పోవాలంటే దంత వైద్యుల దగ్గరకి వెళ్ళి ''క్లీనింగ్'' చేయించుకోవాలి

కొందరికి లాలాజలంలో ఎక్కువ ఆమ్లం ఉండటం వల్ల ఇలా జరిగే అవకాశం ఉంటుంది

### ఎమ్ వి. ఆర్ – ఖరగ్‌పూర్

నా వయస్సు 19 సంవత్సరములు కొన్ని నెలల క్రితం టి బి వచ్చినది. డాక్టర్ సలహా ప్రకారం స్ట్రెప్టోమైసిన్ ఇంజక్షనులు రోజు విడిచి రోజు 60 ఇంజక్షన్‌లు వాడాను దానితోపాటు ఐసోనెక్స్ 100 మి గ్రా రోజుకి మూడు మాత్రలు వాడుతున్నాను ఆరు నెలల నుండి వైద్యము చేయించుకుంటున్నాను ఈ మందుల ద్వారా జబ్బు పూర్తిగా నయమవుతుందా ? ఇంకా ఎన్ని నెలలు మందులు వాడాలి ? ఎలాంటి ఆహారం తీసుకోవాలి ?

★ మీరు మందులు సరిగా వాడలేదని చెప్పవలసి ఉంది మొదటి నెలలో ప్రతిరోజూ స్ట్రెప్టోమైసిన్ ఇంజక్షన్ వేసుకోవాలి తర్వాత ఒక సంవత్సరంపాటు వారానికి రెండుసార్లు వేయించుకోవాలి ఐసోనెక్స్ మాత్రలు మొదటి నెలలో నుంచి రోజుకి 300 మి గ్రాములు వాడవలసి ఉంటుంది ఆహారంలో ఎక్కువ ప్రోటీనులు ఉండేటట్లు చూసుకోవటం చాలా ముఖ్యం (ఉదాహరణగా పాలు, గుడ్లు, పప్పుదినుసులు, మాంసము మొ॥వి )

### ఎస్ వి. కె – హిందూపురం

నాకు వివాహముయి మూడేళ్ళు నిండినది నాకు మూడు నెలల క్రితం ప్రసవమయినది ఎనిమిదిన్నర నెలలకే ప్రసవమయినది గర్భముగా వున్నప్పుడు ఆరోగ్యంగానే వున్నాను ఎందువలన ప్రసవము తొందరగా అయినది ? ఇప్పటివరకూ పత్యంగానే భోజనము చేస్తున్నాను ఇప్పుడు నేనెలాంటి భోజనం తీసుకోవచ్చును ?

★ మామూలుగా పౌష్టికాహారం తక్కువైనప్పుడు త్వరగా ప్రసవం జరిగే అవకాశం ఉన్నది కానీ చాలా సందర్భాలలో కారణం ఏమీ తెలియకుండానే ఇలా జరుగుతుంది కొందరికి నెలల లెక్క తప్పు అవటంవల్ల త్వరగా ప్రసవం అయినట్లు అనిపించే అవకాశం ఉన్నది మీరు ప్రస్తుతం అన్ని ఆహార పదార్థాలు తీసుకోవచ్చును రోజుకి కనీసం 1 కిలో పాలు తీసుకోవటం బాలింతలకి చాలా అవసరం విటమిన్లు, ఇనుపధాతువు గల మాత్రలను తీసుకోవటంవల్ల తన ఆరోగ్యం, శిశువు ఆరోగ్యం బాగుంటుంది ★






# సుబ్బారావుకు పెళ్ళిముదిరింది

"డాక్టర్ లఖిన్"




సుజాతను చూసేడు చూసిన మరుక్షణంలోనే ప్రేమించేడు ప్రేమించిన క్షణంనుంచి ఆమె తలంపే మేల్కొన్న గంటలలో ఆమె గురించిన ఆలోచనలు నిద్రపోయినప్పుడు వచ్చిన కలలలో ఆమె రూపమే సుబ్బారావు పరిస్థితి వెంకట్రావుకు ఆందోళన కలిగించింది

"ఆల్‌రైట్! ప్రేమించావు టు లవ్ ఈజ్ నాట్ ఎ క్రైమ్", అని ఆగాడు వెంకట్రావు "ప్యార్ కియతో డర్నాక్యా" పాట లోపలే కొంతసేపు పాడుకున్నాడు పాటయిన తర్వాత సుబ్బారావు భుజం తట్టాడు

"నవ్ సుబ్రావ్! ఆడదాన్ని అనుభవించి ఆనందించడానికి ప్రయత్నించాలి కాని ప్రేమించ ప్రయత్నించకూడదన్నాడు ఓ తత్వవేత్త కాని చేయకూడని పని చేసేవు నువ్వు, ప్రేమలో పడ్డావు పడిన తర్వాత ఒడ్డునపడే మార్గం వెతకడం మనిషి లక్షణం నీ ప్రేమ పెళ్ళి వరకూ వెళ్ళదలంచిన ప్రేమా లేక పెళ్ళి తలంపే లేని ప్రేమా! అది చెప్పు!"

"ఓరే వెంకట్రావ్! ఆమెతో జీవితమంతా గడపాలిరా, అదే నా కోరిక నాకు ఏమాత్రం విశ్రాంతి, మనశ్శాంతి లేకుండా చేస్తున్న కోరిక మరి అందుకు పెళ్ళి చేసుకోవడంకంటె వేరే మార్గం ఏముందిరా?"

"లేదు! కాని కొన్నాళ్ళతర్వాత నీ ప్రేమజ్యోతి మలిగిపోతే, ఆమె నీ మెడకు గుదిబండవుతుంది ఇప్పుడు కావాలని బాధపడుతున్నావు అప్పుడు వదిలించుకోవడం ఎలా అని బాధ పడాలా,

స్తుంది వదిలించుకోవడం అసాధ్యమని విషాదంలోనే శేష జీవితాన్ని గడపాల్సొస్తుంది ఆలోచించు ''

''తరువాత ఏమవుతుందో చెప్పలేనురా, ప్రస్తుతానికి మాత్రం ఆమె నా సర్వస్వం ఆమెను సాయంత్రం ఆమె ఇంట్లోనే కలుస్తానురా! కలసి మనసు విప్పి ఆమె ముందుంచుతాను ఔనంటే సరే, కాదంటే ఈ జీవితంలో సౌఖ్యానికి తావులేదని గుండెను రాయి చేసుకుంటాను ''

అని వెంకట్రావుకు చెప్పి సుబ్బారావు రూము లోంచి బయటకు వచ్చేడు. ఇద్దరూ పనిచేసేది జీవిత భీమా సంస్థలో సుబ్బారావుకు ప్రేమభావన చిగురించింది క్షణాల్లో ఎన్నో అనుభూతి విరులను పూయించింది గాలిలో తేలుతున్నట్టుగా ఉంది సుబ్బారావుకు సుజాత ఎదురుగా కూర్చుని, ఆమెను చూస్తూ మాట్లాడ్డమంటే స్వర్గలోకపు అంచులలో విహరించడమే అన్న అభిప్రాయం స్థిరపడిపోయింది— సుబ్బారావులో. కాయలు నిండిన గున్నమావిని చూసినా, విరిసిన సన్నజాజి తీగెను చూసినా, నింగిని తారల్ని చూసినా అన్నింటిలో ఆ సుజాత రూపమే సౌందర్య విశేషాలే

బజారుకు వెళ్ళి షాపులను చూస్తూ కానుకగా ఏది కొంటే బాగుంటుందన్న ఆలోచనలో పడ్డాడు బజారురోడ్డున అటూ ఇటూ మూడుసార్లు తిరిగినా ఆలోచన తెమలలేదు బహుమతిని నిర్ణయించలేకపోయేడు నడుస్తూ పైకి చూసేసరికి సినిమా వాల్‌పోస్టరులో కృష్ణ శ్రీదేవికి కుంకుమ భరిణ అందిస్తున్న చిత్రం చూసిన సుబ్బారావుకు పరిష్కారం దొరికినట్టయింది వెండి, బంగారు నగల షాపులోకి నడిచాడు కుంకుమ భరిణలు చూపమన్నాడు చూపించిన నాలుగయిదు రకాలలో సీతాకోకచిలుక షేప్ కలిగిన భరిణ నచ్చింది కుంకుమతో నింపి ప్యాక్ చెయ్యమన్నాడు సినిమాల వలన ప్రయోజనం మనసులో మెదిలింది రిక్షా ఎక్కి ఊరికి దూరంగా ఉన్న సుజాత ఇంటికి బయలుదేరాడు రిక్షాలో పక్కన లేని సుజాతను ఊహించుకుని కలలలో తేలిపోయేడు ఆమె స్పర్శ వెచ్చదనాన్ని, ఆమె మేని మెత్తదనాలను ఊహలోనే ఆనందించాడు పదే పదే జేబులో ఉన్న కుంకుమ భరిణను తడిమి చూసుకున్నాడు సుజాత ముభావంగా ఉండే మనిషని సుబ్బారావుకు తెలుసు పది మాటల కొక మాట మాత్రమే!

దారిలో కనుపించిన కోవెళ్ళకు రిక్షాలోంచే వందనాలు చేసేడు ఇష్టదైవాన్ని తలచుకొని సుజాత హస్తం అందేట్టు చేయమని ప్రార్థించేడు చూసిన అమ్మాయిల పెళ్ళిచూపుల తతంగాలు స్మృతిపథంలో మెరిసాయి చూసినవాళ్ళలో ఎవ్వరూ నచ్చలేదు సుబ్బారావుకు సుజాతను చూసిన తర్వాత వాళ్ళు తనకు ఎందుకు నచ్చలేదో అర్థమయింది సుబ్బారావుకు మ్యారేజస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్ స్వర్గంలో తనకూ సుజాతకు వివాహమైపోయినట్టే ఊహించి రిక్షాలో మురిసిపోయేడు సుబ్బారావు స్వర్గంలో జరిగినది నేలమీద ఎందుకు జరగదని ధైర్యం వచ్చింది సుబ్బారావుకు తలపులోని ఆనందం మనిషి ముఖంమీద చోటు చేసుకుంది లేతబుగ్గలు ఎరుపుదనాన్ని దాల్చాయి కనులలో ఆనందపు వెలుగులు నాట్యం చేసేయి

''ఒరే సుబ్బా! నిన్ను చేసుకున్న ఆడది సుఖపడుతుందిరా! శాంతం, మాట నెమ్మదితనం, మంచితనం ఎంతమంది మగాళ్ళలో ఉంటాయిరా ఇన్ని మంచి గుణాలు!'' తల్లి పదేపదే అనేమాటలు గుర్తుకొచ్చాయి కఠినంగా ఉండడం తనకు చేత కాదన్న నిజం గుర్తుకొచ్చింది సుబ్బారావుకు

''ఒరే సుబ్రావ్! నీది వెన్నమనసు ఇట్టే కరగిపోతుంది. అడిగినది ఏదైనా కాదనకుండా ఇచ్చేసే దొడ్డగుణంరా నీది!'' వెంకట్రావు మాటలు గుర్తుకొచ్చాయి సుబ్బారావుకు అలా ఇవ్వడం నుంచి ఎదురయిన ఇబ్బందులు గుర్తుకొచ్చాయిసుబ్బారావుకు నాలుగురోజుల్లో తిరుపతి ప్రయాణం పెట్టుకొన్న తను స్నేహితుడు యాదగిరి అవుసరమని అడిగితే, రెండ్రోజుల్లో తిరిగి ఇస్తానని మొహమాట పెడితే ప్రయాణంకని ఉంచిన డబ్బు యాదగిరికి అప్పుగా ఇచ్చాడు అన్నరోజుకు కాదుకదా ఇప్పటికీ ఆ డబ్బు యాదగిరి వాపసు చెయ్యలేదు ఇవ్వడమేకాని తిరిగి ఇవ్వమని అడగడానికి మొహమాటం అడ్డువచ్చే సుబ్బారావు ఇవ్వమని అడగలేదు యాదగిరిని. మరో స్నేహితుడు వేదాంతరావు, తను ఎంతో ముచ్చటపడి కొనుక్కున్న పెన్నును గంటలో ఇస్తానని చెప్పి తిరిగి ఇవ్వలేదు అడగడానికి మొహమాటం అడ్డువచ్చి అడగనేలేదు సుబ్బారావు ఇలాంటి సంఘటనలు గుర్తుకొచ్చినప్పుడు బాధకు బదులుగా ఆనందం కలుగుతుంది సుబ్బారావుకు తనకున్నది ఇతరుల కిస్తే తప్పేముందన్న భావనే తప్ప, తను నష్టపోయే నన్న ఆలోచనే రాదు సుబ్బారావుకు

''ఒరే సుబ్రావ్! నీలాంటి మంచివాళ్ళు నూటికి కోటికి ఒకరుంటారు ఇప్పుడు ఫరవాలేదు, కాని భవిష్యత్తులో ఈ అతిమంచిని నువ్వు విసర్జించక పోతే ఇబ్బందుల పాలవుతురా!'' వెంకట్రావు బోధన

రిక్షా దిగి రిక్షా అబ్బికి డబ్బులిచ్చి సుజాత ఇంటి గేటు తలుపు తెరుచుకుని లోనికి నడిచాడు సుబ్బారావు సుజాతకు గార్డెనింగ్ అంటే ఇష్టం గులాబీ, చేమంతి, మల్లె, సన్నజాజి, ఇంకా ఎన్నో రకాల పూలమొక్కలు వీటికి కాపలా అన్నట్టు ఒక మామిడిచెట్టు, ఒక వేపచెట్టు చెట్టు నీడన పూల మొక్కలు బ్రతికి బట్టకట్టలేవనేమో! చెట్లను ఒక వారగా వదిలేసి పూలమొక్కలను నాటిపించింది సుజాత విరిసిన గులాబీల్లో సుజాతను చూస్తూ మెట్లెక్కి లోనికి వెళ్ళాడు సుజాత తమ్ముడు సుధాకర్ పలుకరించాడు హాల్లో కూర్చోమని చెప్పి అక్కకు చెప్పడానికి లోనికి వెళ్ళేదు తిరిగివచ్చి ''అక్క మిమ్మల్ని గదిలోకి రమ్మంది'' అని చెప్పి ఇంట్లోకి వెళ్ళిపోయేదు

హాలుకు ఎడంచేతి వైపు ఉన్నది సుజాత గది సుజాత తండ్రికి పెయింట్స్ ఫ్యాక్టరీ ఉంది అదికాక ఇంకా కొన్ని వ్యాపారాలు ఉన్నాయి ఒక కొడుకు, ఒక కూతురు కొడుకు సుధాకర్ చిన్నవాడు, నైంత్ క్లాస్ చదువుతున్నాడు అమ్మాయి సుజాత బి యస్‌సి ఫైనల్ ఇయర్ సుజాత తండ్రి వామనరావుకు ఆ ఊరిలో మంచి పలుకుబడి ఉంది వామనరావుకు సుబ్బారావు తండ్రి వరహాలరావుకు దూరపు బంధుత్వముంది దాన్నిమించి స్నేహముంది, వ్యాపారరీత్యా లావాదేవీలున్నాయి

''రండి సుబ్బారావుగారూ! మొన్న ఫ్లవర్ ఎగ్జిబిషన్‌కు వస్తానని రాలేదేం?''

''రావడం పడలేదు, మీరు వెళ్ళారా?''

''కూర్చోండి! పువ్వులకంటే అందంగా అలంకరించుకున్న వాలంటీర్లు, ఇట్‌వాజ్ సూపర్బ్!''

లో వాల్యూమ్‌లో స్టీరియో వీణా నాదాన్ని






# కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలాబిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకి ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవదని మనవి

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతవేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు

– సం॥

## సుబ్బారావుకు పెళ్లి కుదిరింది

పలుకుతోంది టేబిల్‌మీద స్టీరియో ప్రక్కనే సుజాత ఫొటో నవ్వుతూ పలకరిస్తున్నట్టుంది

"ఎప్పుడు వచ్చినా ఆ ఫొటో వంక మొదటిసారి చూస్తున్నంత ఆసక్తిగా చూస్తారే!"

"అనంతమైన అందాన్ని చిన్నఫొటో ఫ్రేమ్‌లో ఇమడ్చగలిగే మానవ మేధస్సు అధిరోహించిన విజయ శిఖరాలు తలపులోకి వచ్చి ఆశ్చర్యపడుతూ ఉంటాను అందుకే ఆ ఫ్రేమ్డ్ ఫొటోకేసి మీకేసి అంత ఆసక్తిగా చూస్తాను"

"లాస్ట్ వీక్ మీ నాన్నగారు మా ఇంటికి వచ్చారు మీలానే ఉంటారు కాని మీ కంటె గట్టిగా మాట్లాడుతూ శబ్దం చేస్తూ నవ్వుతారు "వాడొట్టి అమాయకుడురా, అందుకే వ్యాపారంలో పెట్టకుండా ఉద్యోగానికే పంపించాను" మీ నాన్నగారు మా నాన్నగారితో మీ గురించి అన్నమాటలు ఎదుగూబొదుగు లేని ఉద్యోగాలకంటె వ్యాపారాలే నయం కదండీ సుబ్బారావుగారూ!"

"ఏమో! ఈ ఉద్యోగం నాన్న వేయించారు చెయ్యమన్నారు చేస్తున్నాను ఉద్యోగం చేయకపోయినా లోటురాని కుటుంబం మాది మీకో చిన్న కానుక ఇవ్వాలనిపించింది మీ కభ్యంతరం లేకపోతే"

"ఎందుకూ? వాట్ ఈజ్ ది అకేషన్?"

"ఆ అకేషన్" వీణావాద్యం వేగాన్ని పుంజుకుంది వీణా వాయిద్యానికి దీటుగా మృదంగం మ్రోగుతోంది, రెంటికి బ్యాగ్రవుండ్‌లా వయోలిన్ మంద్ర స్వరంలో పలుకుతోంది

"ఆగిపోయారు,ఏమిటి అకేషన్,మీ బర్త్‌డేయా, అయితే హేపీ రిటర్న్స్ ఆఫ్ ది డే!"

"అబ్బే, కాదు! నా బర్త్‌డే క్రిందటి సంవత్సరంలోనే అయిపోయింది"

సుజాత చిన్నగా మువ్వలు మ్రోగినట్లు నవ్వసాగింది

"అదేనండీ! డిశంబరులో నా బర్త్‌డే, ఇప్పుడు ఫిబ్రవరిలో ఉన్నాంగా!" సుబ్బారావు ముఖం ఆమె నవ్వుకు ఆనందంతో అంతకుమించిన సిగ్గుతో ఎరుపెక్కింది

"సుజాతగారూ! ఇదిగో ఈ కుంకుమ భరిణె నా కానుక ఎందుకంటె"

"భలేవారే, నా కంటె చదువులో ఎక్కువైన వారు, వయసులో ఎన్నో కొన్నేళ్ళు పెద్ద అలా నీళ్ళు నమిలినట్లు వాక్యాన్ని మధ్యలోనే ఆపేస్తారేమండీ" నవ్వుతూనే ఉంది మువ్వల శబ్దం సాగుతూనే ఉంది

"ఐ ఐ ఐ ఐలవ్‌యూ!"రిహార్సల్సు వేసుకున్న ఎన్నో వాక్యాలలో, ప్రిపేరు చేసుకున్న ఎన్నో వాక్యాలలో ఇదొక్కటే గుర్తుకొచ్చి నోట్లోంచి బయటకొచ్చింది గుండెలమీంచి ఏదో బరువు దిగిపోయినట్టు, తొలగిపోయినట్టు అనిపించింది సుబ్బారావుకు

నవ్వుతున్నదల్లా సుజాత, సుబ్బారావు మాటల్ని విని ముఖం నిండా ఆశ్చర్యాన్ని పులుముకుంది లేచి తారస్థాయినందుకుంటున్న వీణా వాద్యాన్ని నిశ్శబ్దపరచింది గది ఎడం చేతివైపు డ్రెస్సింగ్ టేబిల్

## (ఆ) కలికాలం

ఆకలి పస్తులు యెందరికో
ఆస్థుల ఆకలి యెందరికో
ఆకలికాలం ఓరన్నా
ఇది కలికాలం రా అన్నా

అడగకపోతే అమ్మైనా
అన్నం పెట్టదు ఒట్టన్నా
కష్టంచేసి ఫలితం యివ్మని
అడగకపోతే నీ పని సున్నా

కూడూ గుడ్డా యిల్లూ వాకిలి
నీకున్నా – లేకున్నా
అందరిలాంటి మనిషివిరా
హక్కులున్న మహరాజువిరా

హక్కుల సంగతి మరిచావంటే
బిక్కుబిక్కుమని చూశావంటే
దోపిడి దొంగల యాగంలో
బలిపశువుగ నువు నిలిచేవు
వెచ్చటి నెత్తురు మడుగుల్లో
ఆఖరి స్నానం చేసేవు

— టి. ఎస్. ఎస్. రంగనాథ్

ముందుకు వెళ్ళి అద్దంలో తన రూపాన్ని చూసుకుని మోముపైకి పడుతున్న ముంగురులను సవరించుకుంది

"మీ నాన్నగారికి చెప్పి మా నాన్నగారితో మాట్లాడమనండి ఈ ప్రేమలు నాకు తెలీనివి అమ్మ, నాన్న ఔనంటె నా కభ్యంతరంలేదు" భరిణ చేతిలోకి తీసుకుని మూత తెరిచింది, కుంకుమ తుళ్ళి కొంత వక్షస్థలంమీద, కొంత చుబుకమ్మీద పడింది మువ్వల శబ్దం ఇంతకు మునుపుకంటె మధురంగా ధ్వనించింది

తండ్రికి ఉత్తరం వ్రాయడానికి మనసు తొందర చేస్తుంటే, "వెళ్తానని" చెప్పి సుజాత ఇంటినుండి బయటకొచ్చాడు తిన్నగా రూమ్‌కొచ్చి ఉత్తరం వ్రాయడానికి టేబిల్‌ముందు కూర్చున్నాడు టేబిల్‌మీద తండ్రి వ్రాసిన ఉత్తరం–

చిరంజీవి సుబ్బారావుకు నాన్న ఆశీర్వదించి వ్రాయునది వామనమూర్తితో మాట్లాడేను సుజాతంటే నువ్వు ఇష్టంగా ఉన్నావని ఇద్దరికీ పెళ్ళి చేస్తే మంచిదని వాడికి చెప్పేను ఈరోజే వాళ్ళ దగ్గరనుంచి జాబు వచ్చింది వాళ్ళు వివాహానికి సుముఖంగా ఉన్నారు త్వరలోనే ముహూర్తం పెట్టి ఉత్తరం వ్రాస్తామన్నారు వివాహ తేదీ వరకూ వాళ్ళింటికి వెళ్ళకు, అది మన సాంప్రదాయం

అమ్మ ఆశీస్సులు పంపమంది నీ తండ్రి,
వరహాలరావు

"ఏమిటోయ్ సుబ్రావ్! నీలో నువ్వే నవ్వేసుకుంటున్నావు?"

"ఓరేయ్ వెంకట్రావ్! నా పెళ్ళి కుదిరిందిరా! సుజాతతో!" ఆనందంగా గొంతు పెంచి చెప్పాడు సుబ్బారావు



సీరియల్

# కాలం కరిగాక

## వలివేటి నాగచంద్రావతి

(గత సంచిక తరువాయి)

రామయ్యగారు గమ్మత్తైన సొంత ఫార్ములా శిక్ష ప్రయోగించేవారు మనవడిమీద

అతని కిష్టంలేదన్న నీలం చొక్కాలు అరడజను కుట్టించేవారు "నేనొద్దని చెప్పేదాకా ఇవే తొడగండి వాడికి" అని శాసించేవారు

ఆయన ఆజ్ఞ కాదని అడ్డంపడ్డానికి ఎవ్వరికీ దమ్ముండేవికావు జాలిచూపులు చూసే గోపీకృష్ణని కన్నతల్లీ తండ్రీకూడా కడుపు చెరువవుతున్నా ఎవరు కన్నబిడ్డో అన్నట్టు చూడనట్టే తొలగిపోయే వాళ్ళు అక్షరాలా ఆ శాసనం అమలు జరిగి తీరేది

చిత్రమేమిటంటే ఒక్కరూ తన పక్షాన నిలవరు, ఎవ్వరూ తన్నాదుకోరు అని తెలుసుకున్నాక దిటువు తెచ్చుకుని వీరుళ్లా తలెగరేసి మారు మాటాడకుండా వేసిన శిక్షకి తలవంచేవాడు గోపీకృష్ణ అంతేగానీ నోరుతెరిచి తనదే తప్పనిగానీ, ఇంకెప్పుడూ చెయ్యనని ప్రాధేయపట్టంగానీ చేసేవాడు కాదు

అనేక విషయాల్లో ఇలాంటి పరాభవాల మొట్టికాయలు తింటూనే వుండేవాడు గోపీకృష్ణ

ఆ విధంగా తన విలువేమిటో ఎరుక పరిస్తే ఈ మొండి మనవడు భయభక్తులు కలిగి తనంత తానే కాళ్లబేరానికి వస్తాడని రామయ్యగారి భావన

కానీ భయభక్తులు మాటేమోగానీ తాతగారి ప్రతాపం అతి కఠినంగా చవిచూసి తప్పనిసరిగా తల ఒంచిన గోపీకృష్ణకు అభిమానం దెబ్బతిన్నట్టయి చిన్నవయస్సులోనే ఆయనంటే తిరస్కార భావం మనస్సున పాదుకొన్నది

వయసు పెరిగేకొద్దీ అది తాట్ప్రమాణంగా పెరిగిపోయిందే తప్ప తరగలేదు అల్లా పెరిగిన కసి నిండిన పాత్రలో మళ్లీ నీళ్లుపోస్తే పొరిలిపోయినట్టు ఒక్కొక్కసారి రెచ్చిపోయి ఆయన్ని ధిక్కరిస్తూ ఏదో చేసెయ్యాలనే భావాన్ని ప్రేరేపించేది

వెంటనే ఏదో ఒకటి — ఆయన మండిపడి పోయేపని — గడపదాటనివ్వని చెల్లెళ్లని 'ఎ' సర్టిఫికెట్ సినిమాకి తీసుకువెళ్లిపోవటం, లేకపోతే తాతగారికి కంపరమెత్తిపోయేలా తను హిప్పీ జులపాలూ, గడ్డాలూ పెంచీడం, తమ్ముడికి ఈలవేస్తూ కన్ను గొట్టడం వంటి కొంటె చేష్టలు నేర్పడం లాంటివి చేసేవాడు ఆ వెంటనే విస్సురుగా గోడకు కొట్టిన బంతి అంతే విసురులో వెనక్కి వచ్చి మొహాన గుద్దుకున్నట్టు దాని ప్రతిఫలమూ అనుభవించేవాడు

ఆ నెల పాకెట్ మనీ రద్దయిపోయేది సిటీ బస్సు ఛార్జీలు కూడా దక్కేవికావు అంతేనా — తిరుపతివెళ్ళి నున్నగా గుండు చేయించుకు వస్తే తప్ప కాలేజీ ఫీజు కూడా కట్టనని ఆల్టిమేటమ్ జారీచేసి ఎప్పటికప్పుడు మనుమడి కోరలు పిండేసేవారు రామయ్యగారు

తాతా మనవళ్ల చెలగాటాలు ఇంట్లోవాళ్లకి ప్రాణ సంకటాలయ్యేవి.

ముఖ్యంగా పద్మావతమ్మకు కొడుకు దుడుకు చేష్టల మూలంగా ఆవిడెన్నో దెప్పిపొడుపులు పడాల్సి వచ్చేది కొడుకు పడే అగచాట్లూ చూడలేకపోయేది రెండూ కోతగానే వుండేవామెకు

"ఒరే నాయనా పెద్దాయనతో ఎందుకురా జగడం!" అనేవారు చిదంబరంగారు హితవు చెబుతున్నట్టుగా

"ఆయన్నెదిరించి ఎందుకురా లేనిపోనిచిక్కులు తెచ్చుకుంటావ్" అని మొత్తుకునేది తల్లి

వాళ్లు చెప్పడం కాదు గోపీకృష్ణకూ అవగత మవుతోంది — వాళ్లు వెరిచేది ముసలాయనకుగాదు- ఆయన వెనకనున్న ధన బలానికని

డబ్బు లేకపోతే దుబ్బుకు కొరగారు అది తాతగారి పిడికిట్లో వున్నది ఆయన్ని కాదన్నవాళ్లకు చిప్ప చేతికిచ్చి బయటకు వెళ్లగొట్టగలడు తిక్క తిరిగితే యావదాస్తీ ఆశ్రమాలకో, ఆడపిల్లలకో చెందేట్టురాసి సన్యాసం పుచ్చుకోగల మొండి మనిషి ఆయన

అంచేత ఉన్నన్నినాళ్ళూ ఆయన్ని నేమకతప్పదు అభిమానాన్ని మంటగలిపేసి ఎంత సహించరానిదిగా నన్న వుండనీ ఆయన అహంకారానికి బానిసలవక తప్పదు, అని గ్రహించుకోగల వయస్సూ—గ్రహింపూ వచ్చింది

ఇప్పుడిప్పుడు చాలా మటుకు తగ్గిపోయేదు కానీ సహనానికి పరీక్ష పెట్టినట్టు మరీ నిర్లక్ష్యంగా మూర్ఖంగా ముసలాయన వ్యవహరించినప్పుడు మాత్రం అతని యువరక్తం ఖస్సుమనకుండా నిగ్రహించుకొనటం కష్టమవుతోంది

కేశవరావుగారి సంబంధం కుదిర్చినప్పుడు, "ఏరా అబ్బీ నీకాపిల్ల ఇష్టమేనా ?" అనన్న అడగ లేదతన్ని అతనికి సంబంధించిన విషయం కానట్టే తాంబూలాలుకూడా పుచ్చేసుకున్నారు

చిన్నతనంనుంచి వసంత తనకి తెలుసును నూనూగు మీసాల నూత్న యవ్వనం ఇప్పుడిప్పుడే ఆమెను సౌందర్య దృష్టితో చూడమని పురిగొల్పు తోంది అందాల మొలకలాంటి ఆ పిల్లరూపు అతనిలో స్థిరపడింది కూడా ఆమెను పెళ్లాడ్డం అతనికి అయిష్టమేమీకాదు

అయితేనేమి— "చిన్నవాణ్ణి చితకవాణ్ణి కాను గదా! నా పెళ్లి కుదురుస్తూ నామమాత్రంగానన్నా నన్ను కనుక్కుందామనే ప్రయత్నం చెయ్యరే"మని అతని మానసం తెగ ఉద్రేక పడింది

అయితే జాబిలి కిరణం, వెన్నెల వెలుగువంటి వసంత తన స్వంతం కాబోతున్నదన్న అనుభూతి అతని హృదయాన్ని చక్కిలిగింతలు పెట్టింది 'అడక్కపోతేనేమి అదృష్టాన్ని అందుకొమ్మన్నారే కానీ చేదుమేయమనలేదు గదా!' అని ఇంగితం బుద్ధులు చెప్పి అతని ఆగ్రహాన్ని ఉపశమింపచేసింది

ఆ సారికలా సరిపుచ్చుకోగలిగేడు కాబట్టి ఏ గొడవా లేకపోయింది

"చదువయ్యాక పెళ్లి" అని తాతగారు ఆంక్ష పెట్టినప్పుడు కూడా గోపీకృష్ణ అభిమతమూ అదే అయుండబట్టే ఇబ్బంది లేకపోయింది అప్పుడూను

బియస్సీలో క్లాసు తెచ్చుకున్నాడు యమ్మెస్సీకి నాగపూర్‌లో సీటు వచ్చింది

**జరిగిన కథ—16.** వయసు తాకిడికి తట్టుకోలేక నర్సుగా పనిచేస్తున్న సోఫియాతో కోర్కెలు తీర్చుకుందామనే దురుద్దేశంతో సొత్తు పెట్టుకొంటాడు డా మురళి సోఫియా మరో ఉద్దేశ్యంతో అతనికి తన సర్వస్వాన్ని అర్పించడమే కాకుండా ప్రచారం కూడా చేస్తుంది సోఫియాని వదిలించుకొనే వీలు లేక అమ్మ దగ్గరకు పారిపోతున్న మురళిని అడ్డుకొని జరుగవలసిన తతంగమంతా జరిపిస్తాడు ధామస్ ఇక చేసేదిలేక ఓ మారుమూల ప్రాంతానికి బదిలీ చేయించు కొంటాడు మురళి విషయాలన్నీ కేశవరావ్‌గారి ద్వారా విన్న కామేశ్వరమ్మ లోలోపలే మధన పడుతుంది మురళి చెల్లెలు వసంతలక్ష్మి పెళ్లి ఏర్పాట్లు జరుగుతుంటాయి సుబ్బాయమ్మ మురళి వ్యవహారాన్ని కూపీ లాగటానికి ప్రయత్నిస్తుంటుంది మామూలుగా జరిగినదానికి కొంత కల్పితం చేసి చెప్పి ఆమెను తాత్కాలికంగా శాంతపరుస్తుంది కామేశ్వరమ్మ మురళిపై వున్న కేసును పోగొట్టుకోవడాన్కి కొంత డబ్బు ఇచ్చి, మిగతాది యం ఓ చేస్తానని చెప్పివస్తాడు కేశవరావ్ ఎంత డబ్బు ఖర్చుపెట్టినా మురళి ఉద్యోగం పోతుంది ఆ తరువాత అతను మరో గ్రామంలో స్వతంగా ప్రాక్టీసు పెడతాడు కేశవరావ్, చిదంబరం ఇద్దరూ కలిసి 'ప్లాస్టిక్ అండ్ కేన్' ఫ్యాక్టరీ పెట్టి బాగా అభివృద్ధి చేస్తారు చిదంబరంగారి అబ్బాయి గోపీకృష్ణకి తమ లమ్మాయి వసంతని ఇచ్చి పెళ్లి చేయాలన్న ఆశ కామేశ్వరమ్మ పడగా కేశవరావ్ తమలో వున్న మచ్చను గుర్తుచేస్తాడు అదీగాక చిదంబరం తండ్రి పరమ చాదస్తుడు కానీ చిదంబరం గారింట్లోని వాళ్లే వసంతని కోడలిని చేసుకోవటానికి సుముఖత చూపటంతో పెళ్లి ఖాయమవుతుంది

అదృష్టమేమిటంటే మనుమడు ఏమి చదువు తానన్నా వెంటనే పచ్చజెండా చూపిస్తూ వచ్చారు ఇంతవరకూ రామయ్యగారు అదీ ఒక సుగుణమను కోవాలిసిందే

గోపీకృష్ణ అన్ని యూనివర్సిటీలకు సీటు కొరకు అప్లయి చేస్తున్నప్పుడే వివాహ లగ్నానికి కేశవరావుగారితో సంప్రదింపులు మొదలుపెట్టారు రామయ్యగారు

''ఇంత చపలచిత్తం మనిషేం ఈయన! నిన్నటి వరకూ చదువు పూర్తవనీ అన్నవాడు మళ్లీ ఇలా నడిమధ్యన మారుస్తాడే''మని గోపీకృష్ణ చిర చిరలాడాడు పైసకీ పావులాకీ తండ్రి దగ్గరో, తాత దగ్గరో చెయిసాచి దేవిరించాలిసొస్తున్న ఈ స్టేజీలో 'మెడకోడోలన్నట్టు' ఇప్పుడు పెళ్లొద్దం సుతలామూ ఇష్టంలేదు

'ఈ చదువవాలి ఆర్థికంగా నిలబడటానికి ఓ ఆధారమంటూ దొరికి పళ్లిచ్చే ముళ్లచెట్టులాంటి తాతగారి పోషణలోంచి బయటపడాలి తల్లీ చెల్లెళ్ల అడుక్కో గండంగా నడుస్తోన్న ఈ ఇడుముల త్రోవలోనికి ఆ లేడికళ్ల పిల్ల — వసంతని ఈడ్వకూడదు' ఇవి అతని మనసులోని ఆలోచనలు పైకి ఎలా చెప్పుకుంటాడు ?

'పిల్లవాడు మన కాపుదలనించి ఎడంగా వెడుతున్నాడు అక్కడ ఏ ఆకర్షణలు ఆకట్టు కుంటాయో తెలీదు ఒళ్లుమరిచి ఏ బురదలో తూలుతాడో ?' అని రామయ్యగారి భయం

'ఇక్కడి బంధమొకటి తగిలించి పంపితే, మనసు నియమ నిగ్రహాలు కోల్పోయి హద్దుల్ని అతిక్రమించాలనుకున్నప్పుడు — అట్లాంటి ఉవాంఛనీయాల్లో అడుగు ముందుకు పడనీకుండా ఈ సంకెల ఆపుతుంది' అనే ముందు జాగ్రత్త ఆయనది

కాస్త వయసొచ్చి జ్ఞానమొస్తున్న పిల్లలు ముందు తొందరపడి హటం సాగించినా పెద్దలు నిదానించి సాధకబాధకాలు విడమరిచి చెప్పితే అర్థం చేసుకుని మనసు మార్చుకుంటారు రామయ్యగారికా సహనమేది ?

''బొడ్డూడని వెధవలకి నేను చేసే పన్లకి అర్థాలూ సంజాయిషీలూ చెప్పకోవాలా ?'' అనుకునే దురహంకార మాయనది

ఇప్పుడు జరిగితీరవలిసిందే అని పెద్దాయన గట్టిగానే పట్టుపట్టారు

''ఇప్పుడు మాత్రం చేసుకోను కట్టేసి చేయగలరేమో చూస్తాను'' అని చిన్నాయన భీష్మించుకు కూర్చున్నాడు

మళ్లీ మొదలు రభస, రగడ, నిప్పుల కుంపటయింది ఇల్లు

చూసి చూసి తిరుగులేని బ్రహ్మాస్త్రం వదిలారు రామయ్యగారు

''చదువు పూర్తవటమే నీ అభ్యంతరమయితే ఇక్కడితో నీ చదువు బంద్ అయిపోయింది పెళ్లంటావా — ? ఎప్పుడు చేసుకుంటావో ఇక నీ ఇష్టం నేనడగనిక'' అని తేల్చేశారు అదే చివరి మాటన్నట్టు

షాక్ తగిలినట్టయింది గోపీకృష్ణకి



చదువతనికి ఉపాసనా దైవతం మహా ప్రియమైన ఆ తల్లి ధ్యానంలో ఇతరత్రా చికాకు లన్నిటినీ మరిచిపోగల ఆరాధకుడతను తాతగారు ఆయువుపట్టున కొట్టిన ఈ దెబ్బకు చేతులెత్తక తప్పలేదు

ఇది చాలక తల్లి హితబోధలు ''ఎందుకొచ్చిన పంతంరా ఇదీ ఇవాళ ఎమ్మెస్సీ అంటున్నావు — రేపు రీసెర్చీ అంటావు ఆ తరవాత ఇంకేదో వుంటుంది చదువులకి అంతమెక్కడ ? నువ్విలా వాయిదాలు వేస్తూ చదువుకుంటూ పోతూంటే ఎన్నేళ్లని ఈడేరి నీకసి వాగ్దానమయిన పిల్లని ఇంట పెట్టుకుంటారు నాయనా వాళ్లు ? 'కుదుర్చుకునీ ఇంకా ఏవిటమ్మా ఆలస్యం అని లోకులు పాడుస్తున్నారమ్మా' అని ఇప్పటికే కామేశ్వరమ్మ మోతపెడుతున్నదాయె వాళ్లనంత ఇబ్బంది పెట్టడమేమి సబబూ చెప్ప వాళ్ల సంగతి అటుంచు పాపం — మాట కఠినం మూలాన మనకు విరోధంగా అనిపిస్తుందిగానీ మీ తాతగారికి మాత్రం మనసూ మమకారం లేదనగలవా ? వయస్సు మీద కొస్తున్నదాయనకూను ప్రథమ పౌత్రుడివి నీ పెళ్లి పేరంటమన్న చేసుకోవాలనీ చూసుకోవాలనీ ఆయనకు వుండదా ? ఆయన పరంగా కూడా కొంచెం ఆలోచించాలి నువ్వు దీక్ష వుండాలే గానీ వివాహమొక ఆటంకమా నీ చదువుకి'' అని సౌమ్యాన చెప్పీ చెప్పీ మొత్తానికి అతనిచేత 'ఊ' అని పించేసరికి మూగాడితో మాట్లాడించినంత పనయింది

అక్కడికి వాతావరణం చల్లబడింది



ఆ చల్లదనమూ ఎన్నాళ్ళ నిలిచేను నిప్పు ఉప్పులాంటి వాళ్ళమధ్యన కుదిరిన సయోధ్య— అందునాఅవసరార్థం అతికించుకున్నది—తాత్కాలికమే అవుతుంది కానీ శాశ్వతమైనదికాదు

నిన్నటినుంచి మళ్ళీ మొదలయింది గాలి దుమారం

తాతగారిని తన ఫ్రెండ్స్ కివ్వటానికని ఇన్విటేషన్స్ అడిగాడు గోపీకృష్ణ ఓ కట్ట శుభలేఖలు సవ్యంగానే మనవడి చేతిలో వుంచారు రామయ్యగారు

పెట్టి ఊరుకోలేదు — ''పిలువు పెళ్ళివరకు అయితే అభ్యంతరంలేదు గానీ, అడ్డమయిన వాళ్ళనీ భోజనాలకి చెప్పకొరే '' లని ఓ మడతపేచీ మాట వదిలారు

మళ్ళీ ఏ సంగ్రామానికి ఇది నాందీ సూచకమో!

గోపీకృష్ణ అనుమానంగాచూసి, ''అడ్డమయిన వాళ్ళెవరు ? నా ఫ్రెండ్స్‌కని చెప్పానుగా '' అన్నాడు విసుగ్గా

''అదేలేవోయ్ స్నేహితులేలే ఆ నానాజాతి సమితినీ విందుకు పిలవద్దనే చెప్పేది మన వాళ్ళెవరయినా వుంటే వాళ్ళను మటుకూ పిలువు,'' అన్నారు చాలా సామాన్యంగా

''అంటే ఒక్కొక్కణ్ణే పట్టుకుని నువ్వు బ్రాహ్మడివా అబ్రాహ్మడివా అని వాకబుచేసి, ఒకణ్ణి పెళ్ళికి, ఒకణ్ణి తిండికి ఆహ్వానించనా ? అది వారి కెంత తలతీసినట్టుగా ఉంటుందో గమనించారా ? పిలిచి అట్లా పక్షపాతం చూపించే కంటే అసలు పిలవకుండా వుండటం ఉత్తమం కాదూ ?''

ఎంత నిగ్రహించుకుందామన్నా ఆగ్రహమాగటం లేదు గోపీకృష్ణకు అంతకంతకు కంఠస్వరం తీక్షణమౌతోంది

దానికి సాయంగా అతగాడు ఏమాత్రం చల్లబడటానికి ఆస్కారమివ్వకుండా పుల్లవిరిచినట్టు వచ్చింది సమాధానం రామయ్యగారినుంచి

''నేను చెప్పినట్టు చెయ్యడానికి నీకు సమ్మతం కానప్పుడు — సరే — అలాగే పిలవటం మానెయ్ వాళ్ళు రాకపోతే మరేం నష్టంలేదులే'' లని

తన నియమ నిష్టలూ, అభీష్టాలూ, అధికార దర్పాలూ సాగించుకునే సందర్భాల్లో ఎటువంటి మొహమాటాలకీ తావివ్వడాయన

## కాలం కరిచాక

అభిమానాన్ని దెబ్బతీసే ఆ పెద్దరికపు జులుం అంటేనే గోపీకృష్ణకు మండుకొచ్చేది

తల్లి మాటలకి కరిగి కాస్తంత ఆయన్ని దగ్గరగా ఆలోచించే ప్రయత్నంలో రవంత కుదురుకుంటున్న సుహృద్భావం తాతగారి ఈ వైఖరికి క్షణంలో చెదిరిపోయింది

తిక్కరేగినట్టుగా చేతిలో శుభలేఖలు నేలకు విసిరికొట్టి, ''పిల్ల మీ ఇష్టం, పెళ్ళి మీ ఇష్టం, మేం వూపిరి పీల్చాలంటే మీ ఇష్టం మేము మనుషుల మనుకుంటున్నారా — మీ రాడించే తోలుబొమ్మల మనుకుంటున్నారా ?'' అంటూ ఒళ్ళు మరిచిపోయి అరుస్తుంటే తండ్రి ఒచ్చి ''మతిపోయిందేమిట్రా ?'' అంటూ లోపలికి నెట్టుకెళ్ళారు

అప్పటికే రామయ్యగారి కళ్ళు ఎరుపుకు తిరిగాయి

అప్పటినించీ ఇప్పటివరకూ తాతామనవళ్ళిద్దరూ బరిమీద పందెపు పొట్టేళ్ళలా బుసలు విడుస్తున్నారు

త్రివేణమ్మ మొగుడికే వత్తాసి ఇచ్చి ఈ తరం కుర్రకారుమీదా, వాళ్ళ చట్టుకారీ వేషాలమీదా శక్తిమేరకు చురకలు అంటిస్తూ భర్త పక్షాన నిలిచింది

చిదంబరంగారూ, పద్మావతమ్మా వాళ్ళశివాలు తగ్గించేందుకు నానా తిప్పలూ పడుతున్నారు

పిల్లలు పాపం ఆబోతుల మధ్యన లేగదూడల్లా పెద్దవాళ్ళ చిరాకులకు గురి అవుతూ, ఉత్తపుణ్యానికి వారి చివాట్లను భరిస్తూ, వాళ్ళ కోపోపశమనానికై నిరీక్షిస్తూ ఒదిగి ఒదిగి తిరుగుతున్నారు

భేదాభిప్రాయాలువ్వప్పుడు మధ్యేమార్గం అన్వేషించి దాన్ని లవలంభించాలిగానీ ఇట్లా ఆవేశాలూ, కావేషాలూ పెంచుకుంటూ పోవటం వల్ల ప్రయోజనం ఏమిటంటారు చిదంబరంగారు ఆ ఇంకో త్రోవనీ తనే సూచించబోయినారు కూడా

''కేశవరావుతో చెప్పి మీ స్నేహితులకి ప్రత్యేకం ఒక బంతి వేయిస్తాను సరా'' అని

అందుకు రామయ్యగారు ఏమనేవారో ఏమోకానీ ముందు గోపీకృష్ణే ఒప్పకోలేదు

''రర్ వీల్లేదు వాళ్ళు తిండిలేక వస్తున్నారనుకుంటున్నారా — మీరు ఎత్తేత్తి వేసే ముష్టి మెతుకులు తినిపోడానికి ?'' అంటూ అడ్డం చెప్పాడు

ఈ తగాయిదా ఇంకా కొనలు సాగుతూనే వున్నది దాని శాఖల రవరవలే వస్తూనే కామేశ్వరమ్మ చెవులబడత

''ఏమయి వుంటుందో ?'' అన్న సందేహం కామేశ్వరమ్మ కళ్ళలో మెదలటాన్ని పసిగట్టింది పద్మావతమ్మ

ఆపిడ వేరే వేరే అర్థాలు తీసే అవకాశం ఎందుకు కల్పించాలని తానే అత్తగారు వినకుండా గదిలోకి తీసుకువెళ్ళి కూర్చోబెట్టి సంగతీ సందర్భాలు ఏకరువు పెట్టుకువచ్చింది

''ఏమిటో వదినా ! అన్నీ ఎరుగున్నదానివే గనక వెళ్ళబోసుకో గలుగుతున్నాను నా బిడ్డ అని చెప్పటంకాదు వేలెత్తి చూపడానికి ఒక్క దురలవాటు లేదు వాడి దగ్గర పడనివాళ్ళతోకూడా సాత్వీకుడనిపించుకునేటంత నిమ్మళంగా వుంటాడు అదేమి ప్రారబ్ధమో ఆ ఇద్దరికీనే చుక్కెదురు ఆయన ఎడ్డమంటే తెడ్డమంటాడు ఇల్లో కొరిక్కి తెస్తాడు

ఇప్పటి పరిస్థితే చూడు — ఆచార వ్యవహారాల్లో ఆయనకున్న పట్టింపు తెలిసీ తనకా మొండితనం ఎందుకు ? ఇంతకీ వాళ్ళిద్దరూ బాగానే ఉన్నారు - మధ్య మాకుపోతున్నయ్ మతులు'' అంటూ నిట్టూర్చింది

సంగతి విన్నాక కామేశ్వరమ్మ మొహం వెలవెలపోయింది మనస్సు అలజడి పడిపోయింది

ఇది చాలనట్టు ఇంకాస్త హడలగొడ్తూ త్రివేణమ్మ ఓ తొంభైతొమ్మిది చదివింది మనవడి మీద

''పిదపకాలం పిదపబుద్ధులూ కాకపోతే ఏమిటో చెప్పమ్మాయ్ ఎంత నియమంగల వంశాలు మనవీ— ఎంత నిష్టగల సాంప్రదాయాలు మనవీ — అదంతా మంటగలిసేసి చాపకూడు తినాలట — బాగుందా ?'' అన్నది, తనతో ఏకీభవించక ఏంచేస్తావన్నట్టు

భయపడుతూ భయపడుతూనే, ''ఈ చిన్న చిన్న విషయాల దగ్గర పట్టింపేమిటి పోనిద్దురూ'' అన్నది కామేశ్వరమ్మ

''అలాగనకు — 'తోటకూరనాడే చెప్పకపోతివే' అనీ ఇప్పుడు ఏన్నదని ఆమోదిస్తే రేపు పెద్ద సంకరానికే సాహసించడా ? లయినా ఇది చిన్న

# ఇది అంతర్జాతీయ వయో

సోమేశ్వర్

అంతర్జాతీయ వయోవృద్ధుల సంవత్సర సందర్భంగా మీలాంటి వృద్ధ పండితుల ను సన్మానించాలను కుంటున్నాం! మీరు ఓ వెయ్యి రూపాయలు

విరాళంగా యిస్తే...!

'ఏమేవ్! కొంతం కొత్త ఇలా వస్తావా..? ఈ ఫోటో నీదో కాదో చూస్తాను... నా పింఛన్ ఫారంలో అంటించాలి!

'ఏవిటి.. రెండేళ్ళ సర్వీసు వుండగానే పింఛన్ కోసం అప్లై చేశారు..? ఎందుకు..?

యిప్పుడు అప్లై చేస్తే నా మనవలక్కైనా 18 డబ్బు దక్కుతుందని..

వికలాంగుల సంవత్సరం- వికలాంగులకు ఉద్యోగ అవకాశాలు ఎలా కల్పించారో అలాగే వయోవృద్ధుల సంవత్స రం లో వయోవృద్ధులకు ఉద్యోగా లు కావాలం టున్నారు! సార్!!

యిది అంతర్జాతీయ వయోవృద్ధుల సంవత్స-రమేగా మరో పదేళ్ళకు మీ సర్వీసును పెంచమని మీ ఆఫీసర్ని అడగలేక పోయారా....?

'ఏవిట్రా సర్వార్థం! చాలా రోజులకు కలిశావ్? యిప్పుడేం ఉద్యోగం చేస్తున్నావ్? సర్వీసెంతుంది?

ఆ.. యింకా ఉద్యోగం లో చేరి నెలరోజులు కాలా... రెండేళ్ళ సర్వీసు మాత్రమే వుంది...!






## కాలం కరిచాక

విషయమనిపిస్తోందా నీకు ?'' అంటో మిడుతూ మిడుతూ చూసి విస్తుపోయిందావిడ

కామేశ్వరమ్మ నసుగుతూనే, ''ఆహా అదికాదు పిన్నీ! కాలం మారుతోంది కాలానుగుణ్యంగా మనమూ కాస్త చూసీచూడనట్టు పోవాలి మరి'' అనేటంతలో ఎప్పుడు వచ్చేరో ఏమో రామయ్యగారు గుమ్మంలో నుంచొని, ''రంగులు మార్చే కాలాన్ని అకాలంగానే బుగ్గవనీ – నేనల్లాంటి వూసరవిల్లిని కాను ఈ కంఠంలో వూపిరాడుతూండగా ఈ ఇంట్లో అపభ్రంశాలు జరగనివ్వను'' అంటున్నారు ఆయన కంఠం ఖంగుమన్నది

బిక్కచచ్చిపోతూ గబుక్కున లేచి నుంచుండిపోయింది కామేశ్వరమ్మ

బొంబాయి సేటు వచ్చాడు పెరట్లో జామిచెట్టు దులుపుతున్న పిల్లలందరూ బిలబిల్లాడుతూ అతనిచుట్టూ చేరారు

ఆభరణాల అందాలను అందరూ అంచనా వేస్తుంటే కామేశ్వరమ్మ మటుకు అన్యమనస్కంగానే వుండిపోయింది మనసు మనసులో లేదామెకు కడుపులో నైరాశ్యం చుట్టలు చుట్టలుగా పేరుకుంటోంది ఏమి సెలక్టు చేశారో ఏమిటో ఆమెకు ఈషన్మాత్రమూ పట్టనేలేదు

ఎలాగో వచ్చిన పని అయిందనిపించి కూతుర్ని తీసుకుని ఇంటికి వచ్చేసింది

* * *

విధి నడకలు బహు విచిత్రంగా వుంటాయి ఏఏ దారుల్లో ఉపద్రవాలు పొంచున్నయ్యో ఊహించుకుంటూ ఆ మార్గాల వెంబడే దృష్టి నిగిడ్చి జాగ్రత్త పడుతున్న సమయంలో, అదటున గుమ్మం దాటి లోపలికి అడుగుపెడుతున్న వాడిమీదకి తలుపు చాటునించీ 'భౌ' మంటూ ఎదుట కురికి జడిపించినట్టు, సురక్షిత మనుకుంటున్న దిక్కునుంచీ ప్రమాదం హటాత్తుగా తారసిల్లి నిలువునా స్థంభించేలా చేస్తుంది అదే విధి విశేషం

పరువం జొరబడుతున్న తొలిదినాల్లో మనసుకు తాకిన వలపు మహా సుందరంగా సుకుమారంగా వుంటుంది

ఒకరి దరిశనం కొకరు ఒకరి ప్రతీక్ష, తహ తహ ఆ నిరీక్షణ ఫలించిన సన్నివేశాల్లో మూగవోయే మానసాలు, కళ్లూ కళ్లూ కలవేత, మూగబాసలు

ప్రస్తుతం ఆ అవస్థ అనుభవిస్తున్న జోడీ వసంతా గోపీకృష్ణలు

వసంత కనిపించగానే గోపీకృష్ణ విరజల్లులు కురిపించినట్లు సన్నగా నవ్వుతాడు మధురమ్మైన బరువేదో వ్రాలినట్టు వసంత రెప్పలు మూతలు పడతాయి పైనించీ హిమ బిందువులు పడుతోన్న పూరేకుల్లా అధరాలు అల్లల్లాడుతాయి

అపురూపంగా లభించె ఆ అనుభూతిలో ఎంత మాధుర్యం! ఎంత తీపిదనం!! పాపం, ఆ అనుభూతి నష్టపోయిందివాళ వసంత

ఆ నిరుత్సాహంతో వసంతా, ఏదో అవ్యక్తమ్మైన భయాహవంతో కామేశ్వరమ్మా మాట మంతీ లేకుండానే ఇంటికి వచ్చారు






బులుసు వేంకటరమణయ్య

# విభిన్నభావాల పరిష్కారం

తండ్రికి తన కుమారులందరిమీదా సమానమైన వాత్సల్యం ఉన్నా, అతని పుత్రులకు— ఒకరిపై ఒకరికి సరిసమానంగా ప్రేమ ఉంటుందని చెప్పలేము కొందరిపై ఎక్కువగాను, కొందరిమీద తక్కువగాను ఉండవచ్చును ప్రేమ ఏమాత్రం లేకపోవడం, అసంతృప్తి ఉండవచ్చు వారు ఒకరిమీద ఒకరు చాడీలు చెప్పితే తండ్రి వారికి నచ్చచెప్పి, పరస్పరం ప్రేమించుకొనేటట్లు చేస్తాడు వాళ్ళ తమ తప్పు తెలుసుకుంటారు కూడా ఇలాగే ఉద్రిక్తులను శాంతపరచి ఉత్తములు సమైక్యతను కలిగిస్తారు

ఒక గురువువద్ద వివిధ ప్రాంతాలకు చెందిన శిష్యులుండేవారు వారు తమ తమ భాషల గొప్పతనాన్ని చెప్పుకుంటూ కలహిస్తూ ఉండేవారు తమ భాషయే సరియైనదని అనుకునేవారు ఇది గ్రహించి, వారికి బుద్ధి చెప్పదలచి గురువు ఒకనాడు వారందరినీ పిలిచి ''మీరు మనకు ఆవునుండి లభించే ద్రవరూపమైన ఆహారపదార్థాన్ని తీసుకురండి'' అని ఆదేశించాడు వారందరూ కొద్ది కొద్దిగా ఆవు పాలు తీసుకువచ్చారు ''మీరు తెచ్చినదేమిటో మీ మీ భాషల్లో చెప్పండి'' అని ఆయన వారిని అడిగాడు ఒకడు ''దూధ్'' అనీ, మరొకడు ''పాలు'' అనీ, మరొకడు ''మిల్క్'' అనీ, ఇంకొకడు ''పాల్'' అనీ చెప్పారు ''మీరందరు తెచ్చిన వస్తువు ఒకటే గదా! పేర్లు మాత్రం ఆ యా భాషలనుబట్టి వేరువేరుగా ఉన్నట్లు తోస్తున్నది అలాగే భాషలు వేరైనా, అభిప్రాయం ఒక్కటే! దీనికోసం తలలు పగుల గొట్టుకొని తగవులాడనక్కర్లేదు నేను, మీకందరికీ అర్థమయే ఒక భాషలో బోధిస్తున్నాను గదా! అందరూ గ్రహిస్తున్నారు అంచేత మీరిట్టి వాదవివాదములకు దిగకుండా సమైక్యంగా వసలుకోండి'' అని ఆయన బుద్ధి చెప్పాడు వారంతా సిగ్గుతో తలలు వంచుకొన్నారు

మతాల సంగతి కూడా అంతే మతాలు వేరయినా ప్రాప్యమైనది ఒక్కటే! ఒక గమ్యస్థానానికి నాలుగు వైపులనుంచీ మార్గాలు ఉన్నట్లు కైవల్యప్రాప్తికి వేర్వేరు మతాలు ఉన్నాయి ఇందులో, గొప్పదీ, తక్కువదీ అనే భేదం లేదు ఈ సంగతి భగవంతుడు మనకు మాటలతో చెప్పలేదు కాని, ఆలోచనకు బుద్ధిని ప్రసాదించేడు దానిని తగిన పద్ధతిలో ఉపయోగించి ఆలోచిస్తే యీ సంగతి వారి వారికి అర్థమవుతుంది ఆ పరిశీలన ఆవేశాలను మాన్పి, సర్వ సమానత్వానికీ, ఐకమత్యానికీ సహకరిస్తుంది

---

పగటిపూట సింహద్వారం మూసివుంచటం అలవాటు కాదు ఆ అలవాటుకి భిన్నంగా మూసివుంటంచూసి కించ పడుతూనే ఓరవాకిలిగా వున్న తలుపులు నెట్టింది కామేశ్వరమ్మ

దానికి తగ్గట్టే లోపలి వాతావరణం ఏదో విలక్షణంగా తోస్తోంది హాల్లో గడియారంలోని పెండ్యులమ్ కామేశ్వరమ్మ మనసులాగే అస్తిమితంగా వూగులాడుతోంది

మొన్ననంగా సుబ్బాయమ్మ పినతల్లి కూతురు ఒకావిడ — కోకిలాంబ అనీ— కాస్త లేనింటి మనిషి శుభలేక అందగానే, ''అయ్యో కామేశ్వరమ్మ వదినా తోబుట్టువులు లేనిదానివి రెక్కాడుకునేవారు లేక ఏమి అవస్థ పడుతున్నావోనని కబురు తెలిశాక నిలవలేక పోయాననుకో'' అంటూ తన అయిదుగురు సంతానంతో సహా రెక్కలు కట్టుకుని వచ్చి వాలింది

ఆ పిల్లలు పిల్లలు కారు బహుశా క్రితం జన్మలో కిష్కింధాపుర అగ్రహారీకులో, లంకానగర వాసులో అయుండాలి నిద్రకు లోబడిన ఏ స్వల్ప కాలమో మినహాయించి వాళ్ళచేతులూ కాళ్ళూ నోరూ కుదురుగా వున్న క్షణంలేదు

వాళ్ళ అల్లరీ ఆగంతో ఇల్లు హోరెత్తిపోతోంది పెళ్ళి పన్నమాట దేవుడెరుగు, ఆ తల్లికి వాళ్ళ పొట్టలు నింపడమూ, వాళ్ళ కొక్కిరాయి పన్ను సమర్థించుకురావటానికే పొద్దు సరిపోతోంది

అట్లాంటిది ఇప్పుడు — మృగరాజు పాలకువ పసిగడితే అడివిలో పక్షిగణాలు కూడా కువకువలు మాని గవ్‌చిప్ అవుతాయిట అట్లాగ కోతిమూక లాంటి ఆ పిల్లలంతా బుద్ధిగా చడీ చప్పిడీ లేకుండా కూర్చునివున్నారు తలా ఒక మూలనా

ఆ పిల్లల తల్లి పడమటింటి గుమ్మంలో, చూపులు దక్షిణంవేపు గదులకేసీ, చెవులకి ఉత్తరం వేపు గదులకేసీ, డ్యూటీలువేసి తాను మాత్రం నామకహా చేటొకటి బియ్యంపోసి ముందు పెట్టుక్కూచునుంది

దుష్టసంహరణానంతరం అవతారం చాలించి తిరిగి శేషపాన్పుమీద పవ్వళించి విశ్రాంతి తీసుకుంటున్న శ్రీ మహావిష్ణువులా, చిన్న పనిచేసొచ్చి అలిసిపోయినవాడిలా రోజులో మూడువంతులు హాల్లో ఉయ్యాల బల్లెక్కి కునికిపాట్లు తీస్తుండే పార్వతీశంగారు ఉత్తరం వేపు గదిలో మంచంమీద వెన్ను నిటారుగా నిలిపి కూర్చుని, చేతులు తిప్పుతూ అభినయం చేస్తూ చెబుతున్న సుబ్బాయమ్మ గుసగుసలు అతి కుతూహలంగా చెవులొప్పగించి వింటున్నాడు

కామేశ్వరమ్మ రావటం చూసి సుబ్బాయమ్మ ఆదరాబాదరా లేచి ఇవతలకు వస్తూ, ''అటు చూడు'' అన్నట్టు కనుసైగ చేసింది

ఆ లోపున కామేశ్వరమ్మ యాదాలాపంగా దక్షిణంవేపు గదికేసి చూడనే చూసింది చూస్తూ అలాగే ఉండిపోయింది

చాపమీద కూర్చుని ఫ్లాస్కులో పాలు గ్లాసుల్లో నింపి పిల్లలకిస్తోందొక యువతి

''ఎవరు వాళ్ళు ?'' నుదురు చిట్లించింది కామేశ్వరమ్మ

లిప్తలో సగంవేపు కూడా పట్టలేదు ఒక్క మాటూ చూడకపోతేనేమి ఇట్టే పోల్చుకున్నది

''వాళ్ళు మురళి భార్యా పిల్లలూ కాదూ ?'' మిన్నువిరిగి మీద పడ్డట్టయింది

''ఓరి భగవంతుడా !'' అప్రయత్నంగా ఆ కనబడనివాణ్ణి తలుచుకుంది కామేశ్వరమ్మ

కళ్ళు గిర్రున తిరిగేయి ముందుకు తూలబోయి నిభాయించుకున్నది

''ఈ సమయంలోనా వీళ్ళరాక ? ఈ కబురు గానీ రామయ్యగారికి అందితే ఇంకేమన్నా వుందా ?''

గడగడలాడిపోయిందామె విపరీతమైన ఆదుర్దాతో నిస్సత్తువ వచ్చేసింది

''మురళి మురళి ఎక్కడా ?'' అన్నది నీరసంగా తడబడిపోతూ

అంతా ఆకళింపు అయినట్టే వున్నది సుబ్బాయమ్మకి వేలెత్తి పైన వున్నాడన్నట్టు సంజ్ఞ చేసింది గుంభనగా

తల్లక్రిందులయిపోతున్న తల్లికేసీ, తమాషా చూస్తున్న బంధుజనాలకేసీ, ఇంత గందరగోళానికీ కారణమయినా నిమిత్తమాత్రురాలినన్నట్టు నిర్వికారంగానో నిర్లక్ష్యంగానో అనేది తెలీకుండా ఒక చూపు మటుకు మధ్య మధ్య ఇటు పడేస్తూ తన పని తను చేసుకుంటున్న సోఫియాకేసీ అయోమయంగా చూస్తూ నిలుచున్న వసంతతో, ''విస్తళ్ళు గడి పెట్టు'' అని చెబుతూ తను గబగబ మేడెక్కిపోయింది కామేశ్వరమ్మ

బాల్కనీలో కూర్చునివున్నారు తండ్రీ కొడుకులు తండ్రితో ఏదో నెమ్మదిగా చెప్పుకుంటున్నాడు మురళి

ఒకప్పుడు పెదవులమీద చెదరని కొంటెనవ్వుతో కేరెజాట్ మాస్టర్‌లా వుండే మురళి ఇప్పుడు చిరునవ్వనేది మరిచిపోయి జగతిలోని విషాదాన్నంతా తానే మోస్తున్నట్టు కనిపిస్తున్నాడు

**(ఇంకా వుంది)**



విమల్ వారి నుండి
హుందాతనం ప్రతిబింబించే అద్భుతమైన
షర్టింగ్ శ్రేణి. ప్లెయిన్స్, చెక్స్,
స్ట్రైప్స్, పేనల్స్, ప్రింట్స్. 1600 కు పైగా.

# ఎక్జిక్యూటివ్ షర్ట్




## షర్టింగ్‌లు

సరికొత్త శ్రేణి
భారతదేశపు అత్యంత అధునాతనమైన
టెక్స్‌టైల్స్ ప్లాంట్ సమర్పణ

మీ విమల్ రిటైలర్‌ను వీటికోసం అడగండి:
ఎక్స్‌ప్రెస్సీ, ఛాయిస్, ట్రెయిన్, ఎడిటర్,
విమల్ బాయ్, స్పెడ్, ఎక్జిబిటర్.



# సినిమా



'యువరాజు'లో ఒక దృశ్యం

## ఎ ఎన్ ఆర్. తో సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వంలో జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి చిత్రం

"లక్ష్మీచిత్రద్వారా విడుదలయ్యే నాగేశ్వరరావు గారి తొలి చిత్రం మాదవడం మాకెంతో ఆనందంగా ఉంది," అన్నారు జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి ఈయన విష్ణుప్రియా సినీకంబైన్స్ పతాకంలో సెప్టెంబర్‌లో మొదలెట్టే చిత్రంలో జయసుధ, గీత, ప్రభాకరరెడ్డి ముఖ్య భూమికలు నిర్వహిస్తారు రాజశ్రీ రచన, సెల్వరాజ్ ఛాయతో బోణం అంజనేయులు నిర్వహణ బాధ్యతలు వహిస్తారు



'రాముడు కాదు కృష్ణుడు'లో ఒక సన్నివేశం

## మిద్దె రామారావు నిర్మించే రెండు చిత్రాలు

"రెండు చిత్రాలు మొదలెట్టబోతున్నాను చిరంజీవి రాధికలతో ఎస్ ఎ చంద్రశేఖర్ డైరక్షన్‌లో ఒక చిత్రాన్ని అక్టోబర్ 1వ తేదీన, కృష్ణ, శ్రీదేవిలతో ఎ కోదండరామిరెడ్డి డైరక్షన్‌లో రెండో పిక్చర్‌ని డిసెంబర్‌లో ప్లాన్ చేశాను," అన్నారు శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ అధినేత మిద్దె రామారావు అక్టోబర్, నవంబర్ నెలల్లో 1–10 తేదీల మధ్య, డిసెంబర్‌లో 21-10 తేదీల మధ్య మొదటి చిత్రం షూటింగ్ పూర్తయిపోతుంది రెండవ చిత్రంలో రావుగోపాలరావు, అల్లురామలింగయ్య ప్రభృతులు కూడా ఉంటారు రెండు చిత్రాలకు తెరవెనుక సత్యానంద్ చక్రవర్తి, వెంకట్, సాయికుమార్, వెంకటరత్నం, కె ఎల్ ఎన్ శాస్త్రి కృషి చేస్తారు

## హైదరాబాద్ చలో !

యువకుడు, ఉత్సాహవంతుడు శ్రీ సమరసింహారెడ్డి అధ్యక్షతన మన రాష్ట్రంలో చలనచిత్రాభివృద్ధి సంస్థ కార్యక్రమాలు ముమ్మరంగా కొనసాగుతున్నందున పరిశ్రమలో పలువురు ఇనుమడించిన ఉత్సాహంతో హైదరాబాద్‌లో రికార్డింగ్ థియేటర్లు, ఎడిటింగ్, ప్రాసెసింగ్ యూనిట్ల నిర్మాణానికి ముందుకువస్తున్న విషయం ఎంతో ఆశాజనకమైంది

★ తను కోరిన ప్రదేశంలో స్థలం కేటాయిస్తే రికార్డింగ్, ఎడిటింగ్, డబ్బింగ్, ప్రీవ్యూ థియేటర్ల సముదాయ నిర్మాణానికి సిద్ధంగా ఉన్నట్లు దాసరి నారాయణరావు తెలియజేశారు "లక్షలు గడించాలన్న ఉద్దేశ్యంతో కాదు, పరిశ్రమకు కొన్ని సదుపాయాలు అదనంగాసమకూర్చటమే నా ధ్యేయం," అన్నారాయన

★ నిర్మాతకు 30 వేల నుంచి 50వేల వరకు ఖర్చు, ఎడిటర్‌కు శ్రమ తగ్గించే– సాంకేతికపరంగా అత్యాధునికమైన కంప్యూటరైజ్డ్ డబ్బింగ్ థియేటర్‌ను మద్రాసులోనిర్మించిన డి రామానాయుడు భాగ్యనగర్‌లో రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేస్తున్న ఇన్ ఫ్రాస్ట్రక్చర్‌లో తనకు కనీసం అయిదెకరాల స్థలం కేటాయిస్తే, 'సురేష్ కాంప్లెక్స్' పేర ఔట్‌డోర్ యూనిట్, డబ్బింగ్ థియేటర్ వగైరా సర్వ సదుపాయాలూ గల అత్యాధునికమైన స్టూడియో నిర్మించే విషయమై రాష్ట్ర ప్రభుత్వంతో సంప్రదింపులు జరుపుతున్నట్లు తెలియజేశారు అవసరమైతే నాగిరెడ్డిగారి అండదండలతో వారి విజయ–వాహినీ స్టూడియోలలోని ఒక యూనిట్‌ను అక్కడికి తరలించేలా కోరగలమని కూడా ఆయన చెప్పారు

★ ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం – ఫిలిమ్‌లో ఎక్కడంటే అక్కడ ఫాస్ట్ ఫార్వర్డ్, రీవైండ్ చేసుకుంటూ, ఎప్పటికప్పుడు సంభాషణలు లిప్ మూవ్‌మెంట్‌తో సరిగ్గా సింక్ అయినదీ – లేనిదీ సరిచూసుకునే కంప్యూటరైజ్డ్ డబ్బింగ్, రికార్డింగ్ థియేటర్‌ను దాదాపు ముప్ఫై లక్షల వ్యయంతో నెలకొల్పడానికి నిశ్చయించారు

★ ఇంకా – ఔట్‌డోర్ యూనిట్‌ల కోసం ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్, విజయకృష్ణా ఫిలిమ్స్ ఎం ఎస్ రెడ్డి, డబ్బింగ్ థియేటర్ల కోసం గోపాలరావు, ప్రీవ్యూ థియేటర్ల కోసం భాగ్యనగర్ స్టూడియోస్, డబ్బింగ్ – ప్రీవ్యూ థియేటర్ల కోసం రంజిత్‌కుమార్, తిలక్, ఎం ఎస్ రెడ్డి, ఎడిటింగ్ యూనిట్ల కోసం తిలక్, జట్ల వెంకటస్వామినాయుడు, విజయకృష్ణా కాంప్లెక్స్‌లు, ఫర్నిచర్ – కాస్ట్యూమ్స్ యూనిట్‌ల కోసం జి వి సుబ్బారావు, ఎ వెంకటరత్నం, కె సూర్యనారాయణ, విజయకృష్ణా ఫిలిమ్స్‌వారు పెట్టుకున్న దరఖాస్తులు ఆమోదింపబడినట్లు తెలుస్తోంది

## కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో కృష్ణ, కృష్ణంరాజు

"సినిమా స్కోప్‌లో తీస్తున్నాం. మద్రాసు మదుమలై, ఊటీలలో తొలి షెడ్యూల్ ఆగస్ట్ 28 నుంచి సెప్టెంబర్ 15 వరకు జరుగుతుంది. చివరి రెండు షెడ్యూల్స్ అక్టోబర్ – నవంబర్ నెలల్లో 20–30 తేదీల మధ్య జరుగుతాయి. సంక్రాంతికి విడుదల," అన్నారు అశ్వనీదత్. ఈయన నిర్మించే వైజయంతీ మూవీస్ చిత్రానికి ఆగస్ట్ 14న పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగింది. కృష్ణ, కృష్ణంరాజు, శ్రీదేవి, జయప్రద, రావుగోపాలరావు సత్యనారాయణ, అల్లురామలింగయ్య వగైరా తారాగణం. సత్యానంద్, చక్రవర్తి, వేటూరి, కె. ఎస్. ప్రకాష్, భాస్కరరాజు, కోటగిరి వెంకటేశ్వరరావు, వి. ఎస్. రెడ్డి, జి. రామారావు, సలీం తెరవెనుక కృషి చేస్తారు. కె. రాఘవేంద్రరావు దర్శకుడు.

## నిర్మాతగా రాజనాల

"కొందరు శ్రేయోభిలాషుల, ఆత్మీయుల ఒత్తిడివల్ల చిత్ర నిర్మాణం చేపట్టవలసి వచ్చింది," అన్నారు తెలుగు, తమిళ, కన్నడ, హిందీ భాషల్లో 450 చిత్రాలకు పైగా నటించిన కేరెక్టర్ ఆక్టర్ రాజనాల ఈయన ఒక పౌరాణికం, రెండు సాంఘిక చిత్రాలను నిర్మిస్తారు



'కలవారి సంసారం'లో కృష్ణ, శ్రీదేవి

# విశేషాలు

-జి. వి. జి.

## "పట్టికో పట్టుకో"

పై పేరు గల చిత్రాన్ని యోగేంద్ర ఆర్ట్ పిక్చర్స్ సంస్థ నిర్మిస్తోంది ఆగస్ట్ 14న తొలి గీతం ధ్వనిముద్రితమైంది నరసింహరాజు, పద్మనాభం, చిట్టిబాబు, చంద్రలేఖ, లక్ష్మిచిత్రతో పాటు కొందరు రంగస్థలానుభవం గల కళాకారులు పాల్గొంటున్నారు "ఒంగోలు ప్రాంతాలలో సెప్టెంబర్ 1 నుంచి, హైదరాబాద్‌లో అక్టోబర్ 15 నుంచి నెలాఖరువరకు రెండు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అని నిర్మాత బి ఎ. ధనరామరాజ్ తెలియజేశారు కె రవీంద్రనాధ్ కధ, మాటలు రాశారు ఎస్ దేవరాజ్ సంగీతం, విజయ వెంకటేశ్ ఛాయలో బ్రహ్మ దర్శకుడు

## "నీడలాంటి నిజం"

గుణచిత్ర పతాకంలో తయారయ్యే నటి లక్ష్మి సొంత చిత్రానికి పై పేరు పెట్టినట్లు ఆమె భర్త, నిర్మాత మోహన్ తెలియజేశారు శోభన్‌బాబు, లక్ష్మి, చిరంజీవి రంగనాథ్, మాధా, పండరీబాయి, ఓ విశిష్టమైన పాత్రలో జగ్గయ్య నటిస్తున్నారు. రామకృష్ణరాజా సంభాషణలు, కె వి మహదేవన్ సంగీతం, చిట్టిబాబు ఛాయ, వి సి గణేశ్‌నిర్వహణతో భార్గవ దర్శకుడు

## ఎ. ఎన్. ఆర్. తో జంధ్యాల దర్శకత్వంలో బుచ్చిరెడ్డి చిత్రం

"సంగీత నృత్య ప్రధాన చిత్రం. వచ్చే ఫిబ్రవరి 14న మొదలవుతుంది," అన్నారు భీమవరపు బుచ్చిరెడ్డి. ఈయన జంధ్యాల కథ, దర్శకత్వంలో నిర్మించే చిత్రంలో ఎ. ఎన్. ఆర్. సరసన శ్రీదేవి నర్తకిగా నటిస్తుంది. ఆత్రేయ సంభాషణలకర్త. చక్రవర్తి సంగీతం, భాస్కరరాజు శిల్పం. జి. జి. కృష్ణారావు కూర్పుతో బి. అంజిరెడ్డి నిర్వహణ బాధ్యతలు వహిస్తారు. ఫిబ్రవరి—మార్చి నెలల్లో 14–20 తేదీలమధ్య, ఏప్రిల్‌లో 1–20 తేదీల మధ్య జరిగే మూడో షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది.

## కృష్ణ, జయప్రదలతో డైరెక్టర్ మల్లిఖార్జునరావు చిత్రం

"హీరో హీరోయిన్‌లు కాకుండా ముఖ్యమైన పాత్రలు ఇంకో ఇరవైనాలుగు ఉంటాయి. క్రయిమ్ సెంటిమెంట్ మిళితమైన కథ, మాటలను పరుచూరి బ్రదర్స్ రాశారు," అన్నారు డైరెక్టర్ ఎం. మల్లిఖార్జునరావు. నవచిత్ర ఇంటర్నేషనల్ పతాకంలో సనత్‌కుమార్, నారాయణబాబు నిర్మించే ఈ చిత్రానికి జనవరిలో గీతాలు రికార్డవుతాయి. షూటింగ్ ఫిబ్రవరిలో మొదలై, ఏప్రిల్ చివరన పూర్తవుతుంది. సత్యం సంగీత దర్శకుడు.

'బిల్లా—రంగా'లో చిరంజీవి, మోహన్‌బాబు



# ఇప్పుడు! ప్రపంచ ప్రసిద్ధమైన పసిమిచాయ రహస్యం ఇండియాలో!

# క్లియర్-టోన్



ప్రత్యేక దినుసు చర్మానికి తేటను, పసిమిఛాయను తెస్తుంది-ప్రకృతి సిద్ధంగా.

శాస్త్రీయమైన సూత్రం మచ్చల్నీ, కళంకాల్నీ తొలగిస్తుంది.

మేలైన సూర్యకవచం చర్మం నల్లబడటాన్ని అరికట్టుతుంది.

సమృద్ధిగా చెమ్మనిచ్చే పదార్థం చర్మాన్ని మృదువుగా చేస్తుంది.

## పరిపూర్ణమైన పసిమిచాయ క్రీం

ప్రపంచమంతటా వివిధ దేశాలలో లక్షలాది సుందరులు క్రమంతప్పకుండా వాడుతున్నారు, **క్లియర్-టోన్**

అంతర్జాతీయ ఔషధ శాస్త్రపరిశోధనా ఫలితమైన ఈ శాస్త్రబద్ధమైన పసిమిచాయ సూత్రీకరణను నికొలాస్ లాబరేటరీస్ ఇండియా లిమిటెడ్ వారు మీకందిస్తున్నారు

అంతర్జాతీయ స్వీకరణ పొందిన సూత్రం **క్లియర్-టోన్** మీ చర్మానికి తేటను పసిమి-చాయను తెచ్చేందుకు ఇండియాలో లభించే మరే యితర క్రీంలోనూ లేని ఒక ప్రత్యేక దినుసు కలిగి ఉంది

**క్లియర్-టోన్** క్రీం మీ చర్మానికి మరింత పసిమిచాయను తెచ్చేందుకు. మచ్చల్నీ కళంకాల్ని తొలగించేందుకు ప్రకృతి సిద్ధంగా పనిచేస్తుంది అందులోని శాస్త్రీయ సూత్రీకరణ హాని కలిగించే అల్ట్రావయొలెట్ కిరణాల నుండి మీకు రక్షణ కలిగించి, మీ చర్మం నల్లబడటాన్ని అరికట్టుతుంది అంతేకాదు, **క్లియర్-టోన్** మీ చర్మాని కవసరమైన చెమ్మను అతి సున్నితమైన పద్ధతిలో ఇస్తుంది ఆతేడామీకై మీరే చూడండి. **క్లియర్-టోన్** క్రమం తప్పకుండా వాడండి, మరి కొ వారాల్లో దాని ఫలితాల్ని చూసి వళ్లు పులకరించి పొందండి.



ప్రపంచమంతటా ప్రఖ్యాతిచెందింది




మేలైన సూత్రం
మేలైన చర్య

## పసిమిచాయ రహస్యం-ప్రకృతి సిద్ధంగా క్లియర్-టోన్

లండన్. పారిస్. న్యూయార్క్.

daCunha/NICL/3/81-TL

## ప్రముఖ కన్నడ దర్శకుడు పుట్టణ్ణకు మాతృ తార నోటీస్ !

సినిమాలలో చేరాలని తహతహలాడిన ఓ తరుణి — తనకు తొలి అవకాశమిచ్చిన సుప్రసిద్ధ దర్శకునికే నోటీస్ పంపించిందంటే — అది ఎంత విడ్డూరమైన విషయమో ! "నన్ను నటిని చేస్తానని వంచించారు" అంటూ కర్నాటక చలన చిత్ర వాణిజ్య మండలికి హసీనాహంసిని అనే కొత్త నటి తరఫున ఆమె తల్లి ఫిర్యాదు చేస్తే, వాణిజ్యమండలివారు డైరెక్టర్ పుట్టణ్ణను సంజాయిషీ అడిగారట

"మానస సరోవర" అనే చిత్రాన్ని డైరెక్టర్ పుట్టణ్ణ స్వయంగా నిర్మిస్తున్నారు ఆ చిత్రంలో ముగ్గురు నాయికలను పరిచయం చేయ సంకల్పించి, పద్మ, వాసంతి, ముస్లిమ్ వనిత హసీనా హంసినిని ఎన్నిక చేశారు అంతకుముందు హసీనా తల్లి ఎంతో కాలంగా పుట్టణ్ణను పదే పదే కలుసుకుని, ఎలాగైనా తన కూతుర్ని వెండితెరమీద కనిపించేలా చేయమని ఎంతగానో కోరుకుందట మే 9 నుంచి 42 రోజుల పాటు మైసూరు సమీపంగా సందూరు గ్రామ పరిసరాలలో తొలి షెడ్యూల్ ప్లాన్ చేయబడింది ఐతే, ప్రతిరోజూ కుంభవృష్టిగా వర్షం కురవడం వల్ల షూటింగ్ సక్రమంగా సాగలేదు ఓ రోజు వర్షం కాస్త తెరిపి ఇచ్చేసరికి షూటింగ్ నిర్ణయమైంది బస చేసిన ఇంటినుంచి లొకేషన్‌కు దాదాపు మూడున్నర మైలు దూరముంది హసీనా మేకప్ చేసుకుని బయలుదేరడానికి సిద్ధమైంది అప్పుడు కారులో ఆమె కొక్కతెకే సీటు ఉంది తల్లి కూర్చోడానికి చోటు లేదు అంచేత, "షూటింగ్‌కు ఇప్పటికే బాగా ఆలస్యమైపోయింది మీరిక్కడే ఉండండి ఈ ఆర్టిస్టులనందర్నీ షూటింగ్ స్పాట్‌లో వదిలేసి వచ్చాక మిమ్మల్ని తీసుకెళ్తాం," అని ప్రొడక్షన్ మేనేజర్ చెప్పేసరికి హసీనా తల్లి ఆకాశమంతెత్తుకు లేచిందట "మీ కారూ వద్దూ, మీ పిక్చరూ వద్దూ," అంటూ తన కూతురి మేకప్‌ను తుడిచేసి, చెప్పాచేయకుండా ఏకాయెకీన బెంగళూరికి కూతురుని తీసుకొని వెళ్లిపోయిందట హసీనా ఇప్పుడెంతో బాధ పడుతూందట కాని, ఏం ప్రయోజనం ? తల్లి చేసిన రాద్ధాంతం ఫలితంగా ఓ అపూర్వమైన అవకాశాన్ని కోల్పోయింది ఇప్పుడామె స్థానంలో రేఖారావ్ అనే మరో నటి బుక్ అయింది

## విఘ్నేశ్వరా ఆర్ట్స్ ద్వితీయచిత్రం

"సెప్టెంబర్ మొదటివారంనుంచి షూటింగ్" అన్నారు డైరెక్టర్ భాస్కర్ "గృహప్రవేశం" అనంతరం ఈ సంస్థ నిర్మించే చిత్రంలో మురళీ మోహన్, జయసుధ, సురేష్, తులసి, ఒక విశిష్టమైన పాత్రలో ప్రభాకరరెడ్డి పాల్గొంటారు మద్దిపట్లసూరి రచయిత సత్యం సంగీత దర్శకుడు



'వసంత కోకిల'లో కమలహాసన్, స్మిత

## సినిమా

'తరంగిణి'లో సుమన్, శ్యామల

## ఘర్షణ

"పెద్ద మనుషుల్లా చెలామణీ అవుతూ కొత్త పంథాలో ప్రజాస్వామ్యాన్ని దోచుకుతినే సంఘ విద్రోహులను ప్రజలే మూకుమ్మడిగా దండెత్తి, చట్టానికి అప్పగించి, పౌరులకు రక్షణ కలిగించే ఇతివృత్తం," అని కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే గుడ్లూరి గోపీకృష్ణ తెలియజేశారు కీ శే ముక్కామల ప్రసాదరావు రాసిన కథ ఆధారంగా ముత్యాల వెంకటరాయుడు నిర్మించే జన సాహితీ ఆర్ట్ క్రియేషన్స్ "ఘర్షణ" చిత్రంలో పాత నటీనటులతో పాటు రంగస్థల కళాకారులు రాయుడు, నాగేశ్వరరావు, పి వి రామారావు, చంద్రమౌళి, రాములు, భాస్కర్, ఆర్ నారాయణ రావు, మాస్టర్ గిరీష్, లతాప్రియ, శ్రీశాంతి, లవ్‌బాబు పాల్గొంటున్నారు ఎం వి రమేష్‌బాబు ఛాయ బి గోపాలం సంగీతం, లీలాకృష్ణ శిల్పం, మోహన్ కూర్పుతో వి శ్రీనివాస్ ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ నిర్వహణ బాధ్యతలను ఎన్ బ్రహ్మయ్య ముక్కామల రాజేశ్వరరావు వహిస్తున్నారు

## ఆమోదం చేయబడిన చిత్రాలపేర్లు

పద్మాలయా పిక్చర్స్ "ఉత్తర దక్షిణాలు" కామాక్షితాయ్ పిక్చర్స్ "టైగర్ నాగు", జనశ్రేణి ఆర్ట్స్ "పడమర పొద్దు పొడిచింది", రాశి మూవీస్ "సముద్రపు దొంగలు," మక్కళ్ తిలకమ్ మూవీస్ "కబడ్దార్ కన్నయ్య", రాంగోపాల్ ఎంటర్‌ప్రైజెస్ "గరుడరేఖ", శ్రీ విఘ్నేశ్వరా సినీ ఆర్ట్ క్రియేషన్స్ "పగబట్టిన బెబ్బులి", గీతా సినీ ఎంటర్‌ప్రైజెస్ "యమకింకరుడు", శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ "చట్టంఎవరికోసం," శ్రీ లక్ష్మిప్రసన్న పిక్చర్స్ "ధర్మపోరాటం," అజయ్‌ఆర్ట్ క్రియేషన్స్ "మానవ సేవే మనకు స్థిరాస్తి"



# తమిళ చిత్ర విశేషాలు

★ దేవర్ ఫిలిమ్స్‌వారు ఇటుపైన జంతువులతో చిత్రాలు తీయరట వారు పెంచే రెండు గున్న ఏనుగులను రెండు దేవాలయాలకు దానం చేసేశారు ఎంచేతో ఏమో – ఇంతవరకు దేవర్ ఫిలిమ్స్‌వారి చిత్రాలలో శివాజీగణేశన్ నటించలేదు, వారి చిత్రాలకు ఎం ఎస్ విశ్వనాథం సంగీత మివ్వలేదు

★ ఇప్పుడు కొన్నిచిత్రాల్లో నటిస్తూన్న శివాజీ పుత్రుడు ప్రభు "నేను ఎం జి ఆర్ అభిమానిని," అని ఎక్కడ ఎప్పుడు చెప్పాడోగాని, మధురలోని శివాజీ అభిమాన సంఘంవారు అతనికి పోస్ట్ ద్వారా ఓ పాకెట్‌లో కాస్త బూడిదను పంపుతూ, "మళ్ళీ ఆ విధంగా ఎక్కడైనా అన్నావో – నీకు ఈ గతి పడుతుంది," అని రాశారట ఆ సంఘ సభ్యులు కొందరు ప్రభును స్వయంగా కలుసుకున్నారట కూడా అప్పుడు ప్రభు "ఎం జి ఆర్ చిత్రాలను ఫైట్స్‌కోసం ఎక్కువగా చూస్తూంటానని నేనెక్కడైనా చెప్పానో ఏమోగాని, ఆయన అభిమానినని ఎక్కడా చాటుకోలేదు ఇదేదో పనిలేని పుల్లయ్యలు పుట్టించిన పుకారు," అంటూ ఖండించాడట

★ ఇటీవల రజనీకాంత్ శివాజీ నటించిన "దైవప్పిరవి" తమిళ చిత్రాన్ని ఎ వి ఎం స్టూడియోలోని ఓ థియేటర్‌లో ప్రత్యేకంగా ప్రొజెక్షన్ ఏర్పాటు చేసుకొని చూశాడట అదేకాదు, శివాజీ నటించిన పాత చిత్రాలు ఏ థియేటర్‌లో ప్రదర్శింపబడుతున్నా వెళ్లి చూస్తున్నాడట "ఎంగయో కేట్ట కురల్" [ఎక్కడో విన్న కంఠం] చిత్రంలో రజని సరసన నటించే అంబిక, రాధిక ఆ చిత్రం చివరన ముసలి వేషాలలోనూ కనిపిస్తారట

★ "కాట్టురాణి" తమిళ చిత్రంలో నటించిన నెల్లైకణ్ణన్ అనే నటుడు చక్కని డాన్సర్ కూడా ఇతను ఏడురోజులపాటు నిర్విరామంగా నృత్యం చేసి దాఖలా సృష్టించబోతున్నాడు ఈ వారంరోజులూ ఇతను పళ్ళరసం తప్ప మరేమీ పుచ్చుకోడట

★ కన్నాంబ నటించిన "కన్నగి" తమిళ చిత్రం ఒక్క మధురలో తప్ప తమిళనాడులోని అన్ని కేంద్రాలలోనూ ప్రదర్శింపబడుతుంది అందుకు పంపిణీదారులిచ్చిన సమాధానం "ఈ చిత్రం మధురలో రెండు మూడుసార్లు ప్రదర్శింపబడినప్పుడల్లా ఆ పట్టణంలో ఎక్కడో ఓ చోట ఏదో విధంగా అగ్నిప్రమాదాలు సంభవించడం అందర్నీ భయకంపితుల్ని చేసింది మధురమీద కన్నకి శాపం ఈ కాలంలోనూ ఫలిస్తూందా – అని పలువురి సంశయం"

★ నిర్మాణంలో ఉన్న కొన్ని తమిళ చిత్రాల పేర్లు "అరవముదు సౌండ్ సర్వీస్ సొట్టై ఇల్లాద బొంగరం (తాడులేని బొంగరం) డిస్కో నైట్ ఫీవర్ పాకెట్ డైరీ"

★ "కణ్మణి పూంగా" తమిళ చిత్రంలో సరిత ద్విపాత్రలు ధరిస్తోంది

★ ఈ ఏడు దీపావళికి కె బాలచందర్ చిత్రాలు మూడు విడుదల కానున్నాయి 1 హిందీ 'ఆకలిరాజ్యం' 2 తెలుగు 'కోకిలమ్మ 3 తమిళం 'అగ్నిసాక్షి'

★ జయలలితను "మీకు మంత్రి పదవి ఇవ్వబోతున్నారట కదా ?" అని ఓ విలేఖరి అడిగితే, "మంత్రి పదవి అంటే పిల్లలకు చాక్‌లెట్ ఇచ్చినట్లనుకుంటున్నారా ?" అని తిరుగుప్రశ్న వేసిందట!

కళాసాగర్ (మదరాసు)వారు ఏర్పాటు చేసిన శ్రీ పి పుల్లయ్య పుష్పాభిషేకం కార్యక్రమంలో 'మ్యూజికల్ క్విజ్' నిర్వహిస్తున్న శ్రీ పి. బి. శ్రీనివాస్.




## సినిమా

### మోహన్‌బాబు సవాల్

"సముద్రం వాతావరణంగా ఆక్షన్ థ్రిల్లర్ అండర్ వాటర్ ఫైట్స్ స్పెషల్ అట్రాక్షన్ టగ్‌బోట్ డ్రయివర్‌గా మోహన్‌బాబు నటిస్తున్నారు. 'రౌడీరాణి' లాంటి పాత్రలో విజయలలిత కని పిస్తుంది,' అన్నారు నవభారత్ బాబూరావు ఈయన నిర్మించే జి వి కె కంబైన్స్ "సవాల్" చిత్రానికి ఆగస్ట్ 9న తొలిగీతం ధ్వనిముద్రితమైంది సుమలత, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య,



'ఆంధ్రకేసరి'లో మమత

గిరిబాబు, మాడా, రాజ్యలక్ష్మి, శ్యామల, కృష్ణవేణి, ఇతర పాత్రధారులు ఎం డి సుందరం రాసిన కథ, స్క్రీన్‌ప్లేకి పరుచూరి సోదరులు సంభాషణ కర్తలు సత్యం స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు పుష్పాల గోపీకృష్ణ ఛాయాగ్రాహకుడు "విశాఖపట్నం పరిసరాలలో ఆగస్ట్ 16 నుంచి సెప్టెంబర్ 15 వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తయిపోతుంది," అన్నారు డైరెక్టర్ బోయిన సుబ్బారావు

SAIKRISHNA ADS.

దేవికమల్ మూవీస్






కె.సి. శేఖర్‌బాబు

పి. చంద్రశేఖరరెడ్డి B.A.

చక్రవర్తి • ఎస్. గోపాలరెడ్డి • సత్యానంద్ • నాయని మహేశ్వరరావు

సీడెడ్: నవభారత్



'ప్రళయరుద్రుడు'లో ఒక సన్నివేశం

## సినిమా

### ఈనాడు పతాక సన్నివేశాలు!

"విజయవాడ నగరవాసుల సహకారం లేనిదే మా చిత్రంలోని పతాక సన్నివేశాలను ఆశించినంతకన్నా గొప్పగా చిత్రించి ఉండేవాళ్ళం కాము," అన్నారు పద్మాలయ పిక్చర్స్ "ఈనాడు" చిత్ర నిర్మాత జి హనుమంతరావు "వరుణ దేవుడు కూడా ఎంతగానో సహకరించాడు టేక్‌చేయబోయేసరికి చినుకులు ఎవరో మీట నొక్కినట్లు ఆగిపోయేవి, షాట్ అయిపోయాక వెంటనే మళ్ళీప్రారంభమయ్యేవి ఆగస్ట్ 11నుంచి18 వరకు గాంధీనగర్ సెంటర్, గాంధీహిల్, గవర్నర్ పేట సెంటర్‌లలో రెండు కెమేరాలతో షూట్‌చేశాం ఆగస్ట్ 18 నుంచి 22 వరకు మద్రాసులో చివరి షెడ్యూల్‌ను ముగించాం," అంటూ డైరెక్టర్ పి సాంబశివరావు విజయవాడలో చిత్రీకరించిన పతాక సన్నివేశాల గురించి ఇంకా ఇలా వివరించరు "హీరో కృష్ణ బావ కోటేశ్వరరావు (రావుగోపాలరావు) ప్రజలచేత ఎన్నికైన ఓ ఎమ్మెల్యే తర్వాత పార్టీ ఫిరాయించి, ముఖ్యమంత్రిగా అధికారంచేజిక్కించుకుని ప్రమాణ స్వీకారమప్పుడు ఊరేగింపుగా జీప్‌లో ఓ పక్కన సారా కంట్రాక్టరు (జగ్గయ్య), మరోవైపు మంత్రి (కాంతారావు) తో పురవీధుల్లో తరలి వెళ్తున్నప్పుడు — అన్యాయాన్నీ అక్రమాన్ని, స్వార్థ పరుల ఆటలను అరికట్టి, దానవతకు సమాధి కట్టి ప్రజల ప్రతినిధిగా హీరో ప్రతిఘటిస్తాడు పార్టీలు మార్చి అధికారం చేజిక్కించుకోవడం తగని పని అంటూ ఎదిరిస్తాడు చివరికి తను అనుకున్నది సాధించాక తుపాకి గుండ్లకు బలి అవుతాడు"

సంచలనం సృష్టించిన "ఈనాడు" మళయాళ చిత్రం ఆధారంగా తయారవుతోన్న ఈ చిత్రం ప్రత్యేకంగా ఏ ఒక్క రాజకీయ పార్టీనిగాని, రాష్ట్రాన్ని గాని ఉద్దేశించిందికాదు పార్టీ ఫిరాయింపులు దేశాభ్యుదయానికి గొడ్డలిపెట్టులాంటిదని నిరూపించడమే ప్రధానాంశం హీరో కృష్ణ 200వ చిత్రంగా విడుదలయ్యే ఈ చిత్రంలో మరో విశేషం జగ్గయ్యపేట ఎం ఎల్ ఎ, బి రామారావు నటించడం

జి ఆదిశేషగిరిరావు నిర్మాణతలో తుది మెరుగులు దిద్దుకుంటూన్న ఈ చిత్రంలో ఇంకా సత్యనారాయణ, చంద్రమోహన్, గుమ్మడి, సుధాకర్, అల్లురామలింగయ్య, గిరిబాబు, పేకేటి, త్యాగరాజు, సాక్షిరంగారావు, సి హెచ్ కృష్ణమూర్తి, పి ఎల్, నారాయణ, బాలకృష్ణ, రాజా, రమేష్, రాధిక, జమున, శ్యామలాగౌరి, కృష్ణకుమారి, ఝాన్సి, పుష్పకుమారి, అత్తిలి లక్ష్మి పాల్గొన్నారు పరుచూరి బ్రదర్స్ సంభాషణలు రాశారు శ్రీ శ్రీ, గోపి, కొసరాజు గీతాలకు జె వి రాఘవులు స్వరకల్పన చేశారు పుష్పాల గోపీకృష్ణ ఛాయ, కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం, కోటగిరి గోపాలరావు కూర్పు, త్రిపురనేని వరప్రసాద్ సహకార దర్శకత్వం, శ్రీనివాస్ నృత్యాలతో సత్తిరాజు నిర్వహణ బాధ్యతలు వహించారు

"మొదటిసారి వెళ్ళినప్పుడు హీరోయిన్ ఎన్ని చీరలు కట్టుకుందో లెక్కపెట్టాను! ఈసారి వెళ్ళి జాకెట్లు లెక్కపెట్టాలి, సినిమాకి డబ్బులివ్వండి!"




### శ్రీవారి శుభలేఖ

జనప్రియ ఆర్ట్ క్రియేషన్స్ పతాకంలో పై చిత్రాన్ని కె జయప్రసాద్‌రెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో షేక్ సర్దార్, దాసరి పార్థసారధిరావు నిర్మిస్తారు చక్రవర్తి సంగీత దర్శకుడు అక్టోబర్ 27న పాటల రికార్డింగ్, నవంబర్ 12న షూటింగ్ ప్రారంభోత్సవాలు జరుగుతాయి

చిత్రకల్పన ఫిలింస్

# కృష్ణావతారం

బాపు



రచన - నిర్మాణం

**ముళ్ళపూడి వెంకటరమణ**

సంగీతం: కె.వి.మహదేవన్

ఫొటోగ్రఫీ: బాబా ఆజ్మీ

ఆంధ్ర: అన్నపూర్ణ నైజాం: నారంగ్ ఎంటర్‌ప్రైజెస్ సీడెడ్: భాస్కర పిక్చర్స్



'పట్నం వచ్చిన పతివ్రతలు' లో మోహన్ బాబు, గీత

## హిందీ చిత్ర విశేషాలు

★ అమితాబ్‌బచ్చన్ నటిస్తూ తీవ్రంగా గాయపడ్డ "కూలీ" చిత్ర దర్శక నిర్మాత మన్‌మోహన్‌దేశాయ్ ఇదివరకు ఎవ్వరూ చేయని ఓ పని చేశాడు తన చిత్రం కోసం బెంగళూరు సమీపంగా ఓ రైల్వే స్టేషన్‌ను 45 రోజులపాటు అద్దెకు తీసుకోవడమేకాక చిత్రీకరణకు అనువుగా ఆ స్టేషన్‌కు కొన్ని అలంకరణలు చేశాడట

★ రాజ్‌కపూర్, సంగీత దర్శకుడు నౌషద్ అలీ, నటుడు జలాల్ అగా స్పెషల్ ఎగ్జిక్యూటివ్ మేజిస్ట్రేట్‌లుగా నియమింపబడ్డారు

★ "సత్యం శివం సుందరం"లో నటించిన పద్మినీ కొల్హాపురి, లతామంగేష్కర్‌కు దగ్గరి చుట్టం తాను కూడా నేపథ్య గాయని కావాలని తొలుత కలలు కన్నది దేవ్‌ఆనంద్ చిత్రం "ఇష్క్ ఇష్క్ ఇష్క్"లో కొన్నిపాటలు, "యాదోంకి బారాత్"లో లతతో కలిసి ఓ పాట పాడింది కూడా కాని, "సత్యం శివం సుందరం" తర్వాత నటిగానే స్థిరపడిపోయింది

★ మహేంద్రకపూర్ ఇంతవరకు 12,500 పైగా పాటలు పాడాడు హిందీ, మరాఠీ, గుజరాతీ, పంజాబీ, సింధీ, తమిళం, మలయాళ చిత్రాలతోపాటు ఆంగ్లంలో కూడా కొన్నిపాటలు పాడాడు

★ పర్వతనేని మల్లికార్జునరావు నిర్మించే హిందీ చిత్రం "యేతో కమాల్ హోగయా"లో ద్విపాత్రధారి కమలహాసన్ సరసన రతి అగ్నిహోత్రి, మరో 17 ఏళ్ళ ఆంగ్ల వనిత హీరోయిన్‌లు

★ ధర్మేంద్ర కొడుకు సన్నీ నటించిన తొలి చిత్రం "బేతాబ్" రీరికార్డింగ్ పూర్తయింది కాని, ఢిల్లీలో ఏషియాడ్ గేమ్స్ పూర్తయ్యేవరకు ఆ చిత్రాన్ని విడుదల చేయడట ధర్మేంద్ర "ప్రేక్షకులంతా గేమ్స్‌వైపు ఆకర్షింపబడితే, మా వాడి తొలి చిత్రం గతేమవుతుందో!" అని ధర్మేంద్ర తన భీతిని వెలిబుచ్చాడట ఈ తండ్రీ కొడుకులిద్దరూ అర్జున్ హింగోరానీ నిర్మించే చిత్రంలో నటించనున్నారు

★ రతి అగ్నిహోత్రి నాజూకుగా ఉండడం కోసం మితాహారమే భుజిస్తుంది పైగా, ఇటీవల విధి విరామం లేకుండా షూటింగ్‌లలో పాల్గొనడంవల్లనేమో — "మేరా ఫైస్లా" అనే చిత్రం సెట్‌లో డాన్స్ చేస్తూ హఠాత్తుగా సొమ్మసిల్లి పడిపోయింది ఆమెకు కొంత విశ్రాంతి అవసరమని వైద్యులు సూచించారట

★ రాజేష్ — డింపిల్ వ్యవహారం సినిమా కథల్లా 'మరో మలుపు' తిరిగింది ఇద్దరూ మళ్ళీ కలిశారు డింపిల్ జరిగిందానికి ఎంతో పశ్చాత్తాపపడిందట "అదంతా ఓ పీడకల," అనేశాడట రాజేష్‌ఖన్నా

★ "బొంబాయి సర్క్యూట్‌లో నా చిత్రం వసూళ్ళు కోటి రూపాయలకు అధిగమించింది కాని, ఏం ప్రయోజనం ? నా పెట్టుబడి సొమ్మే ఇంతవరకు రాలేదు ఇటుపైన ఎంతో పొదుపుగా చిత్ర నిర్మాణం సాగించాలి," అన్నాడట "షాన్" చిత్ర నిర్మాత రమేష్ సిప్పీ

★ బొంబాయి చాందివిలి ప్రాంతంలోని సొంత స్థలంలో మనోజ్‌కుమార్ ఒక చిన్న స్టూడియోను నిర్మించాలనుకుంటున్నాడట

# సినిమా

### కె ఎస్. ఆర్ దాస్ దర్శకత్వంలో రగిలిన పగ

"బుర్రాగుహల్లో ఎక్కువభాగం చిత్రీకరించాం భీమ్‌లీ ప్రాంతంలోని ఎర్రకొండల్లో, విశాఖ దగ్గర సముద్రంలో చాలా దూరం ట్రాలర్‌లో వెళ్ళి గగుర్పాటు కలిగించే ఎన్నో సంఘటనలను తీశాం," అన్నారు డైరెక్టర్ కె ఎస్ ఆర్ దాస్ విజయ లలిత నిర్మించే రాజా ఆర్ట్ క్రియేషన్స్ "రగిలిన పగ" చిత్రంలో ఆమెతోపాటు మురళీమోహన్, విజయశాంతి, రామకృష్ణ, ప్రభాకరరెడ్డి, కాంతారావు, త్యాగరాజు, మమత, మిక్కిలినేని, జగ్గారావు, పండరీ



... హిందీ చిత్రంలో రేఖ

బాయి పాత్రధారులు సత్యానంద్, చక్రవర్తి, ఆరుద్ర, రాజశ్రీ, గోపీ, పుష్పాల గోపీకృష్ణ, కొండపనేని రామలింగేశ్వరరావు, మోహన్, పూనాటి సుబ్బారావు, కుర్రా రంగారావు ప్రభృత సాంకేతిక వర్గంతో వి ఆర్ రామమోహనరావు, వి త్రినాథ్ నిర్మాతలు "ఒకే ఒక పాట బేలెన్స్ ఉంది దాన్ని సెప్టెంబర్ మొదటి వారంలో పిక్చరైజ్ చేస్తాం దాంతో విడుదలకు సిద్ధమవుతుంది," అన్నారు నిర్మాణ నేతృత్వం వహించే డి రాజా. ★

ఎంత బహుళ ప్రయోజనమైనదంటే, ఇది లేకుండా ఇన్నాళ్ళు ఎలా వంట చేయగలిగామని మీకే ఆశ్చర్యం కలుగుతుంది.

# ప్రెస్టీజ్ వారి ప్రెషర్ పాన్



| వేపుడు | హెచ్చు వేపుడు | సాద్ | ప్రెషర్ కుక్ |
|---|---|---|---|
|  |  |  |  |

మీరు ఇందులో వేపుడు హెచ్చు వేపుడు వేసుకోవచ్చు అవసరమైన అన్నిరకాల మేరకు వేపుడు వేసుకోవచ్చు మూత ఉంచి వండాలి అంతే ప్రెస్టీజ్ ప్రెషర్ పాన్ వెంటనే మీకు సిద్ధం చేస్తుంది బహుళ ప్రయోజనమైనది మరియు ఎంతో ముచ్చటైనది మీ కుటుంబానికి నోరూరించే రుచికరమైన వంటకాలు క్షణాలలో సిద్ధం చేయడంలో మీకు తోడ్పడేందుకు అనువుగా రూపొందించబడింది

మూత వేయకుండే దళసరి గేజ్ కలిగిన ఈ పాన్‌పై కొద్ది నూనెతో ఉల్లిపాయలు కూరగాయలు మసాలాలు మాంసాన్ని కోడి మాంసాన్ని వేపుడు చేసుకోవచ్చు ప్రెస్టీజ్ మూతతో దీనిని మూస్తే మీ వంటకాన్ని వెంటనే సిద్ధం చేస్తుంది కోడి బుర్రా? 20 నిమిషాలు మటన్ దోపియాజీ? 25 నిమిషాలు దమ్ ఆలూ? ఇంకా తక్కువ వ్యవధిలో మంచి పనులకోసం మీ సమయాన్ని ఆదా చేసుకోండి మరియు మీ ఇంధనం చిరకాలం నిలువడానికి తోడ్పడుతుంది

ఒక్క వంటకానికి రకరకాల పాకాలు ఉపయోగించి చివరకు కుక్కర్‌లో వండే శ్రమ ఇక మీకు ఉండదు బహు పాత్రల పనికి అనుకూలమైన ఏకైక పాత్రను ప్రెస్టీజ్ ప్రెషర్ పాన్ మీకు అందిస్తున్నది

ప్రెస్టీజ్ వారే ఈ ప్రెషర్ పాన్‌ను ఉత్పత్తి చేస్తున్నారు మిక్కిలి ప్రజాదరణ కలిగిన ప్రెషర్ కుక్కర్‌ను భారతదేశంలో మొట్టమొదటగా ప్రవేశపెట్టి అద్వితీయమైన గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ద్వారా ప్రెషర్ వంటను నిరపాయకరంగా తీర్చిదిద్దినది ప్రెస్టీజ్ వారే ప్రెస్టీజ్ ప్రెషర్ పాన్ మీ వంటగదిలో మీకు ఇతోధికంగా ఉపయోగపడుతుంది

**దీని ధరలో సగానికంటె తక్కువకే మీరు దీనిని పొందాలంటే ఇదిగో....**

మీకు ఇప్పటికే ప్రెస్టీజ్ ప్రెషర్ కుక్కర్ ఉంటే మిమ్మల్ని మీరు అభినందించుకోండి భారీ గేజ్ కలిగిన పాన్ ధరకే ప్రెస్టీజ్ ప్రెషర్ పాన్ మీదవుతుంది ఒక్క పెనం కొంటే చాలు మీ ప్రెస్టీజ్ కుక్కర్ మూత దీనికి సరిగ్గా సరిపోతుంది అంతే సరసమైన ధరకు ప్రెస్టీజ్ ప్రెషర్ పాన్ మీకు లభించినట్లే ఎందుకంటే మీ కష్టార్జితమైన సొమ్ముకు విలువైన నాణ్యమైన ఉత్పత్తులను మీకు సమకూర్చడానికి ప్రెస్టీజ్ కంపెనీ కృషి చేస్తున్నది

**ప్రెస్టీజ్ ప్రెషర్ కుక్కర్ ఇంకా మీవద్ద లేకుంటే**

ఒకేసారి బహుళ ప్రయోజనాలు పొందడానికి నిజంగా ఇది మీకు మహదవకాశము వంటగదిలో మీకు వేరేగా ఉపయోగపడగల రెండు పాత్రలు ఇప్పుడు మేము మీకు అందిస్తున్నాము—అద్వితీయమైన గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ కలిగి భారతదేశంలోకెల్లా నిరపాయకరమైన ప్రెషర్ కుక్కర్ మరియు అద్భుతమైన ప్రెషర్ పాన్—ఒకే ధరకు కొంచెం ఎక్కువతో రెండు పాత్రలు లభిస్తాయి

ఒకే మూత రెండింటికి సరిపోతుంది మరియు మీకు రూ 150/-లు ఆదా




తయారీ.

maa(S) PP 1 Tel b 82

సీరియల్

# ధర్మక్షేత్రే క్షేత్రం

ఆకెళ్ళ వెంకట సూర్యనారాయణ

2

(గత సంచిక తరువాయి)

దత్తుడి కొబ్బరితోటలో గోనెగుడ్డలు పరిచేరు ఎండ ఎక్కువగా లేదు సూర్యాస్తమయానికి ఇంకో గంట వ్యవధి ఉంది అక్కడ చతుర్ముఖ పారాయణ జరుగుతోంది

''ఏమయ్యా శ్రీరాముడూ! ముద్ద ముద్దకు బిస్మిల్లా అంటే ఎలాగయ్యా! ముక్క వెయ్య,'' అన్నాడు దత్తుడు

శ్రీరామశాస్త్రి ఆటిన్‌రాణి ఆలోచించి ఆలోచించి వేశాడు

''అమ్మయ్యా! ఊడిపడిందయ్యా! అదివేస్తే ఎప్పుడో 'షో' అయ్యేది మూడు జోకర్ల ఎ సి, డి స ఇదీ చెట్టెక్కిందనుకున్నాను'' అన్నాడు దత్తుడు ఆటిన్ రాణీతో ఆటచూపిస్తూ

శ్రీరావ్ పేకముక్కలు క్రింద పడేసి జేబులోంచి రుమాలు తీసి కళ్ళజోడు తుడుచుకుంటూ ఉండి పోయేడు

''పంతుల్ది కౌంట్ కాబోలు ఏం పంతులూ ఫుల్ పెట్టేశావా?'' అడిగాడొకడు

శ్రీరావ్ తలూపేడు

''రానివ్వండి కొట్టక కొట్టక ఆట కొట్టేను'' చేయిజాపేడు దత్తుడు

ఆరుగురు ఆడుతున్నారు నలుగురు పాయింట్స్ చెప్పి డబ్బులిచ్చేరు దత్తుడు, శ్రీరావ్‌కేసి చూశాడు

శ్రీరావ్ ముఖం తుడుచుకుంటూఉండిపోయేడు

''శ్రీరాముడూ! చెంబు వైద్యనాథ భాగవతార్ గాత్రమా?'' అడిగేడు దత్తుడు

''డబ్బు అయిపోయింది'' సన్నగా గొణిగేడు శ్రీరావ్

''బావుందయ్యా! కొట్టక కొట్టక ఆట కొడితే అరువా? ఈ డబ్బుల్తో నేనేం మేడలు కట్టక్కర్లేదనుకో అయినా పేకాటలో అరువంటే నాకు చెడ్డచిరాకు'' ముఖం చిట్లించేడు దత్తుడు

''పోనీ ఓ ఫిఫ్టీ రూపీస్ అప్పివ్వు మళ్ళా తీర్చేస్తా'' సిగ్గుపడుతూనే అడిగేడు శ్రీరావ్

''ఇది మరీ బాగుంది పేకాట సిటింగ్‌లో అప్పు ఇవ్వటమా సారీ సిటింగ్‌లో ఉండగా అప్పివ్వను అది నా సెంటిమెంట్ కావాలంటే సాయంత్రం ఇంటికొచ్చి పాతికో ముప్పయ్యో పట్టుకుపో లేదనను'' ఖండితంగా చెప్పేడు దత్తుడు

శ్రీరావ్‌కి తలకొట్టేసినట్లయింది దత్తుడు మామూలుగా ఎంత ఖర్చు మనిషైనా పెకాట దగ్గర అరువు, అప్పు ఒప్పుకోడు తనసలు ముందు రౌండే లేచిపోదామనుకున్నాడు కాని మరో రౌండ్ ఆడమని వాళ్ళే బలవంతం చేశారు అయితే తన దగ్గర డబ్బులయిపోయేయని తను చెప్పలేదు ఉన్న పన్నెండు రూపాయల్లో నిలదొక్కుకోలేకపోతానా అనుకున్నాడు వరుసగా రెండు కౌంట్‌లు తినటంతో తేలిపోయేడు

''ఏం శాస్త్రీ డబ్బులున్నాయా? లేవా?'' ముక్కలు పంచాల్సిన వాడడిగేడు

శ్రీరావ్ తల అడ్డంగా ఆడించి లేచాడు

''మన అయిదుగురికి వేయి'' లాభంలో ఉన్నతను అన్నాడు

''లేవంటే ముందే చెప్పాలి అంతేకాని డబ్బు లేకుండా నొల్లుకుపోదామని కూర్చోకూడదు'' చీదరింపుగా అన్నాడు దత్తుడు

శ్రీరావ్‌కి తలకొట్టేసినట్లయిందా మాటతో సంతకం కూడా రాని దత్తుడు ఏ ఆధిక్యతతో తన్ని అంతమాట అన్నట్లు? తను ఆడను మొర్రో అంటే తన్ని మొదలు పేకాటలో దింపింది తనే మూడేళ్ళయింది తను పేకాటలో దిగి తనతోటి వాళ్ళంతా ఉద్యోగాల్లో ఉన్నారు కాటమరాజు, ఏడు కొండలు అప్పుడే సర్వీసులో చేరి మూడేళ్ళయింది

ఏడుకొండలుకు అప్పుడే ప్రమోషన్ వచ్చింది అతని కులంలో ఇవ్వాల్సిన ప్రమోషన్ కోటా పదేళ్ళుగా ఉండిపోయిందిట అందువల్ల జాయిన్ అయిన ఏడాదికే పదేళ్ళ సర్వీసున్న సీనియర్స్‌ని త్రోసి రాజని ఏడుకొండలికి ప్రమోషన్ ఇచ్చేసి రూల్సుని రక్షించి నిట్టూర్చింది ప్రభుత్వం

కాటమరాజు లంచాలు తెగ మేస్తున్నాడని ఎవరో మిత్రుడు చెప్పేడు మనిషి డబ్బు ఒళ్ళు చేశాడు

''ఏం పంతులూ కాళీగానే ఉన్నావా?'' మొన్న పండగకు వచ్చినపుడు పలుకరించేడు

పంతులూ! అని పిలవలేదు ఇంతకు ముందు ఎప్పుడు

''పోనీ పెద్ద ఉద్యోగం దొరక్కపోతే నాతో రావయ్యా! ఎవడైనా కంట్రాక్టర్‌తో చెప్పి డెయిలీ వేజెస్‌కి వేయిస్తాను నెమ్మదిగా సూపర్‌వైజర్ కావచ్చు'' ఎంతో అహంకారం ఉట్టిపడుతుండగా అన్నాడామాట

''అతనికేం ఖర్మ! దొరికితే పెద్ద ఉద్యోగాలు చేస్తాడు లేదా అన్న వెనుకనే చెంబు పట్టేస్తాడు కులవృత్తికి సాటిరాదు గువ్వల చెన్నా!'' అన్నాడొకడు నవ్వి

''నీ ఇష్టం వస్తానోయ్'' కారెక్కి దుమ్ము కళ్ళలోపోసి వెళ్ళిపోయేడు కాటమరాజు

దుమ్ము కళ్ళలోకాదు నోట్లోనే కొడుతున్నాయి ప్రభుత్వ విధానాలు అర్హత ఉన్నవాణ్ణి అనర్హుడ్ని సీట్లు ఎక్కించి ప్రమోషన్లు ఇస్తున్నారు ఇక ప్రభుత్వ యంత్రాంగం కుంటి నడకకాక మరేమిటి? డబ్బు, కులం ఈ రెండు ప్రధాన భాగస్వాములు యంత్రాంగంలో నాయకులు వీటి కతీతులు కారు యంత్రాంగం కుంటి నడకకు కారణం వాళ్ళకు తెల్సు అయితే వాళ్ళకా పదవులు తెచ్చిన పల్లకి కులం డబ్బు అందుకోసం కళ్ళున్నా వాళ్ళు గాంధారులే

ఆట సాగుతోంది అయిదుగురూ ఆడు కుంటున్నారు శ్రీరావ్ తన ఆలోచనలతోపాటు తనూ అక్కడనించి కదిలేడు నెమ్మదిగా పొలాలు దాటి ఊరికేసి నడవసాగేడు

**జరిగిన కథ—7** యజ్ఞన్న దీక్షితులు సనాతనుడు ఆయన భార్య లలితాంబ వారి సంతానం పరమేశ్వరశాస్త్రి, శ్రీరాముడు, గౌతమ శాస్త్రి, మీనాక్షిలు పరమేశ్వరశాస్త్రి తండ్రివద్దనే వేదాధ్యయనం చేస్తుంటాడు శ్రీరాముడు అమలాపురంలో చదువుకొంటానంటాడు దీక్షితులు పెద్దకుమారుడు పరమేశ్వరశాస్త్రికి, ధూళిపాళ సోమయాజులు ప్రథమ పుత్రిక సుబ్బలక్ష్మికి బాల్య వివాహం జరిపిస్తారు గృహప్రవేశం అనంతరం పనిలో పనిగా గౌతమ శాస్త్రికి ఉపనయనం కూడా జరిపించేస్తారు దీక్షితులుగారు సోమిదేవమ్మ మరణంతో ఓ తరం మారిపోతుంది శ్రీరావ్ ఎస్ ఎస్ ఎల్ సి పాసవడంతో పాలిటెక్నిక్ చదువుతానంటాడు దీక్షితులుగార్కి ఇష్టం లేకపోయినా లలిత నచ్చ చెప్పడంతో అంగీకరిస్తారు తన చదువు అయ్యేవరకూ పెళ్లి చేసుకోనని తండ్రితో ఖచ్చితంగా చెప్పేస్తాడు శ్రీరావ్ తన కూతురి పెళ్లి కోసం అప్పు కోసం ఆనందరావ్ దగ్గరకు వెళ్లిన దీక్షితులు ఎన్నడూ ఊహించని విధంగా అవమానం పాలౌతాడు శ్రీరావ్ చదువు పూర్తయినా రికమెండేషన్, డబ్బూ లేకపోవడంతో పాటు కులం పెద్దదవడంవలన వుద్యోగం రాదు హరిజనుడయిన ఏడుకొండలుకు ఉద్యోగం వస్తుంది అదే ఉద్యోగం కోసం అప్లైచేసిన, అన్నింటిలో అతనికంటే ఆధిక్యతలో వున్న శ్రీరావ్‌కు మాత్రం కులం కారణంగా రాదు కృష్ణశాస్త్రి కూతురు వివాహ విషయమై దీక్షితులు తమ ఇంటిని భైరవమూర్తికి స్వాధీనపు తనఖా ఇచ్చి శర్మగారింట్లో అద్దెకుంటుంటారు గౌతమశాస్త్రి కృష్ణానందులవారి శిష్య బృందంలో చేరతాడు

తను నిరుద్యోగ పర్వంలో అడుగెట్టి నాలుగేళ్ళయింది పాలిటెక్నిక్ పూర్తవగానే తన కోసం ఇంద్ర పదవి ఎదురుచూస్తోందని తను ఆశించలేదుకాని కనీసం నాలుగువేళ్ళు నోట్లోకెళ్ళే ఉద్యోగం ఆశించేడు లేదు పోని మూడు వేళ్ళు నోట్లోకెళ్ళే మార్గానికి, రెండువేళ్ళు నోట్లోపోయే విధానాన్ని చూశాడు ప్రయోజనం దొరకలేదు ఇక ఒంటివేలు అంటే గంజిగిన్నె ఎత్తి తాగుతూ ఎర్రకారం చూపుడువేలుతో నాలికమీద రాసుకోటానికి సరిపోయే ఉద్యోగానికి అదీ ఏ కాటమరాజు సాయంతోనే ప్రవేశించాలి ఆ తట్టు పనికైనా తనవాడు తనకులం చాలా ముళ్ళ కంచెలున్నాయి ఆ ముళ్ళకంచెలు దాటడానికే సిద్ధపడటానికి అడ్డు వస్తోంది ఆత్మాభిమానం తను ఏ రకంగా తక్కువ వాడని అర్హతలేనివాడని తట్టనెత్తుకోవాలి ఎందుకు అనర్హులు అందలా లెక్కాలి కసి తనమీద తనకే కోపం తన కులం మీద తనకే కక్ష

ఇక ఉద్యోగంరాదు పేకాట ఆర్జన అయింది ముప్పయి రూపాయల్తో కూర్చుంటే పెట్టుబడికి షోకా ఉండటంలేదు మరీ మూలధనం తరిగితే అన్నను అడగటం

సరిగ్గా చెరువు దగ్గరకొచ్చేడు అతని మనసులో ఏదో జ్ఞాపకం కలుక్కుమంది

ఇక్కడే ఈ గట్టునే తను 'షటప్ అండ్ గెట్ అవుట్' అని అన్నను విదిలించి పారేసింది తల చేత్తో రాసుకుని ఖిన్నుడైన పరమేశ్వరుడు

ఎంత అహంకారం! తను చదువుకుంటున్నానని ఆ చదువు తనకు తిండి పెట్టగలదని ఎంత ధీమాగా అన్నాడు ఇప్పుడా అన్నగారే తనకింత ముద్ద వేస్తున్నది పేకాటకు డబ్బులిస్తున్నది

తనా అవతారాన్ని అసహ్యించుకోవచ్చు కాని ఆ డబ్బుని ఆ రోజు కూడా అసహ్యించుకోలేకపోయేడు

తనూ అన్నలా స్మార్తం నేర్చుకోవాల్సిందేమో అప్పుడింత చికాకు ఉండకపోనేమో!

ఎదురుగా వస్తున్న పడుచు అతని ఆలోచనల్ని పట్టి ఆపింది

ఆమెకు ఇరవై రెండేళ్ళుంటాయి వయస్సు వొంటిమీద వంపిన వంపుల్ని, వయ్యారాల్ని ప్రదర్శిస్తు మందగమనంతో వస్తోందామె

చామనఛాయ మనిషి కాలిపొడుగు పిల్ల తెల్లటి సిల్కు జాకెట్టు వేసింది లోపల 'బ్రా'తో సహితం స్ఫుటంగా చూపెడుతోందా జాకెట్టు యవ్వనం, మెడ విశాలంగా ఉన్న జాకెట్టులోంచి తొంగి చూస్తోంది పమిట ఎత్తుగుండెలమీద నామ మాత్రంగా వుంది

శ్రీరావ్ నరాల్లో రక్త ప్రసారం



## ధర్మో రక్షతి రక్షితః

ఎక్కువయిందామె అలంకరణ చూడగానే ఆమె, శ్రీరావ్ పరీక్షగా చూడటం గమనించి, చిరునవ్వు నవ్వింది వచ్చే నవ్వు అణిచిపెట్టినా పంటికొనల లోంచి జారి పెదిమలమీద మెరుపులా మెరిసింది

శ్రీరావ్‌కి వొళ్ళంతా విద్యుత్ ప్రాకినట్లు అన్పించింది నరాల్ని మెలిపెట్టి లాగిందా మంద హాసం ఆ నవ్వు, యవ్వనపు వయ్యారం మనసు వశం తప్పుతున్నట్లు అన్పించి తలొంచుకున్నాడు

తను కట్టు తప్పుతున్నాడా ? అది ఎంతో దూరం లేదేమో పేకాట అసహ్యించుకునే తను ఒకడుగు క్రిందకు దిగేడు రెండోమెట్టు మందు, మూడు మగువ

పోని ఒకట్నుంచి మూడో మెట్టుకి దూకేస్తే యవ్వనం ఆశపెట్టింది

ఆమె తలొంచుకుని వెళుతున్న శ్రీరావ్‌ని ఆశ్చర్యంగా చూస్తూ వెళ్ళిపోయింది

ఏడు, ఎనిమిదేళ్ళ క్రితమే తండ్రి తనకు పెళ్ళి ప్రయత్నాలు చేసేడు అప్పుడే తన పెళ్ళికి ఒప్పుకోవాల్సిందేమో మీనాక్షి పెళ్లి అయిపోను తన పెళ్ళి జరిగిపోను తన తండ్రి గుండెలమీద కుంపటి దింపిన వాడయ్యే వాడేమో

ఇంటి పరిస్థితి మీదకు ఆలోచనలు మళ్ళేయి అతను గుడి దగ్గరకు వచ్చాడు

గుడి ముందు హడావిడిగా ఉంది గుళ్ళోంచి భక్తులు బయటకొస్తున్నారు ఉపన్యాసం పూర్తయింది జనప్రవాహం

శ్రీరావ్ గుళ్ళోంచి వస్తున్న జనాన్ని చూస్తూ నడుస్తున్నాడు ఆగిపోయేడు గుళ్ళోంచి వస్తోంది మీనాక్షి

ఇద్దరి మధ్య జనం

జనాన్ని తప్పుకుంటూ ఆమె దగ్గరకు వెళ్ళేడు

"ఇంటికేనా ?" అడిగేడు

ఆమె శ్రీరావ్‌ని చూసింది

"ఒరేయి గౌతమ్‌రా మన గౌ ఉన్నాడక్కడ" ఉద్వేగంగా అందామె

"గౌతమా ఏక్కడా ఎప్పుడు" ఆశ్చర్యంగా అడిగేడు

"మన గౌతముడేరా కష్ణానందులు"

"మన గౌతమ్ ఏంటి ? కృష్ణానందులేంటి ? సరిగ్గా చెప్పవే "

"మన గౌతమ్ కృష్ణానందుల శిష్యుడిగా ఉంటున్నాడ్రా ఆయనతో ఉపన్యాసానికొచ్చేడు"

"మరి పలకరించేవా ?"

"పలుకరిద్దామంటే వాడి చుట్టూ ఎవరో చాలామంది పెద్దవాళ్ళు ఉన్నారు ఇంటికెళ్ళి నాన్నగార్ని పంపుదామని వెళ్తున్నాను"

"పద ఎక్కడున్నాడు చూపించు"

ఇద్దరూ మళ్ళా గుడిలోకి నడిచేరు

కృష్ణానందులవారు వేదికమీద వేయబడిన ఎత్తుపీటపై కృష్ణాజినముమీద కూర్చున్నారు ఆయనకు దిగువున కూర్చుని ఉన్నాడు గౌతమ్ మిగిలినవారు వెనుకగా కూర్చున్నారు

విశిష్టమైన వ్యక్తి యొక్క,
విశిష్టమైన అభిరుచి...'ప్లెయిన్' షర్టింగ్ మాత్రమే.




అంటే పాలియెస్టర్ మరియు పాలియెస్టర్ బ్లెండ్
మఫత్‌లాల్ షర్టింగ్!

ఈ వ్యక్తి తీరుగా, పరికోరుకునేలా రూపొందిన వ్యక్తి. అందుకే డాంబికంగా గాక, ప్రశాంతంగా దీనిని ధరించే వ్యక్తి. ఇలా ఓ ప్రత్యేకమైన వ్యక్తిత్వాన్ని తనంతటతానే సంతరించుకున్న వ్యక్తి.




MF-128-TEL

''మీరు యజ్ఞన్న దీక్షితులగారబ్బాయి కదూ?'' ఎవరో పలకరించేరు

నిశ్చలంగా చూస్తున్న గౌతమ్ సమాధానం ఇవ్వలేదు

''ఆయనే'' మరొకడు ముందుకొచ్చేడు

''ఇంటికెళ్ళేరా ?''

సమాధానం లేదు

కృష్ణానందులు లేచేరు వారితో గౌతమ్ మిగిలిన శిష్యులు లేచేరు అంతా ధ్వజ స్తంభం దగ్గరకొచ్చేరు మీనాక్షి, శ్రీరామ్ గుళ్ళోకి వస్తున్నారు

''గౌతమ్ '' పిలవబోయిన శ్రీరామ్ కేక గొంతులోనే ఉండిపోయింది

గంభీరంగా కృష్ణానందుల్ని అనుసరిస్తున్న తమ్ముడ్ని ఎలాపిలవాలో అతనికి అర్థంకాలేదు

గౌతమ్ తలెత్తి చూశాడు కాని వీళ్ళని గుర్తించిన భావం లేదా మొహంలో

కృష్ణానందులు కారెక్కేరు ముందు సీట్లోకి ఎక్కికూర్చున్నాడు మిగిలిన శిష్యులు వెనకున్న వ్యానులో ఎక్కేరు కారు దగ్గర శేషాద్రి, బుచ్చిరాజు, ఆనందరావు వగైరా నిలబడి ఉన్నారు కారు బయ ల్దేరటానికి సిద్ధంగా ఉంది

''గౌతమ్ '' ఉండబట్టలేక పిల్చేడు శ్రీరామ్

గౌతమ్ వీళ్ళకేసి చూడలేదసలు కారు వెళ్ళిపోయింది

వెనక్కి తిరిగేరు శేషాద్రి, బుచ్చిరాజు

''మా తమ్ముడు గౌతమ్ ''

''అవును నాకు అదే ఆశ్చర్యం వేసింది ఉదయం బసలో పలకరించేను సమాధానం ఇవ్వలేదు రెండేళ్ళుగా కృష్ణానందులతో ఉంటున్నాడట ఆయన వ్యవహారాలన్నీ మౌనంగానే నిర్వహిస్తూ ఉంటాడట'' అన్నాడు శేషాద్రి

''మా బుచ్చిగాడు అతను స్నేహితులా అలాంటిది వాడు పలకరించినా మాట్లాడలేదు'' అన్నాడు బుచ్చిరాజు

''వాళ్ళెక్కడ బస చేశారు ?'' అడిగేడు శ్రీరామ్

''సినిమా ఓనర్ నాయుడుగారి మేడలో ''

''అక్కడికి వెళితే తమ్ముడితో మాట్లాడటం కుదురుతుందా ?'' అడిగింది మీనాక్షి

''మీవాడు మాట్లాడదల్చుకుంటే ఎక్కడైనా కుదురుతుంది ''

''వెళదాం పద అన్నయ్యా ''

''నాన్నగారసలు బయటికే రావటంలేదు ఒంట్లో ఆరోగ్యంగా ఉంటోందా బాబూ'' అడిగేడు శేషాద్రి

శ్రీరామ్ తలూపేడు

''నాన్నగారిని ఏదో ఒకరోజు వచ్చి వేద పరనం చేయమన్నానని చెప్పు బాబూ నేనూ వచ్చి చెబుతానులెండి'' అన్నాడు శేషాద్రి

''అలాగేనండి ''

శేషాద్రి, బుచ్చిరాజు వెళ్ళిపోయేరు

''పదరా . అక్కడికెళదాం ''

''అక్కడవించి వాడెటూ పోడుగా అవధూతతో

## ధర్మో రక్షతి రక్షితః

పాటు పదిరోజులు ఉంటాడట గా వెళ్ళి నాన్నగార్ని పంపుదాం'' ఇద్దరూ ఇంటికేసి నడిచేరు

అగ్నిహోత్రం పాకలో గోడకి ఆనుకుని కూర్చున్నారు యజ్ఞన్న దీక్షితులుగారు కొద్ది దూరంలో నిలబడింది లలితాంబ

పరమేశ్వరుడు అంటున్నాడు కంగారుగా — ''బుచ్చిరాజుగారు స్వయంగా చూశారుట పలకరించేరుట కాని వాడు సమాధానం ఇవ్వలేదుట ''

''మన గౌతముడే !'' సంభ్రమాశ్చర్యాలతో అడిగింది తల్లి

''ఔనమ్మా గౌతముడే ''

''మరింటికి రమ్మని చెప్పలేదురా ?''

''నేనింకా వాణ్ణి చూడలేదమ్మా వేద పరనం జరిగిన వేళ లేడక్కడ ఇప్పుడే తెల్సింది'' అన్నాడు పరమేశ్వరుడు

సరిగ్గా అప్పుడే శ్రీరామ్, మీనాక్షి వచ్చేరు

''మేము చూసేం పలకరించేం వాడు పట్టనట్లు ఎటో చూస్తూ ఉండిపోయేడు ''

''మీరెక్కడ చూశార్రా ?''

గుళ్ళో కృష్ణానందులతో ఉపన్యాసానికొచ్చేడు''

''అదేంట్రా మన గౌతముడేమిటి మీరు మాట్లాడిస్తే పలకక పోవటం ఏమిటీ ?'' నిలదీసింది లలితమ్మ

యజ్ఞన్న దీక్షితులుగారు శ్రీరామ్‌కేసి చూస్తూ ఉండిపోయేరంతవరకు తర్వాత లలితమ్మకేసి తిరిగి

''అలిగి ఇల్లొదిలిన కొడుకుని అలక తీర్చి సన్యాసుల్లో కలవకు సంసారివి కామని ప్రాధేయ పడాలి కాబోలు'' అన్నారు

''అవేం మాటలండీ ! మూడేళ్ళుగా జాడ జవాబులేని కొడుకు ఆచూకీ తెలిస్తే మీరలా ''

''లలితా '' హెచ్చరింపుగా అన్నారు దీక్షితులు గారు ఏదో అనబోయిన లలితాంబ ఊరుకుంది

''నాన్నగారూ ! నేను అన్నయ్య వెళ్ళి గౌతముడ్ని తీసుకురామా'' అడిగాడు శ్రీరామ్

''ఒకపని చేయండి మంగలికి కబురుపెట్టి, సన్నాయి మేళంతో వెళ్ళి మరీ తీసుకురండి ''

''అదేమిటండీ మన పిల్లాడి దగ్గరకు మనం వెళ్ళటం ''

''వాడు మన పిల్లాడని నువ్వు భావించినట్లే వాడు భావిస్తే ఈ ఇంటికి రావటానికి వాడేం సంశయించడు ఏమంత గొడవ జరిగిందని ఇల్లొదిలి వెళ్ళేడూ ? నేను బ్రతికుండగా ఈ ఇంటికి రావటానికి వాడికి సర్వహక్కులు ఉన్నాయి అందు వల్ల వాణ్ణి ఎవడూ పిలవక్కర్లేదు ''



''వేలాది జనాన్ని తన శివనామంతో మంత్ర ముగ్దుల్ని చేశాడు నాన్నగారు'' అంది మీనాక్షి

''అది వాడి ప్రతిభకాదు శివనాదంలో ఉండే గొప్పతనం ''

శ్రీరామ్, పరమేశ్వరుడు, మీనాక్షి తలొంచుకుని వెళ్ళిపోయేరు

''లలితా ఇన్నేళ్ళ అనుభవంతో ఒక విషయాన్ని నువ్వు అర్థం చేసికోవటంలేదు నువ్వో, నేనో వాణ్ణి బ్రతిమాలి తీసుకొచ్చే మనకో వాడి బుద్ధి మారదు మీరు పిలిస్తేనే వచ్చేననే అహంకారం పెరుగుతుంది మానవుడు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే అరిషడ్వర్గాలు జయించాలి అప్పుడే మానవుడు పరిపూర్ణ మానవుడవుతాడు ''

లలితాంబ తలవాల్చుకుని సావిట్లో కొచ్చేసింది అంతా నిలబడి గౌతమ్ విషయమే మాట్లాడు కుంటున్నారు

''నువ్వు పలకరించిన దానివి వాడింతకాలం ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో ఎప్పుడింటి కొస్తాడో కనుక్కోవద్దే'' కూతురు మీద విరుచుకుని పడింది లలితాంబ

''మేం పిలిస్తే మాకేసి చూసి ఊరుకున్నాడు కారు ఆపలేదు కారు వెళ్ళిపోయింది ''

''కారులో వచ్చేడా ?''

''కృష్ణానందులవారితోనే ఉంటున్నాడట ''

''శ్రీరామ్ ఏడీ ?''

''బయటికెళ్ళేడు ''

అరుగుమీద నిలబడి సిగరెట్ కాల్చుకుంటూ ఆలోచిస్తున్న శ్రీరామ్ తల్లిని చూడగానే సిగరెట్ పారేసి కంగారుపడ్డాడు

లలితాంబ కొడుకునో క్షణం రెప్పవేయకుండా చూసి అరుగుమీద కొచ్చింది

''నువ్వొకసారి గౌతమ్‌ని కల్సిరారా ''

''నాన్నగారు వద్దన్నారుగా ''

''నీ పేరు శ్రీరామ్ కాని నువ్వు శ్రీరాముడివి కావురా నాన్నగారు తిరగమన్నారనే తోటలు, దొడ్లు బలాదూరుగా తిరుగుతున్నావా పొగ పీల్చటం లాంటి వెధవ వేషాలు వేస్తున్నావా ? ఆయన వాణ్ణి ఇంటికి పిల్చుకుని రావద్దన్నారు కాని మిమ్మల్ని పలకరించవద్దనలేదే వెళ్ళు వాడితో మాట్లాడిరా . వాడికసలు ఇంటికొచ్చే ఉద్దేశం ఉందో లేదో తెల్సుకునిరా ''

తలూపేడు శ్రీరామ్ మెట్లుదిగి రోడ్డు ఎక్కేడు

లలితాంబ వెనక్కి పిల్చింది

''లోపలకెళ్ళి కాళ్ళు కడుక్కుని వెళ్ళు శకునం బాగాలేదు ''

''చాదస్తం వెళ్ళేది తమ్ముడి దగ్గరకు కాని ఇంటర్వ్యూకి కాదుకదా'' అన్నాడు శ్రీరామ్ చికాకుగా

లలితాంబ నిట్టూర్చి —

''అమ్మ నిన్ను చూడాలని ఉందని అందిరా అని చెప్పు'' అంది

శ్రీరామ్ తలూపేడు

(ఇంకా వుంది)

## జి హెచ్. — హైదరాబాదు

మనదేశంలో స్త్రీలపై నానాటికి అత్యాచారాలు మితిమీరుతున్నాయి కదా—దీనికి తరుణోపాయం లేదా?

ఉంది. ఆడదాన్ని కూడా సాటి మనిషిగా చూసే అలవాటు చేసుకోవడం కాని ఇదెప్పటికి సాధ్యమో తెలియదు ఎందుకంటారా తరతరాలుగా వస్తూన్న స్త్రీ పట్ల అల్పభావాలని—అన్నివిధాలా మన పుస్తకాలు, మన సినిమాలు, మన నాగరికత అంతా జాగ్రత్తగా కాపాడుకుంటూ వస్తున్నాయి మగపిల్లలకీ ఆడపిల్లలకీ తేడాలు పెంపొందిస్తూనే వుంటారు తల్లిదండ్రులు అంచేత తరం తరవాత తరం— అదే అల్పభావంతో ఆడదాన్ని చూడాలనే తహతహ లాడుతోంది ఒక రామ్మోహనరాయ్, ఒక వీరేశలింగం రాకుంటే— యీ ఆడది యింకా ఎక్కడ వుండేదో—ఒక్కసారి వెనుదిరిగి చూడండి. అలాంటి మహానుభావుల సంఖ్య పెరుగుతూ వస్తే తప్ప ఈ సమస్యకి తరుణోపాయం తోచదు.

## ఎమ్ కె. ఆర్. — విశాఖ

కుటుంబంలో అశాంత పరిస్థితుల వల్ల—దేవుడు ఏదో శాంతినిస్తాడని నమ్మి దేవుని విషయంలో ఒక పిచ్చిదానిగా మారిపోతోంది మాచెల్లి. పెళ్ళయాక యిబ్బంది పడుతుందేమోనని భయంగా వుంది

ఏమో ఆ పిచ్చి నమ్మకమే—ఆమె ధైర్యంగా వుండడానికి కారణం అయితే భయం దేనికి? ఏదో ఒక దాన్లో నమ్మకం లేకపోతే—మనశ్శాంతి వుండదు ఆమెను అర్థం చేసుకునే భర్త దొరుకుతాడని ఎందుకనుకోరు మీరు? ఎవరినీ ఇబ్బంది పెట్టనంత వరకూ, ఆమె ఆరోగ్యానికి దెబ్బ లేనంత వరకూ— మరేం ఫరవాలేదు. రాహుకాలంలో ఆపరేషను ప్రారంభించని డాక్టర్లున్నారా.. మంచి రోజున కాని శంఖుస్థాపన చేయని ఇంజనీర్లున్నారా. వీరంతా మూర్ఖులు కారు. మూఢ భక్తులూ కారు. సదాచారాల మీద నమ్మకం వున్నవాళ్ళు. ఉన్నవారిని అవహేళన చేయకూడదనుకునే వాళ్ళూను. అంతే

## ఉదయి — వజ్రకరూరు

రాజకీయాలను గురించి మీఅభిప్రాయం? దేవుడిని దెయ్యాన్ని మీరు నమ్ముతారా?

ఎంత కలుషితమైనా రాజకీయపు స్వేచ్ఛని నామమాత్రంగా నేనా ఉండనిచ్చేది ప్రజాస్వామ్యం. దేవుడు తెలియని విషయం —కనుక నమ్ముతాను. దెయ్యం తెలియక పోయినా—చెడు అంతా దెయ్యంగా భావిస్తాను.

## ఫ్రాన్సిస్ — ఒంగోలు

నేను ఆత్మవంచన చేసుకోలేను. అలా చేయకుండా యీ సమాజంలో బ్రతకడం కష్టంగా వుంది— మీ సలహా?

ఆత్మవంచన చేసుకోవద్దు. కాని డిప్లొమసీ నేర్చుకు బ్రతకాలి




## ఎమ్. ఆర్. కె హైదరాబాదు

స్త్రీకి ఉద్యోగం, పెళ్ళి కుదరవని నా అభిప్రాయం. వివాహిత అయిన స్త్రీకి భర్త ఇల్లు పిల్లలని చూసుకోక వేరే ఉద్యోగం అంటూ బయలుదేరడం సమంజసమా?

ఉద్యోగం ఆమె మనస్సుకు సంతృప్తి నిస్తే అది సమంజసం ఎందుకు కాదు? ఇల్లు వాకిలి భర్త పిల్లలు మినహా ఆడదానికి వేరే లోకం వుండకూడదనా మీ భావన? అసహ్యించుకుంటూ పైవన్నీ చేసే కంటే సంతోషంగా ఉద్యోగం చేస్తూ యివన్నీ చూసుకోవడంలో తప్పులేదు సాటి వాళ్ళు ఆమె యిష్టాయిష్టాలని అర్థం చేసుకుని సహకరించితే ఆ యిల్లు హాయిగా వుంటుంది

ఆడపిల్ల సంపాదన తిన్నారని ఆడిపోసుకునే ఈ లోకం సంపాదించే భార్యపై పడి తినే భర్తలని పట్టించుకోదేం?

ఈ సమాజం పురుష పక్షపాతి కనుక!

## పి. ఎస్. ఎన్. — శ్రీకాకుళం

భర్త అమాయికత్వాన్ని అనువుగా తీసుకుని ఒక యిల్లాలుతనయిష్టమొచ్చినట్టుఆటలుఆడుతున్నది. అటువంటి ఇల్లాలిని ఏం చేయాలి?

మీ కెందుకో యీ బాధ మధ్యన? వాళ్ళూ వాళ్ళూ చూసుకుంటారు భార్య భర్తల తగవుల్లో తలదూర్చ కండి. ఆ భర్తగారొచ్చి అడిగినప్పుడు ఆలోచించండి.

## ప్రఫుల్ల — ధర్మవరం

పత్రికలలో అప్పడాల కార్టూనులపై మీ అమూల్యమైన అభిప్రాయం?

శివరావు హాస్యం పోయి యింత కాలమైనా మనవాళ్లకీ చౌకబారు దృష్టి పోలేదు! కాని యిప్పుడిప్పుడు కొందరు యువ కార్టూనిస్టులు ట్రెండు మార్చి మంచి వ్యగ్యం కురిపిస్తున్నారు సంతోషంగా వుంది మరీ కొన్ని పత్రికలే — మరీ స్టాంపు సైజుకి దించేస్తున్నాయి కార్టూన్లని!

## కె జి. ఎస్ కె. కుప్పం

మీ సాహిత్య జీవితంలో మీకు సంతృప్తి నిచ్చిన రచన ఏది?

రాయబోయేది!

సినిమా పరిశ్రమ ప్రభుత్వం నడిపితే ఎలా వుంటుంది?

ప్రభుత్వ సంస్థలని చూడ్డంలేదా?? అలాగే వుంటుంది!

## జి ఎస్. ఆర్. — నేలకొండపల్లి

జీవితంలో పోతే తిరిగి దొరకనిదేమిటి కె రా.గారు?

టైమ్!

## జె. ఎస్ కె. — పొద్దుటూరు

ఆకాశవాణి కార్యక్రమాలు ముగిసే ముందు జైహింద్ అంటారు ఎందుకు?

ప్రారంభించే ముందు వందేమాతరం కూడా పాడతారు— అది ప్రభుత్వ సంస్థ కనుక.

## కె. బి — అనంతపురం

పెళ్ళయిన స్త్రీ ప్రేమలో పడితే?

మూడు కుటుంబాలు ఇబ్బంది పడతాయి!!

## డి హెచ్ ఆర్. — సికింద్రాబాద్

ఈ రాజకీయ పార్టీల రగడలు అంతం ఎప్పుడు?

అవి చేసిన వాగ్దానాలు అవేమింగి అరాయించుకోలేక సహజ మరణం పొందుతాయి!





# వానరులు - శైలకుమార్



చీకటి నేల నాలుగు చెరుగులూ ఆక్రమించుకుంటున్న నల్లని చీకటి పేదవాడి ఆకలిలాంటి చీకటి. ఆ చీకట్లో చీకటిగా కలిసిపోయింది ఆ ఆంజనేయుడి దేవాలయం.

కాలులా ఉపయోగపడుతున్న కర్రను నేలమీద చప్పుడు చేసుకుంటూ, కుంటుతూ కూలిపోయిన మొండి గోడల ఆలయ ప్రాంగణంలోకి ప్రవేశించాడు అంజి.

"ఎవుర్రా అది అంజిగాడేనా" అడిగాడు సిద్ధయ్య

"ఔదు మాఁవా" అంటూ సమాధానం యిచ్చి, చంకకు తగిలించుకున్న చిరిగిపోయిన రంచీని క్రింద పెట్టి, మూలన దాచుకున్న గోనెసంచి తెచ్చి పరుచుకున్నాడు అంజి ఏడుకోనటానికి వుపక్రమించబోతూ.

"ఏందిరా యియ్యాల యింత ఆలిశం గొచ్చినావు" అడిగాడు సిద్దయ్య

"ఏంలేదు మాఁవా మా అత్త దగ్గర కెల్లొచ్చిన" అన్నాడు.

"మీ అత్తంటే, ఆ బాపనీదిలో అడుక్కునే సుక్కమ్మే గదరా."

"ఔను మాఁవా."

"అయినా ఇయ్యాల్టిదాకా ఏం వూసులాడినావురా. సర్లే ఓ బీడీ ఇటెయ్యి.'

"మళ్లీ నేం నెగిసి రాలేనుగాని నువ్వే దా ఇటు" పిలిచాడు అంజి

సిద్దయ్య లేచి అంజి దగ్గరకు వచ్చి అతడిచ్చిన బీడీ వెలిగించి తృప్తిగా దమ్ము పీల్చాడు.

ఆ ఇద్దరు భిక్షగాళ్లకూ నిలయం ఆ శిథిల దేవాలయం. రంగు వెలిసిన సగం విరిగిపోయిన గోడలూ, ప్రాంగణంలో అక్కడక్కడా మొలిచిన పచ్చిగడ్డీ, గర్భగుడిలో ఆంజనేయుడి జీర్ణ శిల్పం, విభూదికి బదులుగా నిండుకున్న ధూళీ-అదీ ఆ ఆలయ స్వరూపం.

ఆ ఇద్దరు భిక్షగాళ్ళకూ, తనవారసులైన కొన్ని కోతులకూ ఆశ్రయం ఇస్తున్నానన్న గర్వం తప్ప మరేం లేదు ఆ దేవుడికి.

ఊరికి దూరంగా ఉండటంతో ఎవ్వరూ పట్టించుకోవటం లేదా గుడిని. మనుషుల మధ్య లేకుంటే దేవుడిక్కూడ దిక్కులేదని చెప్పటానికి. ఆదాయం లేని గుడిలో అర్చన చెయ్యటం దండగని ఏ పూజారీ ముందుకు రాలేదు. ఏ బాబా కూడా అక్కడ వెలయలేదు కాబట్టి ఆ గుడికి ఏ మహిమలూ ఉన్నట్టు ప్రచారం లేదు చివరికి దేవుడిక్కూడా ప్రచారం లేకుంటే ప్రమోషన్ రాదు, ఏటేటా ఉత్సవాలూ జరుగవు.

అంజికూడా చెవిలో దాచుకున్న బీడీ ముక్కను తీసి వెలిగించుకున్నాడు

"సరే యిప్పుడు జెప్పరా ఊసులేందో" అన్నాడు బీడీపొగ వదులుతూ సిద్దయ్య.

"పెళ్ళి సేసుకోవాలనుకుంటుండా మాఁవా" అన్నాడు సిగ్గుపడుతూ అంజి

వాడి మాటలకు పగలబడి నవ్వాడు సిద్దయ్య – అతడి నవ్వుకు చెట్టు పైని రెండు పక్షులు టపటపా రెక్కలాడిస్తూ ఎగిరిపోయాయి. కోతులు కిచకిచ మన్నాయి. సిగ్గుతోపాటు కోపం కూడ వచ్చింది అంజికి.

"ఏంది మాఁవా పరాసికాలాడుతుండావు" అన్నాడు కోపంగా.

"ఓరోరి అడుక్కునే ఓడివి, అందులోను కుంటోడివి నీ కెవుర్రా పిల్లనిచ్చేది" అంటూ మళ్లీ నవ్వాడు సిద్దయ్య.

బీడీ ఆరిపోయింది.

# శిరోజములను సంరక్షించే ప్రాచీన భారతీయ సాంప్రదాయాన్ని కె.ఎమ్.పి. కొనసాగించుచున్నది.




కె ఎమ్ పి. కొబ్బరినూనె—భారతదేశమందు అత్యధికముగ విక్రయింపబడుతున్నది, డబ్బాలలో లభ్యమగుచున్నది. కె ఎమ్ పి. కొబ్బరినూనె నూటికి నూరుపాళ్ళు స్వచ్ఛమైన వాసన, రంగు కలిగియున్నది. మరియు, కె ఎమ్ పి. కొబ్బరినూనెను సుదీర్ఘమైన ప్రకాశవంతమగు నున్నని పట్టువంటి ఆరోగ్యప్రదమైన జుట్టుకోసం మహిళలందరు విశ్వసిస్తున్నారు. కె.ఎమ్.పి. కొబ్బరినూనె ఆ విశ్వాసాన్ని నిలుపుతుంది కూడా!

ఇప్పుడు ప్లాస్టిక్ డబ్బాలలో లభ్యమగుచున్నది.




కె.ఎమ్.పి. ఆయిల్ ఇండస్ట్రీస్
ప్రైవేట్ లిమిటెడ్
కె ఎమ్ పి. నగర్, కొచ్చిన్ 682 006.

FDS/KMP/1/82 TEL

"అగ్గిపెట్టియ్యరా" అడిగాడు

"నే నియ్యను ఎల్లు" అన్నాడు కోపంగా అంజి

"ఓర్ని కోప మొచ్చేసినాదిరా నువ్వలగ్గ మెట్టుకుంటే నాకూ ఆనందమే గదరా. ఇంతకూ పిల్లెవురు సెప్పు" అన్నాడు — సిద్దయ్య రాజీకొస్తూ

"సుక్కమ్మత్త కూతురు" అంటూ అగ్గిపెట్టె అందించాడు అంజి.

"ఏదీ ఆ గుడ్డిపిల్లా" అన్నాడు వెటకారంగా.

"ఆఁ" అన్నాడు అంజి

"చేసుకునే ఓడివి మంచిపిల్లను సేసుకోక ఆ గుడ్డిదెందుకురా నువ్వా కుంటోడివి, అదా గుడ్డిది దొందూ దొందే అన్నట్టు కాపురం ఎట్టా సేత్తార్రా మీరు అయినా ఒరే నే సెప్పేదినుకో పెల్లంటే తమాసాలు గాదు దాన్ని పోసించాల, దాని పిల్లల్ని పోసించాల. మీకో గుడిసె కావాల ఎన్ని కట్టాలో దెలుసా బిచ్చగాడైనా మొగుడు పోసించకపోతే పెళ్ళాం నెగిసిపోద్ది. అయినా ఎట్టా పోసిత్తావురా దాన్ని" అడిగాడు సందేహంగా.

"కట్టపడి పోసిత్తా మావా" అన్నాడు అంజి

ప్రతిరోజు వీధుల్లో కెళ్ళి రకరకాల అట్ట బొమ్మల్ని ముఖానికి తగిలించుకుని జోకర్‌లా గంతులేస్తాడు అంజి కడుపు కక్కుర్తి కోసం ఒంటికాలితో ఎగురుతున్న కుంటివాడినిచూసి జాలిపడటానికి బదులు ఆనందించే వాళ్ళు జనం. పొటి మనిషి కడుపుకోసం శారీరక లోపాన్ని ప్రదర్శనకు పెడితే సిగ్గుతో తల వాల్చుకోవలసింది పోయి ఆనందించే పైశాచిక ప్రవృత్తికి అలవాటు పడిన జాతి కొత్తలో బాగానే డబ్బులు దొరికేవి అంజికి. రానురాను

## వానరులు

రోజూ చూస్తున్న వాడి ఆట పాతబడి పోయింది ఆ ఊరికి, దానితో అంజి ఆదాయమూ తగ్గింది

"ఏం కష్టపడతావురా. కట్టం చూసి కానులిచ్చే కాలం కాదురా యిది" అన్నాడు నిట్టూరుస్తూ సిద్దయ్య.

"ఈ ఊరు గాకపోతే ఇంకోఊరు' అన్నాడు ఆశగా అంజి

"నీ అగ్నానంగాని ఏ వూరైనా ఇదే మడుసులా"

"అట్టా అనుకుంటే ఎట్టా మావా"

"మరి లగ్గం ఎప్పుడురా" అడిగాడు సిద్దయ్య

"అయిదు సేరు బియ్యమూ, యాభై రూపాయలు సంపాదిత్తేగాని లగ్గం ఎట్టనంది సుక్కమ్మత్త"

"అంత డబ్బు ఎట్టా సంపాదిత్తావురా"

"రేపట్నుంచి ఆంజనేయ సామి ఏసం కడతా ఆ పైన ఆ భగమంతుడి దయ' అన్నాడు అంజి గుడివైపు తిరిగి దండం పెడుతూ

"సరే పొద్దు శానా అయింది గాని తొంగో" అంటూ లేచాడు సిద్దయ్య.

కర్రకాలు దగ్గరికి లాక్కుని గోనెసంచి మీద పడుకున్నాడు అంజి సుక్కమ్మ కూతురు గుడ్డిపిల్లకీ, తనకూ పెళ్ళయినట్టు, చెరో వీధిలో అడుక్కుంటున్నట్టు గుడి దికాబట్టి అందరూ జాలిపడి డబ్బులు వేస్తున్నట్టు ఇద్దరూ ఆ గుడిలోనే ఓ మూల చిన్న గుడిసె వేసుకుని బ్రతుకుతున్నట్టూ కలలు కంటూ అలాగే నిద్రపోయాడు అంజి.

ఆకాశపు ముఖం తెల్లబోయినట్లు తెల్లవారింది. చీకట్నే జయించానని ఎంత గర్వం సూర్యుడికి? ఏడుగంటలైనా కాకముందే ఎండలో నిప్పులు కురిపిస్తున్నాడు.

అంజనేయుడిలా అమర్చుకున్న ముఖాన్ని, తోకను తడిమి చూసుకున్నాడు అంజి ఓ భుజానికి పాత సంచీని తగిలించుకున్నాడు. మరోచేతో కర్రను తీసుకుని చంకకు అమర్చుకున్నాడు. "సామీ నువ్వే కాపాడాల, నాకూ అత్త కూతురికీ మనువయ్యేట్టు సూడాల" అనుకుంటూ నమస్కరించాడు దేవుడికి

ఆకాశంవైపు చూసి నిట్టూర్చాడు ఇంత ఎండలో చెమటు కక్కుతూ అంజనేయుడిలా సాయంత్రం దాకా ఆడాలి "అయిదు సేర్ల బియ్యమూ యాభై రూపాయలు" అన్న అత్త మాటలు మనసులో మెదిలాయి బయలు దేరాడు యుద్ధాని కెడుతున్న సైనికుడిలా అంజి అప్పటికే సిద్దయ్య వెళ్ళిపోయాడు

ఆ రోజు తనను తాను మరచిపోయాడు అంజి అంజనేయుడే అతనికి పూనినంత ఉద్వేగంగా ఆడాడు. ఆ వూరి వీధుల్లో—ఒక కాలు నెప్పెడుతున్నా లెక్కచెయ్యలేదు అత్త అన్న మాటలు, ఆ రాత్రి అతడు కన్న కలలు కళ్ళముందు మెదులుతున్నాయి- చచ్చిపోతున్న ఉత్సాహానికి కొళాయి నీళ్ళతో ఊపిరి పోసుకున్నాడు.

సాయంత్రం అయింది ఓడిపోయిన వాడిలా సిగ్గుపడి తన ముఖాన్ని ప్రపంచానికి చూపించుకోలేక సముద్రంలోకి పారిపోయాడు సూర్యుడు దీపాలు పెడుతున్న వేళ, మల్లెలు నవ్వుతున్న వేళ, నల్ల చీర కట్టుకున్న ఆకాశ కేశాల్ని చుక్కలు చిక్కులు తీస్తున్న వేళ.

ఊరికి కాస్త దూరంగా వచ్చాడు అంజి. ఆ రోజు పోగయిన చిల్లర తీసి లెక్కపెట్టుకున్నాడు. అనుకున్న దానికంటే ఎక్కువే వచ్చింది. "ఈ లెక్కనే అయితే ఓ నెల

రోజుల్లో యాభయి రూపాయలు సంపాదించ వచ్చు'' అనుకున్నాడు

ఈలపాట పాడుకుంటూ గుడి దగ్గరకు చేరుకున్నాడు గుడి మొదట్లో ఏదో ఏరుకు తింటున్న ఓ కోతి అంజిని చూసి పారిపోయి పక్కనే వున్న చెట్టెక్కింది. నవ్వుకున్నాడు అంజి

గుడిలోకి చేరుకున్నాడు సిద్దయ్య ఇంకా రాలేదు అటూ ఇటూ చూశాడు ఎవ్వరూ లేరు తను సంపాదించినదంతా ఓ మూల పాతి పెట్టాడు, చివరికి సిద్దయ్యకు కూడ ఈ విషయం తెలియకూడదనుకుని. దాచిన ప్రదేశాన్ని మరొకసారి చూసుకుని తృప్తిపడి గోనెసంచీ పరచుకుని కూర్చున్నాడు ఓ కోతి అతని దగ్గరగా వచ్చింది చేతి కర్రతో అదిలించాడు.

''ఏందిరా ఇయ్యాలింత బేగీ వచ్చేసినావు'' అంటూ సిద్దయ్య ప్రవేశించాడు

''బాగా అలుపొచ్చేసినాది మావా'' అన్నాడు అంజి

''ఎంత సంపాయిచ్చినావేటి''

''ఏం సంపాదనలే మావా కర్చుకే సాల్లా'' నిట్టూర్చాడు

అంజి ప్రక్కనే వచ్చి కూర్చున్నాడు సిద్దయ్య ఎక్కడ తను సంపాదించింది పసికడతాడోనని బిడియపడ్డాడు అంజి!

''ఓ బీడి ముక్కియ్యరా'' అడిగాడు సిద్దయ్య.

''ఏది తప్పినా ఇద్దప్పదు గందా''అంటూ అందించాడు.

''ఒరే బగమంతుడు ఏం జెప్పినాడో ఇనుకున్నావా? నువ్వెవురు నేనెవరు? ఇచ్చుకునే ఓడెవుడు పుచ్చుకునే ఓడెవుడు? అంతా నేనే గందా అన్నాడు.''

''ఎర్రి ఏదాంతం బాగా నేర్చినవ్ మావా'' అని నవ్వాడు అంజి

''ఒరే అంజీ ఈ గుడి నుంచి కూడ మనల్నెల్లగొట్టేత్తార్రా'' అన్నాడు నిట్టూరుస్తూ సిద్దయ్య.

''ఎందుకు మావా''అన్నాడు ఆందోళనగా అంజి

''రేపట్నుంచి నాయుడుగారీ గుడిని బాగు సేపిత్తారంట''

''ఏంది మావా నువ్వు సెప్పేది? ఎండలో ఎంతసేపాడినా చూసి పైసా కూడ ఎయ్యని పీనాసి నాయుడు గుడిని బాగుసేపిత్తాడంటావా? బమ'' అన్నాడు అంజి

''ఓసి పిచ్చిమొగమా ఈ పెపంచికంలో ఎవుడూ తనకు నాభం లేకుండా ఏ పని సెయ్యడా'' అన్నాడు సిద్దయ్య.

''గట్టయితే గుడిని బాగు సేపిత్తే నాయుడికేటి నాభం'' రక్కున అడిగాడు అంజి.

''ఎలచ్చన్లొత్తనయి గదరా, గుడి గడితే పెజలంతా ఓట్లేసి గెలిపిచ్చేత్తారని''

''అయితే గుడి గట్టేది ఓట్ల కోసం గాని సామి కోసం కాదన్నమాట''

''అంతే గదరా మరి''

''పోన్లే మావా దేముడు సల్లగా వుంటే మనకు లోటేటి? ఇన్నిరోజులూ మనలాగే దిక్కులేనోడిలా వుండిపోయినాడీ అయ్య'' అంటూ నిట్టూర్చాడు అంజి లోపల మాత్రం అతనికి భయంగానే వుంది, గుడి బాగుచేసి తనను వెళ్లగొట్టేస్తే ఎక్కడికెళ్లాలా? అని.

''మరైతే మావా గుడెప్పటికి పూర్తవుద్ది.''

''ఎప్పటికో ఏందిరా ఓ నెల గడిసేటప్పటికి అయిపోద్ది. వచ్చేమాసంలో ఆంజనేయ సామి పండుగ రాదా అప్పుడు ఓపినీ సేత్తారంట. మళ్లా మనం ఈదుల్లో బడాల్సిందే'' అన్నాడు బాధగా సిద్దయ్య.

'నెలరోజులుగదా' అనుకున్నాడు మనసులో అంజి 'ఈ లోపల తనకు మనువయిపోద్ది. ఏదో ఓ మూల గుడిసెలో ఏకంగా కాపురం పెట్టొచ్చు' అని తనకు తాను ధైర్యం చెప్పుకున్నాడు అంజి

''అయినా ఇదంతా నీ కెట్టా తెలిసింది మావా'' సందేహ నివృత్తికోసం అడిగాడు అంజి.

''ఓరి నీ కడుపుడకా, బలే అనుమాన మొచ్చేసినాదిరా నీకు. ఊరు ఊరంతా సెప్పుకుంటాండారు తెల్సా''

విషాదంగా ఆలోచనలో పడి పోయాడు అంజి మరుసటిరోజే గుడిని బాగుచెయ్యటం ప్రారంభించారు.

ఏ అనుభూతులూ లేని కాలం, ప్రపంచంలో ఏం జరుగుతున్నా పట్టించుకోని కాలం, గమ్యం లేకుండా క్షణమైనా విశ్రాంతి తీసుకోకుండా నిర్విప్తంగా కదిలిపోతూనే వుంది కాలపు కరిన పాదాల క్రింద నెల రోజులు నలిగిపోయాయి. భవిష్యత్తు వర్తమానమై వర్తమానం గతంగా మారింది.

ఆ నెల రోజుల్లోనూ ఒక్కరోజు కూడ విశ్రాంతి తీసుకోలేదు అంజి సంపాదించా లనే తపన అతన్ని నిద్రపోనివ్వలేదు. వచ్చిన దంతా అలాగే దాచి పెడుతున్నాడు.

తెల్లవారితే హనుమజ్జయంతి. కొత్త రూపం దాల్చుకున్న పాత గుడికి ప్రారంభోత్సవం పచ్చని తోరణాలతో, వేదమంత్రోచ్చారణతో, ద్విజుల కర్పూర నీరాజనాలతో, ప్రముఖుల ప్రవచనాలతో, ప్రజల సమక్షంలో, నాయుడు ఆధ్వర్యంలో ఉదయ, భానుడి



మేలుకొలుపుతో ప్రారంభోత్సవం చెయ్యబడుతుంది గుడి.

ఆ రోజు ఎంతో తొందరగా గుడిదగ్గరకు చేరకున్నాడు అంజి. దాచిన చిల్లరంతా తీసి లెక్కపెట్టుకున్నాడు. యాభయిమూడు రూపాయలుంది అంతా కలిపి మూట కట్టాడు మూట లావుగానూ, బరువుగానూ వుంది మరో మూటలో బియ్యం

ఆనందంతో గుండె పగిలిపోయేలా వుంది అంజికి ఎలాగైతేనేం అత్త చెప్పిందానికన్నా ఎక్కువే సంపాదించ గలిగానన్న తృప్తి. ముప్పయికోట్లు సంపాదించిన వాడికన్నా ప్రపంచంలో అనుకున్నవన్నీ పొందినవాడికన్నా, ఆనందంగా వుంది. అత్త కూతురు తన భార్య కాబోతోందన్న ఉత్సాహం. గంతు లెయ్యాలని, గట్టిగా అరవాలని, అందరినీ పిలిచి ఈ విషయం చెప్పాలని, అత్త వైపు గర్వంగా చూడాలని, ఓ సిగరెట్టు కాల్చాలని ఇంకా ఏదేదో చెయ్యాలని వుంది అంజికి.

గుడి వైపు తిరిగి దండం పెట్టుకుని చెంపలు వాయించుకున్నాడు రెండు సంచులను దగ్గరకు లాక్కుని గట్టిగా పట్టుకున్నాడు.

సిద్దయ్య వచ్చాడు. అదేపనిగా ఆకాశంలోకిచూస్తున్న అంజిని చూసి నిట్టూర్చాడు.

''ఇయ్యాల్టితో గుడికీ మనకీ రుణం తీరిపోయిందిరా'' అన్నాడు.

# వా న రు లు

అంజి మాట్లాడలేదు బాధ పడుతున్నాడనుకున్నాడు సిద్దయ్య

రెండు సంచులను రెండు చేతులతో గట్టిగా పట్టుకున్నాడు అంజి నిద్ర రావటం లేదు–ఆనందోద్వేగం–కలలు కనటం ప్రారంభించాడు అర్ధరాత్రి దాటిం తరువాత మాగన్నుగా వాలాయి అంజి కళ్ళు. ఆ ఆనందంలో మూటల్ని దాచిపెట్టటం మరిచాడు అంజి

తెల్లవారింది రోజు కన్న ముందుగానే మెలుకువ వచ్చింది మెలుకువ వచ్చిన మరుక్షణం చేతులతో డబ్బు మూటని, బియ్యం మూటని తడిమాడు, కనిపించలేదు.

గుండె ఆగినంత పనయింది కట్టుకున్న కలలకోట భళ్ళున బద్దలైనట్లయింది. హృదయం నుంచి ఏడుపు తన్నుకొచ్చింది. ప్రపంచంలోని సరస్వాన్ని ఒక్కసారి పోగొట్టుకున్నంత బాధ ఎడారిలో ఏకాకిగా మిగిలిపోయి నంతటి విషాదం. ఊపిరి ఆగిపోయినట్టయింది కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి.

లేచి చుట్టూ చూశాడు దూరంగా చిల్లరమూట, నెలరోజులు తను తిండీ నిద్రా మాని సంపాదించుకున్న మూట విప్పివేయబడి వుంది. చిల్లరంతా చెల్లాచెదురుగా ఏరుకోవడానికి కూడ వీలు లేనట్లు పడివుంది. ప్రక్కనే బురదలో వెదజల్లబడిన బియ్యం మూట! ఓ కోతి అక్కడ కూర్చుని బియ్యం ఏరుకు తింటోంది

పట్టరాని కోపం వచ్చింది ఆ కోతి మీద అంజికి తన కలలన్నీ నాశనం చేసింది తన భవిష్యత్తును ఆ చిల్లరలా వెదజల్లింది ఆ కోతి. కోపంతో ఉడుకెత్తిపోయి శరీరం వణకడం ప్రారంభించింది. తట్టుకోలేక పోయాడు

ప్రక్కనే వున్న ఊత కర్రను తీసుకుని బలంగా కసిగా కోతి నెత్తిన కొట్టాడు అంజి. అంతే కిక్కురు మనలేదు కోతి తల పగిలి నెత్తుటి ధార కొది క్షణాలు గిల గిలా తన్నుకుని ప్రాణం వదిలేసింది కోతి

అలయ ప్రారంభోత్సవానికి ఊరు ఊరంతా మహోత్సాహంగా కదలివచ్చింది – మొదటగా వారి కంటబడిన దృశ్యం రక్తం మడుగులో చనిపోయి వున్న కోతి ప్రక్కనే కుంటివాడి కర్ర, కాస్త దూరంలో ఏడుస్తున్న కుంటివాడు.

''ఘోరం ఘోరం రామచంద్రా'' అంటూ కళ్ళు మూసుకున్నారు కొందరు. ''హనుమజ్జయంతి రోజున ఆ దేవుడి ప్రతిరూపమైన కోతిని చంపటమా'' జనంలో ఎవరో అరిచారు. ఉద్రేకం పెరిగింది జనంలో. ఆ పాపిని క్షమించటానికి వీల్లేదు ఆ దుర్మార్గుడిని అలా వదిలివెయ్యకూడదు. మహోద్రేకంతో కదిలారు. తన్నండి, కొట్టండి అరుపులు. తుఫాను కడలి అలలా విరుచుకు పడ్డారు కుంటివాడి మీద జనం. వాడి ఒంటిమీద పడుతున్న దెబ్బలు, వాడి అరుపులు.

హనుమజ్జయంతి రోజున చనిపోయిన ఆ కోతికి పన్నీటిస్నానం చేయించారు, పూల మాలలు వేశారు, మనిషి కన్నా ఎక్కువగా అలంకరించారు. వీధి వీధి ఊరేగించి దహన క్రియలన్నీ శాస్త్రోక్తంగా నిర్వహించారు అందరూ కన్నీరు కార్చారు ఒకర్నొకరు ఓదార్చుకున్నారు. ఆ రోజున చనిపోయినందుకు ఆ కోతి తప్పకుండా హనుమంతుడిలో లీనం అవుతుందన్నారు.

చనిపోయిన దిక్కులేని కుంటివాడి శవాన్ని మాత్రం మునిసిపాలిటీ బండి ఈడ్చుకు పోయింది. ఒక్క సిద్దయ్య తప్ప మరెవ్వరూ కన్నీరు కార్చలేదు.



# "మమ్మీ, ఈ దురద, మంటను ఎలాగైనా ఆపవూ."

నైసిల్
ఉపయోగించండి
అతి శీఘ్రంగా
ఉపశమనమునిచ్చే,
చెమటకాయల పౌడర్.

2 రకాల
డబ్బీలలో
దొరుకుతుంది.
'నీలం' మరియు
'చందనం.'

Glaxo
nycil
POWDER

**నైసిల్ తెచ్చుకోండి**
**చెమటకాయల బాధ మరిచిపోండి.**

ప్రత్యేకమైన ఔషధ యుక్త నైసిల్ చెమటకాయలను ప్రతి స్థితిలోనూ ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను నిరోధిస్తుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధాన్ని కల్గించే సూక్ష్మజీవులను నాశనం చేస్తుంది.
4. చర్మమునకు హాయి గొల్పుతుంది.

CASGLN:4-203 TEL

# వారఫలం

**24-9-1982 శుక్రవారం మొదలు 30-9-1982 గురువారం వరకు**

★మేషం —ఈ శుక్రవారాన్నుండిమీకుధనయోగం ప్రాప్తించనున్నది అప్రయత్న ధనలబ్ధి కూడా సంభవం. రాజకీయవాదులకు, రంగస్థల నటులకు మంచి వారంగా భావన. స్త్రీలకు · బాధ్యతలు పెరిగినా కుటుంబానందానికి లోటు లేనివారం.

★వృషభం —మీకు మొట్ట మొదట కలిగిన ఆలోచనల ప్రకారం కార్యక్రమాన్ని సాగించండి. వ్యాపార వ్యవహారాలను ముందుకు నడపండి లబ్ధికి అవకాశం ఉన్నది. స్త్రీలకు : లలిత కళలందు, ఉద్యోగమందు, కొందరకు వ్యాపారమందు సదవకాశాలుంటాయి.

★మిథునం —చాలమంది ఆరోగ్య విషయంలో అమితశ్రద్ధా సక్తులు చూపవలసిన దినాలు. వాహనాల్లో తిరుగాడేవారు ఎంతో జాగరూకత వహించవలసినవారం ఇంట్లో మరమ్మత్తులు చేయించవలసిన అవకాశం కనిపిస్తుంది. స్త్రీలకు· నగలు కొనుగోలు చేయుటం, అపూర్వ వస్తు సేకరణకు అవకాశం గల వారం.

★కర్కాటకం — ఆదాయంలో అభివృద్ధి, వృత్తిలో క్రమాభివృద్ధి, ఉద్యోగంలో పెంపు, వ్యాపారంలో ఆశించినంతకన్నా గుణం, లాభం, లబ్ధికి అవకాశమున్నది. స్త్రీలకు : గత కొన్ని వారాలకన్నా అన్ని రంగాలలో మెరుగుగా ఉన్నట్లు గ్రహించటం గమనించగలరు.

★సింహం.—ఆరోగ్యలోపం లేనందువలన, బాగా హుషారుగా ఉంటుంవలన, ఎంత జాగ్రత్తవహిస్తే అంతమేలు. వ్యాపారంలో మేలున్న వారమే. ఉద్యోగంలో చాలా విధాలా అనుకూలమే. ఆశించిన విధాన మేలు జరుగుతుంది. స్త్రీలకు : విద్యా వైజ్ఞానిక రంగాల్లో పరిశ్రమ చేసే వారికి లాభించేవారం.

★కన్య —ఒకానొక విషయంలో ఆశించిన విధానానికన్నా ఎక్కువ మేలు జరగనున్నది. అప్రయత్నంగా ధనరాబడిగల దినం. ఆరోగ్యంలో కొందరకు లోపమేదో కనిపిస్తుంది. జాగ్రత్త ! స్త్రీలకు : బంధువర్గీయులతో మంతనాలు సాగించుట, మిత్ర వర్గంతో గోష్ఠికి, నూతన వస్తు సేకరణకు అవకాశం గలవారమే

★తుల — ఏ విషయంలోనైనా, ఏ రంగంలోనైనా, అభివృద్ధి ఆశింపరాదు. ధైర్యంగా నిర్దిష్ట ప్రయత్నాలకు దిగవచ్చు. వ్యాపారంలో అనవసర ప్రయత్నాలకు దిగటం, రాజకీయంగా ఫలాపేక్షకై యత్నించటం ఎంత మాత్రం తగదు. స్త్రీలకు : బంధువుల రాకతో వారమంతా హడావుడిగా ఉంటుంది

★వృశ్చికం·—జాయింటు వ్యాపారమయినా, భారీ వ్యాపారమైనా,సక్రమంగా జరిగేమార్గముంటుంది. నూతన వ్యాపారం ప్రారంభించే అవకాశముంటుంది. స్త్రీలకు : వస్తు సేకరణకు, శుభ కార్యాలోచనలకు సదవకాశాలు ఉండగలవు. ఉద్యోగస్తులకు సదవకాశాలు లభిస్తాయి. గ్రహించాలి.

★ధనుస్సు:—నాల్గు విధాలా మేలు జరిగేవారం. కళాసాహిత్య రంగాలలో మీకు మంచి అవకాశాలు లభ్యమవుతాయి. దూరబంధువులుయింటికి రాగలరు. ఒకానొక బంధుత్వ విషయాన్ని గూర్చి తర్జనభర్జనలుండగలవు స్త్రీలకు సన్నిహితులతో మాట పట్టింపులు రాగలవు. ఆరోగ్యలోపం కొందరకు చెప్పగలవారమే

★మకరం.—ఆదాయనికి లోటులేదు. అనుకున్న వ్యవహారాలు అలాగే జరిగిపోతాయి, అలవాటుగాచేసే వ్యాపారంలో చెప్పదగిన మార్పులు ఏమీలేవు. ఉద్యోగంలో పెంపుకు చేసే ప్రయత్నాలు ఫలితానికి రాగలవు. స్త్రీలకు : ముఖ్యరంగాలలో సదవకాశాలుంటాయి.

★కుంభం —నటనా విధానంలో పరిచయంగల వారికి మేలైనవారం. చిత్ర నిర్మాతలకు సదవకాశాలు లభిస్తాయి. వైద్య వృత్తిలోని వారికి ప్రకాశమున్నది చాలమందికి క్రయ విక్రయాలలో లాభించే మార్గం లేకపోలేదు. స్త్రీలకు — పత్రికా ప్రకటనలో, రచనలో, నూతన వ్యవహారాలలో మేలైన వారం.

★మీనం —మీకుగలపట్టుదల, ప్రజ్ఞ,చాతుర్యం, తెలివితేటలు, అనుభవాన్ని మీ వ్యాపారాభివృద్ధికి ఉపయోగించండి· క్రయ విక్రయాలలో చూపండి. ఉద్యోగంలో అభివృద్ధి కోరేవారు యింకా కొంతకాలం ఆగాలి స్త్రీలకు . అన్నివిధాలా అనుకూలవారమే ఆశించిన ప్రకారమే అన్నిరంగాలలో అభివృద్ధి, లబ్ధి కనిపించుట గమనింపగలరు

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి*




బద్ధకంగా నిద్రలేచి ఒళ్లు విరుచుకుంటూ వాచీ చూశాను. అప్పుడే ఏ ని మి ది కావస్తోంది. మై గాడ్! ఏనాడూ ఆరు గంటలు దాటాక నిద్ర పోని నాకు యింత మొద్దునిద్రెలా పట్టింది? త్రిభువన్ ఏడీ? అతను కూడా నిద్ర లేవలేదేమో? అనుకుంటూ కిటికీలోంచి బైటకి చూశాను.

చుట్టూరా కనుచూపు మేర కొండలూ అడవులూ తప్ప నర సంచారమన్న మాట లేదు. ఆకాశం దట్టంగా మేఘావృతమై సన్నటి తుంపర పడ్తోంది. ఉండుండి చల్ల గాలి రివ్వున వీస్తూ, అప్పటికింకా పూర్తిగా నిద్ర మత్తు వదలని, నాకు మళ్లీ జోలపాట పాడబోతోంది. ర చ యి త గా ప్రకృతి సౌందర్యాన్ని ఆరాధించేవాణ్నే అయినప్పటికీ, ఇక్కడి, ఈ ప్రశాంతతా స్తబ్దతా రెండు రోజుల్లోనే నాకు విసుగు పుట్టించేశాయి. అవును మరి! హైదరాబాద్ నగర మెక్కడ? అస్సాం రాష్ట్ర సరిహద్దుల్లోని ఈ మారుమూల కుగ్రామం ఎక్కడ? త్రిభువన్‌తో పరిచయ మనేదే లేకపోతే తనసలిక్కడికి వచ్చేవాడా?

త్రిభువన్! అతనితో నాకు ఏడెనిమిది సంవత్సరాల పరిచయం. అతని స్వరాష్ట్రం అస్సాం అయినప్పటికీ, అతను తన కాలేజి చదువులని, హైదరాబాద్‌లోని వాళ్ళ అన్నయ్య దగ్గిర కొనసాగించటంతో మా పరిచయానికి

# బలి

అవకాశం ఏర్పడింది పరిచయం ఎంత మందితో ఏర్పడ్డా కొంతమందితో మాత్రమే అది స్నేహంగానూ, ఆత్మీయతగానూ బలపడుతుంది చదువు ముగించుకుని ఎవరి దారిన వాళ్ళు వెళ్ళవల్సిన్నాటికి మే మిద్దరం ఆప్త మిత్రులుగా విడిపోయాం నేను హైదరాబాద్‌లో ఏదో బ్యాంక్ జాబ్‌లో స్థిరపడగా, త్రిభువన్ ఈ మారుమూల అరణ్య ప్రాంతంలో ఫారెస్ట్ కాంట్రాక్టర్‌గా లక్షల మీద వ్యాపారం సాగిస్తున్నాడు గతంలో అనేకసార్లు తమ రాష్ట్రానికి రమ్మని త్రిభువన్ ఆహ్వానించి ఉన్నప్పటికీ అందుకు నాకు వీలు చిక్కింది ఇప్పుడే రెండు రోజులు త్రిభువన్ ఆతిథ్యంలో గడిపాక నాకు నా ఉద్యోగమూ, బాధ్యతలూ గుర్తుకొచ్చాయి. ఇంటిమీదికి గాలి మళ్లింది ..

ఆలోచనల్లో మునిగి నేను త్రిభువన్ పలకరింపుతో ఈ లోకంలోకి వచ్చాను.

"హల్లో రాజా గుడ్‌మార్నింగ్! రాత్రి బాగా నిద పట్టినట్టుందే" అంటూ లోపలికొచ్చాడు.

"బ్రహ్మాండంగా పట్టింది" అంటూ నేను నిద్రమంచంమీద నుంచి దిగి, కాలకృత్యాలు తీర్చుకునేందుకు ఉద్యుక్తుణ్ణయ్యాను దంత ధావనం ముగించుకుని, వేడివేడి టీ రెండు కప్పులు తాగేసరికి నా బద్ధకం పూర్తిగా వదిలిపోయి కొత్త ఉత్సాహం వచ్చింది. త్రిభువన్‌తో కాసేపు అవీ యివీ మాట్లాడి చివరికి నా మనస్సులో మాట బైట పెట్టాను.

"బ్రదర్ రేపు నేను బయల్దేరాలి. అవతల రాచకార్యాలు చాలా చాలా ఉన్నయ్ మరి! అదీగాక అసలు ఇంత నిర్జనంగా ఉన్న చోట నువ్వెలా ఉండగలుగుతున్నావో కానీ, నాబోటి వాడికైతే పిచ్చెక్కటం ఖాయం."

"అవును! నువ్వు రచయితవి కదూ! నీకెప్పుడూ కళ్ళముందు మనుష్యులుంటే తప్ప బుర్ర పనిచెయ్యదు. నువ్వు వెళ్తానంటె నాకభ్యంతరం లేదుకానీ, ప్రస్తుతం గౌహతీలో చాలా గొడవగా ఉందిట. ట్రెయిన్స్ సరిగ్గా తిరగట్లేదు ఒకటి రెండు రోజుల్లో పరిస్థితి చక్కబడచ్చు అప్పుడు బయల్దేరుదువుగాని. ఈ లోపల రేపు యిక్కడికి దగ్గరలో ఉన్న గూడెం ప్రజలకి నిన్ను పరిచయం చేస్తాను.

వాళ్ల గురించి తెల్సుకోవటం నీకూ చాలా ఆసక్తికరంగా ఉంటుంది'' అన్నాడు త్రిభువన్.

నేను తల ఊపాను.

మర్నాటి ఉదయం మేము బయల్దేర్దామనుకునే వేళకి ఇంకా వర్షం కురుస్తూనే ఉంది

''ఇక్కడ ఏడాదికి పది నెలలు ఇలానే ఉంటుంది మనం జీపులో వెళ్తాం కాబట్టి ఫరవాలేదు'' అంటూ బయల్దేర తీశాడు త్రిభువన్ దట్టమైన అరణ్య మధ్యంలో అస్పష్టంగా ఉన్న కచ్చా మార్గం గుండా అరగంట సేపు పయాణం చేశాక దూరంగా కొన్ని గుడిసెలు కనిపించాయి. గూడెం చేరగానే జీపు ఆపి కిందికి దిగాము. మేము గూడెం సమీపిస్తూండగానే, గుడిసెలలోని వారు త్రిభువన్‌కి గౌరవ సూచకంగా అభివాదం చెయ్యటం గమనించాను. ఇంతలో గూడెంలోని ఒక వ్యక్తి మాకు ఎదురు వచ్చి త్రిభువన్‌తో ఏదో చెప్పాడు త్రిభువన్ తల పంకించి అతన్ని అనుసరించాడు. అక్కడి వ్యక్తులనీ, వాళ్ల విచిత్ర వేషధారణనీ, పరిసరాలనీ గమనిస్తూ నేను కూడా ముందుకి నడిచాను.

''భాయ్ మనం మంచి సమయానికి వచ్చాం ఇవాళ గూడెంలో పెద్ద ఉత్సవం జరుగుతోంది దానికి మనం ముఖ్య అతిధుల మన్న మాట ఈ ఉత్సవం నీకు నిజంగా మర్చిపోలేని సంఘటనగా నిలుస్తుంది'' అన్నాడు త్రిభువన్.

మాతోపాటు వచ్చిన వ్యక్తి మేం కూర్చునేందుకు అనువైన చోటు చూపించి నిష్క్రమించాడు.

మేము కూర్చున్న స్థలానికి కొన్ని వందల గజాల దూరంలో బ్రహ్మాండమైన దేవీ విగ్రహ మొకటి భయంకరంగా గుడ్లురిమి చూస్తూ నిల్చుంది ఆ విగ్రహం ముందు అనేకమంది గూడెంలోని స్త్రీ పురుషులు ఒళ్లు మరచిన ఆవేశంతో నృత్యం చేస్తున్నారు. విగ్రహానికి కుడివైపున ఒక బలిష్ఠమైన దున్నపోతు కట్టివేయబడి వుంది అక్కడికి కొంచెం దూరంగా సుమారు ముప్ఫై పంవత్సరాల వయసు కలిగిన ఒక పురుషుడూ, ఒక స్త్రీ, దేవీ విగ్రహంముందు కూర్చుని, గూడెం పెద్దలా కనిపిస్తున్న పురోహితుడు జరిపించే క్రతువుని నిర్వహిస్తున్నారు ఆ ప్రాంతమంతా ఈలలూ, చప్పట్లూ అరుపులూ, డప్పులూ బాకాలూ మొదలయిన వాటి ధ్వనులతో, అత్యంత కోలాహలంగా, అంతకు మించి నాబోటి కొత్త వారికి భయంతో ఒళ్లు జలదరింప చేసేలా ఉంది... నా సందేహాలని అర్థం చేసుకున్న వాడిలా త్రిభువన్ గొంతు సవరించుకుని చెప్పటం ప్రారంభించాడు.

''ఒకప్పుడు బెంగాల్‌ని భయ భ్రాంతం చేసిన పిండారీలకి చెందిన వారిలో కొందరు ఇటు వలస వచ్చి ఇక్కడ స్థిరపడ్డారు. అయితే అలా ఇక్కడ స్థిరపడిన వారిలో నాయకత్వం కోసం జరిగిన ఘర్షణలవల్ల వాళ్లు మళ్లీ రెండు తెగలుగా చీలిపోయారు. ఒక తెగవారిని ''లామాంగ్''లనీ, రెండో తెగ వారిని ''చురియా''లనీ అంటారు ప్రస్తుతం మనం ఉన్న గూడెం ''లామాంగ్'' లకి చెందింది చురియాలు ఇక్కడికి పది మైళ్ల దూరంలో కొండకి అవతలి వైపున ఉంటారు. ఈ రోజుకి కూడా ఈ రెండు తెగల వారికీ, మధ్యన పచ్చగడ్డి వేస్తే భగ్గుమనేంత వైరం ఉంది. ఒకరి గూడేన్ని మరొకరు తగలపెట్టుకోటం, ఒకరి పశువులనీ స్త్రీలనీ, మరొకరు అపహరించుకు పోవటం, కోపాలు మరీ తారస్థాయికి చేరితే, రెండు వర్గాలవారూ ఎదురెదురుగా నిలిచి జరుపుకునే పోరాటాలలో పదుల సంఖ్యలో వారూ వీరూ చావటమూ చాలా తరచుగా జరిగే సంఘటనలే. అసలు ఈ రెండు తెగవారి మధ్యా పూర్తి సయోధ్యని సాధించటమే, ఇక్కడి గిరిజన సంక్షేమ శాఖాధికారుల ఏకైక లక్ష్యం. సరే! ఆ విషయాలు అలా ఉంచి ఇప్పుడు మనం చూస్తున్న ఉత్సవ విశేషం ఏమిటంటే అరుగో ఆ దేవీ విగ్రహం ముందు కూర్చున్నారే! వాళ్ళు ఈ గూడెం పెద్దకి కొడుకూ, కోడలూ అవుతారు. వాళ్లకి పెళ్ళయి ఎనిమిదేళ్లైందిట. ఇంకా పిల్లలు లేరు. ఇక్కడి వాళ్ళకి ఓ నమ్మకం వుంది. ఈ విధంగా క్రతువు జరిపి ఓ దున్నపోతుని దేవికి బలియిస్తే, ఏడాది తిరిగేలోగా ఎంతటి గొడ్రాలైనా మాతృమూర్తి అవుతుందని. ఇప్పుడు జరుగుతున్న తతంగం అదే ఏడాది గడిచాక కూడా ఆమెకి సంతానం కలగకపోతే దేవి ఆమెని శపించినట్టే పరిగణిస్తారు ఆమె భర్త ఆమెని విడిచిపెట్టి మరొకరిని వివాహమాడేందుకు, వాళ్ళ కుల పెద్దలు అంగీకరిస్తారు. ఆ విధంగా అతను మరో స్త్రీని వివాహమాడితే, మొదటి భార్య, ఆ కుటుంబంలో పేరుకు మాత్రం సభ్యురాలే అయినప్పటికీ, ఎటువంటి గౌరవాలూ అధికారాలూ ఆమెకి లభించవు ఒకవేళ...'' అనర్గళంగా సాగిపోతున్న త్రిభువన్ వాక్ప్రవాహానికి అడ్డుకట్ట వేస్తున్నట్టు ఒక్కసారిగా ఆ ప్రదేశంలోని ధ్వనులు తారస్థాయికి చేరాయి. కొంతమంది వ్యక్తులు ఆ దున్నపోతు కాళ్లని తాళ్లతో కట్టివేయ సాగారు తన మీదికి ముంచుకొస్తున్న ప్రమాదాన్ని గుర్తించినట్టు, ఆ ఆటవికుల బారి నించి తప్పించుకునేందుకు ఆ మూగ ప్రాణి



వెదుకుతున్న వృథా ప్రయాసకి నా కళ్లు చెమర్చాయి.

నా పరిస్థితిని గమనించిన త్రిభువన్, నా భుజంమీద చేయివేసి "టేకిట్ ఈజీ రాజా" అన్నాడు అనునయంగా.

"ఇంకా ఈ రోజుల్లో కూడా ఇలాటి నమ్మకాలు..." నేను ఏదో అనబోతూండగా, దూరంగా ధ్వనులు మరోసారి మిన్ను ముట్టాయి. చూస్తూండగానే కొంతమంది బలిష్ఠమైన వ్యక్తులు, ఆ దున్నపోతు మెడని బలిపీఠం మీద తొక్కిపెట్టారు. ఒక వ్యక్తి తన చేతిలోని గొడ్డలిని వేగంగా పైకెత్తటంమాత్రం నాకు గుర్తుంది ...

నా మాటలు ఆగిపోయాయి. చేతులు స్తంభించాయి. నా చెవులు ఆ భయంకర ఆర్తనాదాన్ని వింటూ, నా కళ్లు ఎర్రటి ఆ రుధిర ధారల్ని చూస్తూ ఉండిపోయాయి ... జీవితంలో అలాటి దృశ్యాన్ని అంతదగ్గర్నించి చూడటం అదే మొదటిసారి నాకు.

నేను ఆ షాక్‌నించి కోలుకునేసరికి మా జీప్ తిరుగుప్రయాణంలో ఉంది.

"త్రిభువన్ మొత్తానికి భలేచోటుకి తెచ్చావు ఈ రోజు నేను చూసిన దృశ్యాన్ని ఎప్పటికీ మర్చిపోలేను. మూఢనమ్మకాల గురించి చదవటమేగానీ ప్రత్యక్షంగా చూసింది ఇప్పుడే" అన్నాను.

"యూ ఆర్ రాంగ్ మై డియర్ ఫ్రెండ్. మూఢనమ్మకాలని మనం ప్రతిరోజూ చూస్తూనే ఉంటాం. దేవుడు మెచ్చుతాడని గుళ్లో కొబ్బరికాయ కొట్టటానికీ, దేవి మెచ్చుతుందని అడవిలో దున్నని బలి యివ్వటానికి మౌలికంగా తేడా ఏమీలేదని నా ఉద్దేశ్యం" అన్నాడు త్రిభువన్ చిరునవ్వు నవ్వుతూ.

హఠాత్తుగా నాకు గుర్తొచ్చింది, త్రిభువన్ పరమ నాస్తికుడన్న విషయం. నాస్తికత, ఆస్తికత అన్న విషయాల మీద అతనితో చర్చించే ఓపికలేదు నాకు "సరే యింతకీ, ఏడాది లోపల ఆమెకి పిల్లలు పుడ్తారా పుట్టరా చెప్పు ?" అన్నాను మాట మారుస్తూ.

"ఏమో నాకేంతెల్సు! ఆ అమ్మాయికి నెల తప్పితే నీకో ఉత్తరం వ్రాస్తాలే చూసి వెళ్దువుగాని" అన్నాడు కన్ను కొడుతూ.

ఇద్దరం నవ్వుకొన్నాం.




మర్నాడే నేను ఇంటికి తిరుగుముఖం పట్టాను. హైదాబాద్ చేరాక నేను మళ్లీ నా మామూలు జీవితంలో పడ్డాను కాలం మూడు కాలెండర్లని వెనక్కి తోసింది ఈ మధ్యకాలంలో నేను భారతిని పెళ్లి చేసుకోవడమూ, ప్రమోషన్ మీద విజయవాడ ట్రాన్స్‌ఫర్ కావటమూ, సంసార జీవితంలో పూర్తిగా మునగటమూ జరిగాయి

ఒకరోజు రాత్రి ఎవరో ఫ్రెండ్‌ని రైలెక్కించడానికి వెళ్లిన నాకు,అనుకోకుండా ప్లాట్‌ఫారం మీద కన్పించాడు త్రిభువన్. మద్రాస్‌లోని తన బావగారి యింటికి వెళ్లి మళ్లీ తిరుగు ప్రయాణంలో ఉన్నానని చెప్పాడు. నా బలవంతం మీద తన ప్రయాణాన్ని మధ్యలో బ్రేక్ చేసుకుని నాతో యింటికి బయల్దేరాడు రాత్రి పొద్దుపోయేదాకా ఈ మూడేళ్లలో జరిగిన విషయాల గురించి పిచ్చాపాటీ మాట్లాడుకున్నాం. హఠాత్తుగా నాకు ఆనాడు మూడేళ్ల క్రిందట చూసిన దృశ్యం గుర్తుకొచ్చింది. "అన్నట్టు ఆ లామాంగ్ దంపతులకి పిల్లలు పుట్టారా ?" అని అడిగాను ఆత్రుతగా!

ఒక్కసారి గలగలా నవ్వాడు త్రిభువన్. "అయితే నువ్వింకా ఆ విషయం మర్చిపోలేదన్నమాట. కానీ నీ ప్రశ్నకి సూటిగా సమాధానం చెప్పటం కష్టం – ఆమెకి పండంటి కొడుకు పుట్టాడని మాత్రం చెప్పగలను."

"అయితే ... అయితే వాళ్ల నమ్మకాలలో నిజం ఉందన్నమాటేనా ?" అడిగాను నేను అయోమయంగా.

"ఆ మాట నే ననలేదుగా. నిజం చెప్పాలంటే ఒక్కరాత్రిలో వారు తమ 'బలి' ఆచారానికి స్వస్తి చెప్పారు. ఇప్పటికి రెండేళ్లనించీ ఆ గూడెంలో బలి అన్నది జరగలేదు."

నా చెవులని నేను నమ్మలేకపోయాను. "కొంచెం వివరంగా చెప్పకూడదూ అలా ఒక్కొక్క ముక్క చెప్పలేకపోతే" అన్నాను విసుగ్గా.

"అలా అడిగావ్! బావుంది" అంటూ గొంతు సవరించుకున్నాడు. "నువ్వు అప్పుడు వచ్చివెళ్ళాక ఏడాదిదాటినాకూడా ఆ లామాంగ్ యువకుడి భార్యకి సంతానం కలగలేదు. దాంతో అతను వాళ్ల సాంప్రదాయం ప్రకారం ఆమెకి విడాకులిచ్చి ఆమెతో సంసార జీవితాన్ని విరమించుకుని మరో యువతిని పెళ్ళాడాడు.

ఆ వివాహం జరిగిన ఆర్నెల్లకి ఒకనాడు ఒక భయంకర సత్యం బైటపడింది లామాంగ్ యువకుడి మొదటి భార్యకి ఒక చురియా తెగ యువకుడితో అక్రమ సంబంధం ఉందిట. సాక్షాత్తూ ఆమె భర్తే, ఆమె ఆ చురియా యువకుడితో కలిసి ఉండగా చూసి – మిగతావాళ్ళకి చూపించాడు. ఆ 'చురియా' యువకుడిని అక్కడికక్కడే, నిర్దాక్షిణ్యంగా చంపేశారు. కాని ఆమెని చంపటానికి మాత్రం వారి కవకాశం లేక పోయింది. ఎందుకంటే అప్పుడామె మూడు నెలల గర్భవతి గర్భవతి అయిన స్త్రీని చంపటానికి వాళ్ల చట్టం ఒప్పదు; అందుచేత ఆమెని గూడెంనించి వెలివేసి వగిలేశారు.

చురియా తెగ యువకుని మరణంతో, మళ్ళీ రెండు వర్గాలమధ్యా అగ్గి రాజుకుంది. కొన్నిరోజులపాటు ఆ ప్రాంతంలో ఇరువర్గాల వారి రక్తమూ ఏరులై పారింది దాంతో ప్రభుత్వం రంగంలోకి దిగి కొంతమందిని అరెస్టుచేసీ, కొంతమందికి రక్షణ కల్పించీ, ఆ ప్రాంతంలో ఓ చిన్న పోలీస్ ఠాణాని ఏర్పర్చి మళ్ళీ అతికష్టం మీద ప్రశాంతతని నెలకొల్పింది

ఇంతకీ ఆశ్చర్యమేమిటంటే, ఆ సంఘటన తర్వాత ఆ ప్రాంత గిరిజనుల్లో ఒక విచిత్రమైన మార్పు వచ్చింది వారు పూర్వంలాగా పతిచిన్న అవసరానికీ బలులివ్వటం మానేశారు నిజం చెప్పాలంటే ఆ గూడెంలో బలి తతంగం జరిగి ఇప్పటికి రెండేళ్లైంది'' అన్నాడు త్రిభువన్.

"వాళ్ళలో ఒక్కసారిగా ఈ మార్పు రావటానిక్కారణం ఏమిటంటావ్ ?'' అడిగాను నేను సాలోచనగా

"నువ్వురచయితవి మనుష్యుల మనస్తత్వాలనీ, ఆలోచనా తీరులనీ, అవగాహన చేసుకోవటం నీ వంతు. హేతుబద్ధం కాని నమ్మకాల కన్నా అనుభవం నేర్పే పాఠాలు వ్యక్తుల్ని బలంగా ప్రభావితుల్ని చేస్తాయన్న నిజాన్ని నీకు గుర్తు చెయ్యక్కర్లేదనుకుంటా'' అంటూ గట్టిగా ఆవులించి దుప్పటిని నిండుగా కప్పుకుని, నిద్రకుపక్రమించాడు

గిరిజనుల్లో హఠాత్తుగా వచ్చిన మార్పుకి కారణమేమిటా? అని దీర్ఘాలోచనలో పడ్డ నాకు చాలా సేపటికి కానీ సమాధానం అస్పష్టంగానైనా స్ఫురించలేదు

"లామాంగ్ యువకుడితో ఎనిమిదేళ్ళు సంసారంచేసి క్రతువు జరిపినా తల్లి కాలేక పోయిన యువతి చురియా యువకుడితో కేవలం ఆర్నెల పరిచయంతో, మాతృత్వాన్ని పొందగలిగిందంటే, అందుక్కారణం దేవి అనుగ్రహమో, లామాంగ్ యువకుడి అసమర్థతో, చురియా యువకుడి సామర్థ్యమో వారికి అర్థమై ఉంటుంది కానా ?'' అంటూ సమాధానంకోసం త్రిభువన్ కేసి చూశాను కానీ అప్పటికే అతను నిద్రాదేవి గాఢ పరిష్వంగంలో బందీ అయి చాలా సేపైంది

నేనొకసారి గట్టిగా ఆవులించి ఒళ్ళు విరుచుకుని, బద్ధకాన్ని తరిమి కలమూ, కాయితమూ అందుకున్నాను



పట్టువలె మృదువైనది
పగడంవలె అందమైనది
HTM PIL 2647
పాండ్స్
వ్యానిషింగ్ క్రీమ్
నాజూకుగావుండే అనువైన మేకప్
ముఖ పౌడర్‌కి సంపూర్ణమైన ఆధారం
చర్మానికి ఉత్తమమైన రక్షణ
POND'S




POND'S
VANISHING
CREAM
POND'S
VANISHING CREAM

# హైదరాబాద్ నోట్ బుక్

తిరుమల రామచంద్ర

## శ్రీ ఎ ఆర్ కృష్ణకు ఘన సన్మానం :

వృత్తితో అభియంత అయినా, అభిరుచితో అభినేత మిత్రుడు శ్రీ ఎ ఆర్ కృష్ణ— అడుసుమిల్లి రాధా కృష్ణశాస్త్రి కనుకనే నాటక రంగానికే అంకితమైపోయాడు విద్యార్థి దశనుంచే నాటకాలతో పాటు దేశ స్వాతంత్ర్యోద్యమంలో ఆసక్తి కలిగింది కృష్ణకు —నాటి హైదరాబాద్ రాష్ట్ర కాంగ్రెస్ నాయకత్వాన జరిగిన స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నాడు తర్వాత సోషలిస్టు పార్టీ హైదరాబాద్ నగర శాఖ కార్యదర్శి అయ్యాడు చదువు పూర్తయిన తర్వాత ఎలెక్ట్రిసిటీబోర్డులో చేరి ప్రస్తుతం ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు పదవిలో ఉన్నారు నాటక రంగస్థల కళాబోధనలోను, ప్రదర్శనంలోను లండన్‌లోని బ్రిటిష్ డ్రామాలీగ్ అనే సంస్థలో శిక్షణ పొందాడు తర్వాత ఫోర్డుఫౌండేషన్ ఆర్థిక సహాయంతో అమెరికాలోను శిక్షణ పొందాడు ప్రపంచ విజ్ఞాన సమితికి చెందిన ఇంటర్నేషనల్ థియేటర్ ఇన్‌స్టిట్యూట్ సభ్యుడుగా వివిధ ఆసియా యూరోప్ దేశాల రంగస్థల రాజధానులను 19 మార్లు చూచివచ్చారు. ఫ్రాన్సు, జర్మనీ, నెదర్‌ల్యాండ్సులలో తెలుగువారి తోలు బొమ్మలాటకు గొప్ప ఖ్యాతి తెచ్చారు. ఇండియన్ నేషనల్ థియేటర్, హైదరాబాద్‌శాఖ, ఆంధ్రప్రదేశ్ నాట్య సంఘం, భారతీయ నాట్య సంఘం కార్యనిర్వాహక సభ్యుడుగాను, కేంద్ర సంగీత నాటక అకాడెమీ, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీ, ఆంధ్ర నాటక కళా పరిషత్తుల సభ్యుడుగాను, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీ విశిష్ట సభ్యుడుగాను వున్నాడు ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లిని నాటకీకరించి, ఆంధ్రదేశమంతటా ఏకకాలంలోనే పన్నెండు రంగస్థలాలలో నాటకమొక్కసారిగా ప్రదర్శించాడు. ఇలాంటి ప్రదర్శనం ప్రపంచంలోనే అనిదంపూర్వం. మృచ్ఛకటికంలో చారుదత్తుడుగాను, ప్రతాపరుద్రీయంలో పేరిగాడుగాను, విలునామాలో ధర్మారావుగాను, కన్యాశుల్కంలో రామప్ప పంతులుగాను నటించి ప్రేక్షకుల హృదయాలను చూరగొన్నాడు ఇంతవరకు శతాధికమైన నాటకాలలో నటించాడు, దర్శకత్వం వహించాడు కృష్ణ వెండితెర కూడ ఎక్కాడు. శ్యామ్‌బెనగల్ అనుగ్రహంలోను, మృణాల్‌సేన్ ఒక వూరి కథలోను నటించాడు రంగస్థల విద్యార్థుల కోసం తొలి పాఠ్య పుస్తకం "రంగస్థల శాస్త్రము" రచించాడు ఇది 1970 లో ప్రచురితమైంది కృష్ణ రంగస్థలానికి చేసిన సేవను గుర్తించి రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ థియేటర్ ఇన్‌స్టిట్యూట్, అండ్ రెపర్టరీ అనే సంస్థను నిరుడు స్థాపించి దానికి కృష్ణను సంస్థాపక అధ్యక్షుడుగాను, డైరెక్టరు గాను నియమించింది. ఈ సంస్థ పక్షాన కృష్ణ మా నాన్న కావాలి అనే బాలల నాటకాన్ని, అధునాతన కాలానికి, సంఘానికి అనుగుణంగా ప్రవేశ విష్కంభాలు పొందుపరచి అభిజ్ఞానశాకుంతలాన్ని పెక్కుసార్లు ప్రదర్శించి మన్ననలు పొందాడు రంగస్థలానికి జీవితాన్నే మీదుకట్టిన కృష్ణను ఆగస్టు 14 న రవీంద్రభారతిలో ప్రత్యేక సన్మాన సంఘం ఘనంగా సన్మానించింది సన్మాన సంఘాధ్యక్షులు శ్రీ నార్ల తాతారావు సన్మాన సభకు అధ్యక్షత వహించారు శ్రీ కృష్ణ తను ఎలెక్ట్రిసిటీ బోర్డు సభ్యుడు కావడం తనకు గర్వకారణమని, మాలపల్లి నాటకం అతని గొప్పతనానికి తార్కాణమని శ్రీ తాతారావు ప్రశంసించారు రాష్ట్ర సాంస్కృతిక, పర్యాటక శాఖా మంత్రి శ్రీ రామకృష్ణంరాజు ప్రత్యేక సంచికను ఆవిష్కరిస్తూ, మాలపల్లి నాటక ప్రదర్శనలో ప్రభుత్వం తోడ్పడుతుందన్నారు గిరిజన సంక్షేమ శాఖా మంత్రి శ్రీ సిహెచ్. శ్యామలరావు తమ ప్రసంగంలో నాటక ప్రదర్శనం పర్యవసానం ప్రబోధమని, నాటక రంగానికి ఎనలేని సేవచేసిన ఎ ఆర్ కృష్ణ గౌరవార్థం కృష్ణావీక్ జరుపాలని సూచించారు రాజకీయాలలో పాలక పక్షమని, ప్రతిపక్షమని ఉన్నా, నాటకం విషయంలో అన్నీ ఒకేపక్షమని శ్రీ జూపూడి యజ్ఞనారాయణ అన్నారు. తామూ నాటకాలాడామని, వాటిని ప్రజాసామాన్యానికి అందించడానికే ప్రయత్నించామని ఆయన అన్నారు సామాజిక జీవితాన్ని యథాతథంగా చిత్రించిన కళకోసం కన్నీరు కార్చే సహృదయు



శ్రీ ఏ. ఆర్. కృష్ణ

లను తయారు చేసిన వ్యక్తి కృష్ణ అని, శ్రీ విడియాల చంద్రశేఖరరావు అన్నారు కళల కోసం అకాడెమీలు నెలకొల్పాలనే ఉద్యమం ప్రారంభించిన వాడు కృష్ణ అని శ్రీ బి కృష్ణంరాజు అన్నారు. శ్రీ కృష్ణ తెలుగు నాటకానికి నవీనత ఇచ్చి, ప్రయోగాన్ని ఆధునికం చేశారని శ్రీ దేశిరాజు హనుమంతరావు అన్నారు కృష ఒక సంస్థ, నిజాయితీ కలవాడు ఆయన నిర్వహించిన నాటక సంస్థలో నేనూ శిక్షణ పొందాను ఆయన నాకు గురువు — అని కుమారి వాసిరెడ్డి సీతాదేవి అన్నారు కేంద్ర సంగీత నాటక అకాడమీ అధ్యక్షురాలు శ్రీమతి కమలాదేవి చట్టోపాధ్యాయ కృష్ణను ప్రత్యేకంగా ఆశీర్వదించారు ప్రసిద్ధ ఇంజనీరు శ్రీ మాటూరి గోపాలరావు ప్రసంగిస్తూ, శ్రీ కృష్ణ 1951 లో తొలిసారిగా దేశం కోసం అనే నాటకంలో నటించాడని, రామాయణం తోలుబొమ్మలాటకు విశ్వ విఖ్యాతి ఆర్జించాడని అన్నారు. రామాయణ భారతాలను ఆంగ్లంలో ప్రదర్శించాలని శ్రీ కృష్ణను ఆయన కోరారు పలువురు పంపిన సందేశాలను శ్రీ జె సిద్దయ్య నాయుడు చదివారు దాదాపు 20 నాటక సంస్థలు కృష్ణను పూలదండలతో గౌరవించాయి. శ్రీ తాతారావు కృష్ణను సన్మానించారు కృష సమ్మానానికి కృతజ్ఞత తెలుపుతూ, తాను దేశం కోసం నాటకాలు ఆడడం లేదని, నాటకాలు ఆడకుండా, నటించకుండా వుండలేనని అన్నాడు నేను నటించలేదు. నటనే నా జీవితం కనుక విడిగా నటించడమనేది లేదు — అని అన్నాడు ప్రారంభంలో సన్మాన సంఘం కార్యదర్శి శ్రీ సి ధర్మారావు స్వాగతం చెప్పాను శ్రీ సి. ఎస్ రావు ధన్యవాదాలు సమర్పించిన పిదప శాకుంతలం ప్రదర్శన జరిగింది అన్నం కంటే ఆవకాయ ఎక్కువయినట్టు ప్రసంగాలు ఎక్కువ అయి నాటకాన్ని చాల కుదించడం వల్ల ప్రేక్షకుల మనస్సు చివుక్కు మంది.

## అగ్ని పరీక్షలో నెగ్గిన సీతాదేవి :

కుమారి వాసిరెడ్డి సీతాదేవి రచించిన మరీచిక అనే నవలపై రాష్ట్రప్రభుత్వం విధించిన నిషేధాన్ని రాష్ట్రహైకోర్టు ఆగస్టు 10వతేదీన రద్దు చేసింది. కుమారి సీతాదేవి మహిళా సంక్షేమ శాఖలో డిప్యూటీడైరెక్టరుగా ఉన్నారు రాష్ట్రప్రభుత్వం ఆమె నవలను నిషేధించటమేకాక ఆమెను ఒక మెట్టుదింపి అసిస్టెంట్ డైరెక్టరు పదవిలో తోసింది మరీచిక ప్రభుత్వంపై సాయుధ దళా

# హైదరాబాద్ నోట్‌బుక్

లకు విద్వేషాన్ని, వర్గద్వేషాన్ని రెచ్చగొట్టడమేకాక, యువకులను తీవ్రవాదానికి పురికొల్పుతున్నదని, ఇది భారత శిక్షాస్మృతి 124ఎ, 153 ఎ పరిచ్ఛేదాల కింద శిక్షార్హమైన నేరాలని ప్రభుత్వం నిషేధానికి కారణం చెప్పింది. ప్రభుత్వం నిషేధాజ్ఞలను సవాలుచేస్తూ, అఖిలభారత ప్రజాస్వామ్య న్యాయవాదుల సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ పి. వేంకటేశ్వర్లు దాఖలుచేసిన దరఖాస్తును న్యాయస్థానం చర్చించి నిషేధాజ్ఞలు చెల్లవని తీర్పుచెప్పింది. ధర్మాసనంలోని ముగ్గురు న్యాయమూర్తులు శ్రీయుతులు కోకా రామచంద్రరావు, పి. రామారావు, సి శ్రీరాములు తమ తీర్పులో మరీచిక నవలలోని వాక్యాలు తాముపేర్కొన్న చట్టంలోని నిబంధనలకు అనుగుణంగా ఉన్నవాలన్న విషయాన్ని ప్రభుత్వం సోదాహరణంగా నిరూపించలేదు గనుక నిషేధం చెల్లదన్నారు. కుమారి సీతాదేవిని ఈ విజయంపై అభినందించగా, తన విజయానికి కారణం సహృదయ అభిమానుల సహకారమేనని, వారి ఆదరణ, న్యాయబుద్ధి తనకు బలమిచ్చాయని అన్నారు. ప్రభుత్వం ఒకవైపు తన నవలను నిషేధిస్తూ, మరోకవైపు తన పదవిని తగ్గించటం చూడగా, వీటివెనుక ఏదో కుట్ర ఉన్నట్టు తోస్తోందని ఆమె అన్నారు నవల విషయంలో న్యాయం జరిగింది గనుక, ఉద్యోగం విషయంలోను న్యాయం జరుగుతుందనే ఆశిస్తున్నానని కుమారి సీతాదేవి అన్నారు

**రాంగ్ నంబర్ !**

అలీబేగ్‌ను పిలూ

ఏనంబరు కావాలండీ ? "

అలీబేగ్ అంటూంటే నీక్కాదూ?

అలీబేగ్ ఎవ్వరూ లేరండీ

లేరంటూవేందయ్యా చూడు. అలీబేగ్.

రాంగ్‌నంబర్ సార్

రాంగ్‌నంబరంటూవేమిటి? నేను నంబర్ సరిగా చెప్పితే

మీరు తిప్పొచ్చుసార్. రాంగ్‌నంబర్ రావడం మీరు తిప్పడం బట్టే వుండదు

తప్పెట్లవుద్ది? పిలూ అలీబేగ్‌ని.

* * *

ఇదీవరస రోజూ దాదాపు 20 రాంగ్ నంబర్లు వస్తూంటాయి చస్తున్నాము మాట్లాడ్లేక— అంటుంది హైకోర్టులో కోర్టు మాస్టర్ శ్రీమతి కె సత్యకుమారి ఏ భోజనమప్పుడో, స్నానాలగదిలో వున్నప్పుడో, పూజాసమయంలోనో వస్తాయి, టెలిఫోన్ పిలుపులు. ఆదుర్దాగా వెళ్లడం రాంగ్ నంబర్ కావడం, అవతలివాళ్లు మేమేదో తప్పు చేసినట్టు దబాయించడం, ఎవరి తప్పులకో మనం చీవాట్లు తినడమేమి ఖర్మఅనుకుంటూ విసుగ్గా రిసీవర్ పెట్టడం—నిత్యవిధులలో ఒకటయిందంటుంది ఆమె కాలాన్ని, డబ్బును వృధా చేయకుండా వుండడం కోసంగిదా పోసుకు డిపాజిట్టు, చార్జెస్ తగలెయ్యడం. అత్యవసర కనీసపుసౌకర్యం లేక పోగా, రాంగ్ నంబర్లు రాయిడేమిటని పోనున్న పెద్దమనుష్యులందరూ వాపోతున్నారు. రాంగ్ నంబర్లకు కారణాలను అధికారులు విధాన సభలో మంత్రుల వివరణల లాగ ఎంతగాచెప్పినా పోనున్న పెద్దమనుష్యులు విధాన సభ సభ్యులు కారుగదా, వినిపూరుకుండడానికి! నెలనెలకూ బిల్లుల చెల్లింపూ తగ్గదు రాంగ్‌నంబర్ల కష్టింపూ తగ్గదు. టెలిఫోన్‌శాఖవారు, ఏడాదికిన్ని కనెక్షన్లు ఇవ్వాలి అనే విస్తరణ కార్యక్రమంపై చూపుతున్న శ్రద్ధ ఉన్నవాటిని సరిగా నిర్వహించడంలో చూపడం లేదని టెలిఫోన్ వినియోగదారుల అభిప్రాయం. టెలిఫోన్ రాంగ్ నంబర్లే కాదండీ, పరీక్షలలో రాంగ్ నంబర్లు, ఉద్యోగాలలో రాంగ్ నంబర్లు, సంసారంలోను రాంగ్‌నంబర్లే—అంటాడు లోకతత్త్వవేత్త శ్రీ నీలాజంగయ్య మనం భారత దేశంలో పుట్టడమే రాంగ్‌నంబర్— అన్నాడు మరోక రాజకీయవేత్త. నేను ఏ ఏరే డెన్మార్క్ వంటి చిన్న విదేశంలో పుట్టినా ప్రధానమంత్రి అయి వుండేవాడిని—అంటాడు ఆయన నేను సైన్సు చదువడం రాంగ్‌నంబర్, పరేడ్లైనా చదివుంటేమంచి ప్రోత్సాహం వుండేది సైన్సులో మనదేశంలో స్వేచ్ఛకు అవకాశంలేదు విదేశాలకు పోదామంటే అనుమతిలేదు—అంటాడు ఒకవిజ్ఞానశాస్త్రజ్ఞుడు. మనదేశంలో రాంగ్‌నంబర్ కానిదిఒక్క వేదాంతమే నాన్నా బ్రహ్మసత్యం, జగన్మిథ్య అను తలూపుతారు. ఏకోనారాయనో హరి అను తలూపుతారు. శివాత్పర తరంనాస్తి అను తలూపుతారు. హరిహరరూపా అను హరిహర పుత్రా అనుతలూపుతాలు. నేను ఫిలాసఫీ చదివిందేమేల్తైంది రాంగ్‌నంబర్ కానివాళ్ళం నేనూ, నాలాగ ఫిలాసఫీ చదివినవాళ్లమూనూ అన్నాడు అబ్బాయిశేషశాయి. అది వ్యంగ్యమో, నిజమో తేలీక నేను రాంగ్‌నంబర్‌లో పడ్డాను.

**ఉపశ్రుతి :**

ఏంసార్, నటించకుండా వుండలేను నటనే నా జీవితం అంటువ్వాడే ఎ. ఆర్. కృష్ణ. మీకు పోటీ కాదా? — అనడిగాను చనువున్న ఒక రాజకీయ నాయకుణ్ని. మాకు పోటీ ఎవరండీ? అతనిది ఈ జన్మలో జీవితమ్మే వుంటుంది మాకు వచ్చే జన్మలోనూ నటనే జీవితం కదా! — అన్నారు ఆయన. ●


**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.**

# తలనొప్పి కోసం ఎన్నో వాడిచూశాను, అయితే నిజంగా పనిచేసేది ఒక్కటే!

**సారిడన్**

ట్రేడ్‌మార్క్ 'రోష్'

శక్తివంతమైనది. సురక్షితమైనది.
ఒక్కటి వేసుకుంటే చాలు.




HTB RPL 7797

